# జుట్టు రాలడం, చుండ్రు అనే సమస్యలు మీ దరిచేర కూడదనుకుంటే?

## అశ్విని హోమియో హెయిర్ ఆయిల్

ప్రతి రోజు వాడండి.

**ఇతర లాభాలు**

- ✔ జుట్టు ఒత్తుగా, మృదువుగా, ఆరోగ్యంగా పెరిగేందుకు సహకరిస్తుంది.
- ✔ చిన్న వయస్సులో జుట్టు తెల్లబడటాన్ని అరికడుతుంది.
- ✔ మాడు నొప్పిని తగ్గిస్తుంది.
- ✔ మెదడును చల్లబరిచేది.
- ✔ జిడ్డులేనిది.



**వాడిన వారి అభిప్రాయము**

గౌరవనీయులైన అశ్విని హెయిర్ ఆయిల్ ఉత్పత్తి దారులకు,

నేను గత కొన్ని నెలలుగా చుండ్రు బాధతో ఉన్నాను. దీనివలన చదువు యందు జ్ఞాపకశక్తి ఉండేది కాదు. ఎప్పుడూ టెన్షన్‌గా ఉండేవాడిని. మా ఫ్రెండ్ ఒకడు అశ్విని హెయిర్ ఆయిల్ వాడమని చెప్పాడు. అంతే నేను అశ్వినిని వాడుతున్నాను. చుండ్రు పూర్తిగా పోయింది. ఇప్పుడు టెన్షన్ లేకుండా మెదడు చల్లగా ఉంది. ఇంత మంచి హెయిర్ ఆయిల్ ఉత్పత్తి చేసిన మీకు నా కృతజ్ఞతలు.

పాణిగ్రాహి రాజశేఖర్, II B.Com., విజయవాడ

IMPROVED TO CHECK DANDRUFF




స్వచ్ఛమైన కొబ్బరినూనెతో తయారి

Anju Ads

సచిత్ర విచిత్రం

# గుండెపోటులో ప్రసవం



లాస్ ఏంజిల్సులో ఆస్పత్రిపాలైన ఈ ఇద్దరు పిల్లల తల్లికి అప్పటికే మరోసారి నెలలు నిండివున్నాయి. అయినాసరే, ఆమెకు ఏంజియో ప్లాస్టీ సర్జరీ తప్పనిసరన్నారు గుండె స్పెషలిస్టులు. చేసేది లేక సర్జరీకోసం మత్తుమందు ఇస్తుండగానే సుఖంగా ప్రసవించేసిందీమె. మరికొద్ది నిమిషాలకే ప్రపంచవైద్య చరిత్రలోనే తొలిసారిగా గుండె ఆపరేషన్ కూడా చేశారీమెకు.

# చతుర ప్రపంచం

## పక్షుల వలస

భరత్‌పూర్ నేషనల్ పార్క్‌లో వున్న కేవల్ ఘనా 'బర్డ్‌శాంక్ట్యువరీ' చాలా ప్రసిద్ధి చెందింది. ఇక్కడ ఒక్క ఇండియానుంచే కాక ప్రపంచంలోని అనేక ప్రాంతాలకు చెందిన పక్షులు కన్నుల పండుగగా దర్శనమిస్తాయి. ముఖ్యంగా శీతాకాలంలో ఈ పక్షులు సప్తసముద్రాలను కూడా దాటి ఈ ఘనాపార్కుని చేరుకుంటాయి. ఇలా వచ్చిన పక్షులు లక్షల సంఖ్యలో వుంటాయి.

ఇంతవరకు ఘనా పార్కులో 352 జాతులకు చెందిన పక్షులున్నాయని అంచనా. ఇందులో 110 వలస జాతులు. కాలానుగుణంగా అవి అటూఇటూ ప్రయాణంచేస్తూ వుంటాయి. అందులో ఎక్కువ భాగం సైబీరియా, మంగోలియాలనుంచి వచ్చినవి. ఇవికాక ఆఫ్ఘనిస్థాన్, నేపాల్, శ్రీలంక, చైనా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అరబ్బుదేశాల నుంచి కూడా వస్తూ వుంటాయి.

ఘనాపార్కులో లెక్కలేనన్ని చెరువులున్నాయి. పక్షుల్లో శాకాహారులు, మాంసాహారులు కూడా వున్నాయి. చెరువులనుంచి మాంసాహార పక్షులకి ఎన్నో క్రిమికీటకాలు లభిస్తాయి. ఈ పార్కులో జంతువులు, క్రూరమృగాలు కూడా నివశిస్తూ వుంటాయి.

కానీ ప్రస్తుత కాలంలో ఈ 'ఘనాపార్క్' క్రమేపీ తన ప్రాభవాన్ని కోల్పోతోందంటున్నారు. ముఖ్యంగా ఇక్కడ గడ్డి బాగా పెరగడంతో సరస్సులోని నీరు కాలుష్యానికి గురవుతోందంటున్నారు శాస్త్రజ్ఞులు. ఈ కాలుష్యం కారణంగా సరస్సులకు నీరు తాగడానికొచ్చే జంతువులు రకరకాల రోగాలకి గురవుతున్నాయి.

నూనెకర్మాగారాలనుంచి విడదలయిన సల్ఫర్‌డయాక్సైడ్ ఈ పక్షుల పార్క్‌కి ఎక్కువ ప్రమాదకారి అవుతోంది. అక్కడి వాతావరణం యాసిడ్‌తో నిండిపోతోంది.

బొంబాయి నేచురల్ హిస్టరి సొసైటీకి చెందిన డా॥ సలీమ్ ఆలీ, తదితరులు కూడా ఈ 'ఘనాపార్క్'కి సంబంధించి అనేక సర్వేలు చేసి పక్షులు యొక్క ఆచారవ్యవహారాలను, ఆహారపు అలవాట్లను, వాటి వలస స్వభావాన్ని కూలంకషంగా పరిశోధించారు.

వీరి పరిశోధనల వల్ల తేలిందేమంటే ప్రతి సంవత్సరం కూట్స్ పక్షుల సంఖ్య పెరుగుతూ వస్తోంది. ఇవి మంచినీటి సరస్సులలోకన్నా ఉప్పునీటి సరస్సులలో మునకలు వెయ్యడానికి ఎక్కువ ఇష్టపడటంతో ఘనా పక్షుల పార్కులో ఉప్పునీటి సరస్సులే ఎక్కువ కనిపిస్తున్నాయి.

ఈ పార్కులో 14 కి.మీ. ప్రదేశంలో నీరుకన్న గడ్డి ఎక్కువగా కనిపిస్తుంది. ఇది మాంసాహార పక్షులకు విషమసమస్యగా తయారయింది. నీటిలో కూడా నాచు, గుర్రపుడెక్కలాంటి నీటిమొక్కలు ఎక్కువ పెరగడంతో క్రిమికీటకాదులను పట్టుకోవాలని వాలిన పక్షులు అప్పుడప్పుడు ఈ మొక్కల్లో చిక్కి చచ్చిపోవడం కూడా జరుగుతోంది.

కవర్‌పేజీ ఆర్టిస్ట్: ధని ఏలె




కొన్ని పక్షులు నీటిలో ఈదలేవు. నీటిపై నిలవలేవు. ఇవి నీటికి రెండడుగుల లోతుకు వెళ్ళి క్రిములను ఏరుకుని పైకొస్తూ వుంటాయి. అలాదిగడంలో అప్పుడప్పుడు నాచు మొక్కల్లో దిగబడిపోతూ వుంటాయి. అందులో లోహర్‌జంగ్, జంఘిల్, ఘోగిల్, చందా, బగులా, ఎయివిస్, సారస్ మొదలైన పక్షులు ఈ మొక్కల కారణంగా వలసరావడం మానేశాయి. పూర్వం ఎక్కువగా ఈ పార్కుకి వచ్చే సైబీరియన్ కొంగలు ఇప్పుడు చాలా వరకు తమ రాకను తగ్గించాయి.

ఈ పార్కు 1981లో నేషనల్ పార్క్‌గా ప్రకటించబడింది.

---

## ఊహా చికిత్స

**భ**యంకర రోగాల్ని కూడా ఊహాశక్తి అనే ఔషధంతో పారదోలవచ్చు అంటున్నారు శాస్త్రవేత్తలు. విజ్ఞానశాస్త్రంలో ఈ విభాగాన్ని 'సైకోన్యూరో ఇమ్యునాలజీ' అంటారు.

అన్నాఫ్రాంక్‌లీ అనే ఆమెకి మెడభాగంలో ఓ కంతి ఏర్పడింది. అది కేన్సర్ అనీ ఆమె మరో మూడు నెలలకన్న బతకదనీ తేల్చారు డాక్టర్లు. కుడివైపున పక్షవాతం వచ్చి మెడ వంగిపోయింది ఆమెకు. ఆమె ఇహ చావుకోసం ఎదురుచూడాల్సిందే అని తేల్చారు డాక్టర్లు.

అలా తేల్చాక ఓ సంవత్సరం గడిచినా ఆమెకు ఎదురుచూసే మృత్యువు తటస్థపడలేదు సరికదా పక్షవాతంతో ఒంగిపోయిన ఆమె మెడ దాదాపు నార్మల్ కండిషన్‌కి వచ్చింది. దీనికంతటికీ కారణం పాట్రికానారస్ అనే పారాసైకాలజిస్టు అంటుంది అన్నా ఫ్రాంక్‌లీ.

నారస్ అమెరికాలోని బయో ఫీడ్‌బ్యాక్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్. అన్నా రోగం గురించి విన్నాక నారస్ ఆమెకు ఓ కొత్త రకం చికిత్సా పద్ధతిని సూచించింది. అన్నా తన రోగాన్ని ఓ డ్రాగన్‌లా ఊహించుకుని తన ఒంట్లోని తెల్లరక్తకణాలు ఆ డ్రాగన్‌ని తరిమేసే సాయుధశక్తుల్లా ఊహించుకోవాలి, అంతే! ఆమె చేసుకున్న ఆ ఊహాచికిత్స ఎంతో శక్తిమంతంగా పనిచేసి చిట్టచి




వరకు ఆమె తన రోగమనే డ్రాగన్‌ని ఎదుర్కొని నాశనం చేయగలిగింది.

ఈ చికిత్సావిధానంలో మొదటి పద్ధతి ఒత్తిడికి గురయ్యే కారణాలను, వాటినుంచి బయటపడే పద్ధతులను పరిశీలించడం. ఉదాహరణకు మనం ఒక అడవిలో ప్రయాణించేస్తున్నాం. అప్పుడో సింహం ఎదురయ్యింది. ఆ క్షణంలో మన ఎదుట వున్నవి రెండే మార్గాలు. దాన్నించి పారిపోవడమో లేదా దాన్ని ఎదుర్కోవడమో. మొదటిదానికి అవకాశంలేనపుడు ఓపికున్నంతవరకు ఎదుర్కొనేందుకే ప్రయత్నిస్తాము కదా!

1920లో డాక్టర్ వాల్టర్‌కానన్ అనే శాస్త్రవేత్త ఈ సిద్ధాంతానికి ఓ శాస్త్రీయ వివరణ ఇచ్చాడు. మెదడులో నరాలు ఎప్పుడయినా ఉద్రిక్తతకు గురయినప్పుడు అవి ఆటానమస్ నెర్వస్ సిస్టమ్ ద్వారా మెదడులోని సింపథిటిక్ బ్రాంచ్‌కి వార్తలను పంపుతాయి. ఈ ఆటానమస్ నెర్వస్ సిస్టమ్ మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను జీర్ణక్రియను కంట్రోల్ చేస్తుంది. దాంతో ఉచ్ఛ్వాస, నిశ్వాస గమనవేగం అభివృద్ధిచెంది శరీరంలోని కండరాలున్న భాగంలో ఎక్కువ ప్రసరణ జరిగి ఉద్రిక్త పరిస్థితినుంచి బయటపడేశక్తిని కండరాలకి కలగజేస్తుంది.

స్విట్జర్లాండుకు చెందిన నోబెల్‌ప్రైయిజ్ గ్రహీత డాక్టర్ వాల్టర్‌హెస్ మనిషి మెదడులో వుండే హైపోథిలిమాస్ మెకానిజమ్ కూడా ఈ టెన్షన్ సింద్రోమ్‌ని రూపుమాపుతుంది అంటాడు. ఈ పద్ధతిలో గుండె కొట్టుకోవడం, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు, మొదలైన భౌతిక క్రియలన్నీ సడలించబడి మొత్తం సింపథిటిక్ నెర్వస్ సిస్టమ్ ఒక్కటీ స్తంభించబడుతుంది.

**ఇదంతా** కూడా ఆసిలోస్కోప్ ద్వారా మనం చూడవచ్చు. ఇది అందరూ చూసి తెలుసుకోవలసిన ముఖ్యమైన ప్రయోగం అంటారు శాస్త్రవేత్తలు. ఎందుకంటే బ్లడ్‌ప్రెషర్, టెంపరేచర్, హార్ట్‌బీట్ మొదలయినవన్నీ మన చేతుల్లోనే ఉన్నాయనీ, వాటిని మనం స్వయంగా కంట్రోల్ చేసుకోవచ్చనీ తెలుసుకుంటాడు మనిషి. ఆ తరువాతి మెట్టు రోగాన్ని కూడా మన కంట్రోల్‌లోకి తెచ్చుకునే పద్ధతి. గట్టి సంకల్ప శక్తితోటి ఎలాంటి రోగాన్నైనా తగ్గించుకోవచ్చునంటున్నారు వైద్యులు. ఈ ఊహా వైద్యాన్ని ఆధారంగా చేసుకుని దానికి తగ్గ మందులు కూడా కనిపెట్టారు. ఈ పద్ధతిలో రోగి తన




శరీరంలోని యాంటీబాడీస్ సంఘటితంగా రోగంతో తలపడి దాన్ని నాశనం చేస్తున్నట్టు ఊహించుకోవాలి. దీనికి శాస్త్రీయాధారాలున్నాయంటున్నారు వైద్యులు.

ఈ ఊహా చికిత్సావిధానం జర్మనీలో "ది వాల్టర్ మీన్స్ కాన్సర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో జయప్రదంగా కొనసాగుతోందనీ, చాలా కేసులు విజయవంతమయ్యాయనీ అంటున్నారు.

'నమ్మకంతో ఉపశమనం' అన్న ఈ పద్ధతిని శాస్త్రీయదృక్పథంతో చూసినట్లయితే మానవాళికి చాలా మేలు జరుగుతుందంటున్నారు శాస్త్రవేత్తలు.

---

## నోరూరించే రొట్టెలు

ఫ్రాన్స్‌దేశంలో జనాభాకన్నా బేకరీ షాపులెక్కువని అంటుంటారు చాలామంది. ఇందులో 99 శాతం బేకరీ పరిశ్రమలను చాలా కుటుంబాలు కలిసి ఉమ్మడిగా నడుపుతున్నారు. వీళ్ళలో వీళ్లు ఎంతో ఐకమత్యంగా వుండటమేకాక, ఎప్పటికప్పుడు కొత్తకొత్త పద్ధతులలో వ్యాపారాన్ని అభివృద్ధిచేసుకుందుకు ప్రయత్నాలు చేస్తూ వుంటారు.

వీధులలోకి వెళ్లి చూస్తే షాపుల్లో రకరకాల ఆకారాల్లో, పరిమాణాల్లో చూడముచ్చటగా నోరూరిస్తూ వుంటాయి బ్రెడ్లు. పొడవైన చేతుల్లాగా, తుపాకుల్లాగా, కానన్స్‌లాగా, గుండ్రటి వృత్తాల్లాగా, పుష్పాల్లాగా, కిరీటాల్ని పోలినట్లు... దేనికదే అద్భుతమైన తయారీలతో ప్రేక్షకులని, కస్టమర్లని అలరిస్తాయి అక్కడి బ్రెడ్‌లు. 100 గ్రాములున్న చిన్న బ్రెడ్‌నుంచి రెండు కేజీల బరువున్న అతిపెద్ద బ్రెడ్ వరకు లభిస్తాయక్కడ. అయితే మరో విచిత్రమేమంటే ఫ్రాన్స్‌లో విభిన్న ప్రాంతాల్లో వేరువేరు రకాల బ్రెడ్‌లు దర్శనమిస్తాయి. ఉదాహరణకి నార్మండీ పెన్‌బ్రోయ్ బ్రెడ్‌కి పెట్టింది పేరు. కానీ ఈ బ్రెడ్ ఆ ప్రాంత ప్రజలే తప్ప మిగిలిన ప్రాంతాల ప్రజలు ఇష్టపడరు.

ఫ్రాన్స్ మొత్తంమీద అందరినీ అలరించేది బేజెత్ బ్రెడ్. దీన్ని ఫ్రెంచి బ్రెడ్



రాజుగా అభివర్ణిస్తారు. దీని రుచి, తాజా దనం, కరకర... మరే ఇతర బ్రెడ్స్‌లోను వుండవంటారు అందరూ. దీని తయారీ కూడా చాలా సులభం. అందుకే దీనికంత రుచి అంటారు మరికొందరు. దీనిలో ఎలాంటి కృత్రిమ రసాయనాలుగానీ, సింథటిక్స్‌గానీ ఉపయోగించరట. కేవలం ఈస్ట్, గోధుమపిండి, నీళ్లు, ఉప్పులతో తయారవుతుందిది.

అప్పుడప్పుడు ఇందులో సోయాబీన్ పొడి, విటమిన్ 'సి'ల మిశ్రమాన్ని కూడా కలుపుతారు. దానివల్ల బ్రెడ్ మరింత మృదువుగా, రుచిగా వుంటుందంటారు. అందుకే ప్రపంచం మొత్తంమీద ఈ బేజత్ బ్రెడ్ రుచికరమైనది, ఆరోగ్యకరమైనదిగా పేరు తెచ్చుకుంది. కానీ దీనికి చాలా తొందరగా పాడయ్యేగుణముంది. అందుకే తొందరగా తయారుచేయబడి, వేగంగా అమ్మకాలు పూర్తిచేసుకుంటారు.

రకరకాల ప్రాంతాల్లో పండిన గోధుమల పిండి రకరకాల రుచులను బ్రెడ్‌కిస్తుందంటారు ఫ్రాన్స్ ప్రజలు. కొందరు 4, 5 ప్రాంతాల్లో పండిన గోధుమలను సేకరించి అంతా కలిపేసి ఆ పిండితో బ్రెడ్ తయారుచేస్తారు. అదొక కొత్త రకం రుచికలిగి వుంటుందంటారు బేకర్స్.

మోర్సీ అనే వ్యక్తి ఈ బ్రెడ్ తయారీలో అవార్డును కూడా పొందాడు. 22 సంవత్సరాలనుంచీ ఫ్రాన్స్‌లో అనేకమంది ప్రజలకు ఇతడు రుచికరమైన బ్రెడ్‌నందిస్తున్నాడు. బ్రెడ్ తయారు చెయ్యడానికి నిర్దిష్టమైన సూత్రాలంటూ ఏవీలేవంటాడు మోర్సీ. బ్రెడ్ యొక్క రుచివగైరా అంతా ఈస్ట్‌మీదే ఆధారపడి వుందంటాడు అతడు. ఈస్ట్‌లోని బాక్టీరియా బ్రెడ్‌లోని పిండిపదార్థపు రేణువుల పరిమాణాన్ని పెంచి దానితోపాటు తన ఉత్పత్తిని కూడా పెంచుకుంటూ పోతుంది. ఫలితంగా అప్పుడు జరిగే రసాయనిక చర్యకారణంగా స్వచ్ఛమైన ఆల్కహాలు, కార్బన్‌డయాక్సైడ్ వాయువు ఉత్పత్తి అవుతుంది. వీటి మిశ్రమం బ్రెడ్‌కి ఓ సరికొత్త సువాసననిస్తుంది.

పచ్చిపిండి దశనుంచి, బ్రెడ్ బేకింగ్ పూర్తయ్యేవరకు నడిచే దశలన్నీ క్షుణ్ణంగా తెలియడానికి బేకర్‌కి కెమిస్ట్రీ, మ్యాథ్స్, వాతావరణ శాస్త్రాలపై పూర్తి అవగాహనవుండాలి. పిండి పులియడానికి 25° సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రత అవసరమవుతుంది. ఈ ఉష్ణోగ్రతను స్థిరంగా వుంచడంకోసం నీళ్ల యొక్క, పిండి యొక్క, వాటిని భద్రపరిచే గది యొక్క ఉష్ణోగ్రతలను కూడా నోట్‌చేసుకుంటూ వుంటాడు బేకర్. బయట మబ్బుగా వున్నప్పుడు ఈస్ట్ తయారయ్యే గదిలోని వుష్ణోగ్రతను మార్చుకోవలసి వుంటుందంటాడు మోర్సీ. పిండి ఖచ్చితంగా, నిర్దిష్టపద్ధతి మేరకు పులిసిందీ లేనిదీ కేవలం చేతిస్పర్శతో తెలుసుకోవచ్చంటాడతడు.

నార్మండీలోని చాలా బేకరీలలో వాడే ఓవెన్‌లు చాలా దశాబ్దాలనుంచీ వాడుతూ వస్తున్నవే. ఓవెన్‌లను పెద్దపెద్ద దేవదారు కట్టెలను వెలిగించి, గాడి పొయ్యలవంటి పెద్ద పొయ్యలమీద పెట్టి బ్రెడ్‌లను తయారు చేస్తారు. దేవదారు మంట, పొగలపై తయారయిన బ్రెడ్‌కు ఓ కొత్త రుచి వస్తుందంటారు బేకర్స్. ఒకేసారి కొన్ని వందల రొట్టెలు తయారుచేస్తారు. గోధుమపిండిని కలపడానికి బేకర్‌కి చక్కటి ఆరోగ్యం, శరీరదారుఢ్యం వుండాలంటాడు మోర్సీ. ఒక ఓవెన్‌లో ఒకేసారి 200 బ్రెడ్‌లు తయారవుతాయి.

కానీ ఫ్రాన్స్‌లోని మిగతా ప్రాంతాల్లో కుకింగ్‌గాస్ మీదగానీ, ఎలక్ట్రిక్ ఓవెన్‌లుపయోగించిగానీ బ్రెడ్ తయారు చేస్తారు. అక్కడి స్కూళ్ళల్లో కూడా బ్రెడ్ తయారీని ఓ సబ్జెక్ట్‌గా నేర్పుతారు. చాలామంది పిల్లలు చదువు పూర్తయ్యాక బేకరీలలో చేరుతారు.

○





# ఏరిన ముత్యాలు

☆ అగ్నిని, రుణాన్ని అదుపులో ఉంచనిచో అవి నిన్ను దహించివేస్తాయి.

-టాల్‌స్టాయ్

☆ తాను సర్వజ్ఞుడనని విర్రవీగుతూ తిరిగేవాడే అందరికన్నా మూర్ఖుడు.

-నెహ్రూ

☆ ఒకరి నమ్మకాన్ని వమ్ముచేసినవాడిని ఇంకెప్పుడూ నమ్మకు.

-షేక్స్పియర్

☆ నీ ఆనందాన్ని నలుగురికీ పంచు. కానీ విషాదాన్ని మాత్రం నీలోనే దాచుకో.

-సంస్కృత సూక్తి

☆ నిన్ను నువ్వు మోసగించుకున్నంతగా ఇంకెవరూ నిన్ను మోసగించరు.

-గేథె

☆ స్వయంకృషితో పైకి వచ్చిన వ్యక్తి దగ్గర 'అదృష్టం' గురించి ఎవరూ ఏమీ మాట్లాడలేరు.

-ఇ.బి.వైట్

☆ అహింస సద్గుణంలాంటిది. హింస అసమర్థత వంటిది.

-గాంధీజీ

☆ దేశభక్తి అంటే దేశాన్ని ప్రేమించడమే కాదు. తోటి మానవులను కూడా గౌరవించడమే.

-వివేకానంద

☆ మనం ఎవర్ని హీనులుగా చూస్తామో వాళ్లే క్రమంగా మనల్ని మరింత హీనంగా చూస్తారు.

-టాగూర్

☆ నీ బాధలను పోగొట్టుకోవడానికి ఇతరులకు హాని తలపెట్టడం మంచిది కాదు.

-గౌతమబుద్ధుడు

☆ నేరస్థులను శిక్షించడం ప్రధానం కాదు. నేరం చేయడానికి పురికొల్పే పరిస్థితులను తొలగించడం ప్రధానం.

-యం.యన్.రాయ్

☆ కొద్ది భావాలుగల గొప్పవాళ్ళవలనకంటే, గొప్ప భావాలుకల కొద్దిమందివల్లనే దేశం వర్ధిల్లుతుంది.

-స్వామి రామతీర్థ

☆ ఈ జన్మను సద్వినియోగం చేసుకోవడం చేతకాక మరోజన్మ గురించి ఆలోచించటం మూర్ఖత్వం.

-శ్రీశ్రీ

సేకరణ: శ్రీగిరి శ్రీకాంత్

సంపుటి: 19
సంచిక: 9

# చతుర

అక్టోబర్
1996

"ఒరేయ్ బాచీ! జీవితంలో నేను నా తొందరపాటుతనంవల్ల ఎన్నెన్నో కష్టాలనెదుర్కొన్నాను. మీ నాయనమ్మను పెళ్ళిచూపుల్లో చూపిందే తడవుగా ఎగిరిగంతేసి ఒప్పేసుకోవడంతో మొదలుపెడితే... ఎన్నో అనుభవాలు. అందుకే నీకు ఒక్కటే చెబుతున్నాను. దాన్ని జీవితాంతం పాటించు. 'నిదానమే ప్రధానం...'" అంటూ కన్ను మూశాడు అల్లారుముద్దుగా అతడిని పెంచిన తాతగారు.



ఆ సూక్తిని తు.చ. తప్పకుండా పాటించడానికి ఉపక్రమించిన అతడు తన జీవితంలో ఎదుర్కొన్న చేదు అనుభవాలు ఎలాంటివి? చివరికి దాన్ని వదిలిపెట్టి... అతడెన్నుకున్న కొత్త మార్గమేమిటి?

అనుభవంతోనే పెద్దలు చెప్పిన మాట అతడి విషయంలో విషమించడానికి కారణమేమిటి?

నవ్విస్తూనే జీవిత నగ్నసత్యాలను విప్పిచెప్పిన

కొలపల్లి ఈశ్వర్ రచన బాచీ

ఈ నెల చతుర సమగ్ర నవల

# కొలపల్లి ఈశ్వర్

# బాచీ



"మీ పేరు? "

"భాస్కర్రావండీ! ముద్దుగా బాచీ అంటా రంతా!"

"ముద్దుపేర్లతో పన్లేదులెండి. ఎక్కడినుం చొస్తున్నారు? "

"పెడన"

"సూట్ కేసు ఎప్పుడు పోయింది? ఎక్కడ పోయింది? "

"ఇప్పుడేనండీ. రెండోనంబర్ ప్లాట్ ఫాం మీద"

"ఎలా పోయిందో కాస్త వివరంగా చెప్పండి"

"సూట్ కేస్ కాళ్ళపక్కనే పెట్టి, అదుగో ఆ కనిపించే షాపులో కోకాకోలా తీసుకున్నా నండి. కళ్లు మూసుకొని కోకాకోలా తాగటం పూర్తిచేసి తిరిగి కళ్ళు తెరిచేసరికి నా సూట్ కేసు మాయమైపోయిందండీ"

కంప్లైంట్ రాసుకుంటున్న రైల్వేపోలీసు అదోలా చూశాడు.

"కోకాకోలా కళ్ళు మూసుకుని తాగటం దేనికి? ఏం, కళ్ళు తెరిచి తాక్కూడదా? " ఈజ్ దేర్ ఎనీ స్పెషల్ రీజన్? అన్నట్టు కళ్ళెగరేశాడు.

భాస్కర్రావ్ ఒకింత బిడియంగా ఫీల య్యాడు. "కళ్ళు కావాలని మూస్కోలేదండీ. బాగా దాహంతో ఉన్నానేమో, కోకాకోలా చలచల్లగా కడుపులోకి జార్తుంటే కళ్ళు వాటంతటవే ఆటోమాటిక్ గా మూసుకుపో యాయి"

"సరే... మీ సూట్ కేసు రంగేంటి? ఏ కంపెనీది? అందులో ఏమేం ఉన్నాయ్? "

"రంగు బ్రౌనండి. కంపెనీ వి.ఐ.పీ అండి. అందులో నాలుగు జతల బట్టలు... రెండు బనీన్లు... రెండు లుంగీలు... రెండు డ్రాయర్లు... నాలుగు హేండ్ కర్చీ ఫ్లు..."

"మూడు లంగోటీలు" భాస్కర్రావ్ చదు వుతున్న వస్త్ర దండకానికి అడ్డు తగుల్తూ అన్నాడు రైల్వేపోలీసు.

"అబ్బెబ్బే... లంగోటీలు లేవండీ... నేన సలు లంగోటీలే వాడ్ను" భాస్కర్రావ్ కంగా రుగా అన్నాడు.

నెత్తిమీద బల్లో తేలో పడ్తే ఎంత కంగా రుగా విదిలించుకుంటామో, అలా!

అది రైల్వే పోలీసుకి నవ్వొచ్చిందిగానీ, పోన్లే పాపమని నవ్వకుండా ఊరుకున్నాడు.

"సర్లే సర్లే... నాలుగు గుడ్డముక్కలు పోయినందుకేనా ఈ సోదంతా? బాగుంది బాగుంది. ఇక్కడ సంతకం పెట్టి వెళ్ళండి. దొంగ దొరికేక కబురు చేస్తాం" నిర్లక్ష్యంగా అంటూ భాస్కర్రావ్ కి పెన్నందివ్వబో యాడు రైల్వే పోలీసు.

"అదేంటండీ? అప్పుడే కంప్లైంట్ రాయటం ముగించేశారా? నేనింకా దొంగ వివరాలు చెప్పందే? " అన్నాడు భాస్కర్రావ్, ఇదెక్కడి విడ్డూరమన్నట్టు.

రైల్వే పోలీసు మతిపోయినవాడిలా మతి పోయినవాడికేసి చూసినట్టుగా చూశాడు భాస్కర్రావుకేసి.

"దొంగ వివరాలు మీరు చెప్పడమేంటి? అంటే దొంగెవరో మీకు తెలుసా? " నోరు తెరిచాడు ఆశ్చర్యంగా.

"తెలుసంటే మనిషి ఆకారం గట్రా తెలుసు గానండీ పేరు వివరాలు తెలి యవు. నేను వాడ్ని చాలా స్పష్టంగా చూశాను. గుర్తులు చెప్తా రాస్కోండి. మనిషి లావుగా, నల్లగా, అయిదున్నరా, అయిదూ ఎనిమిదీ ఆ మధ్యలో ఉండొచ్చు గోధుమరంగు మీద వైట్ చారలున్న షర్టు వేస్కున్నాడు. ఫ్యాంటేమో జీన్సండి. బ్లూ కలర్ న్యూపోర్ట్ జీన్స్, కాళ్లకి ఏక్షన్ షూజ్ వేసుకున్నాడు. సాక్సేమో ఎరుపు రంగువి. పోతే నడుముకి బ్రౌన్ కలర్ లెదర్ బెల్ట్ పెట్టుకున్నాడండి. అన్నట్టు వాడు నిమ్మ వాసన వచ్చే సబ్బుగానీ, పౌడర్ గానీ వాడ్తా డనుకుంటానండి. ఎందుకంటే నేను వాడి





పక్కకెళ్లి నిల్చున్నప్పుడు నాకు నిమ్మ వాసన వచ్చింది. పోతే ఇంకోకొండగుర్తేంటంటేవాడి కుడి కంటికి అరంగుళం పైన, అంటే నుదుటిమీదండి, కొత్తగా వస్తున్న గుండ్రటి పది పైసల బిళ్లంత పుట్టుమచ్చ ఉందండి" అని క్షణమాగి ఏదో గుర్తుకు తెచ్చుకుని, "అన్నట్టింకో సంగతేంటంటే వాడు కింగ్ సైజ్ గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్ కాలుస్తాడండి. వాడి వేషమూ అదీ చూస్తే వాడ్నెవరూ దొంగనుకోరండి. అంత దర్జాగా ఉంటాడు" అంటూ ముగించాడు భాస్కర్రావ్.

రైల్వే పోలీస్ నోరింకా తెరుచుకునే వుంది. అంటే అంతకుముందు తెరుచుకున్న నోటినే ఇంకా మూసుకోలేదన్నమాట.

వీడు మంచివాడా? పిచ్చివాడా?

మంచివాడే అయితే తన సూట్‌కేస్ని దొంగిలించింది ఫలానాశాల్తీ అని తెలిసినపుడు వాడ్ని అక్కడికక్కడే పట్టుకునే ప్రయత్నం ఎందుకు చేయలేదు?

ఒంటరిగా ఎదిరించడానికి భయపడ్డాడేమో, అనుకోవడానికి ఫ్లాట్‌ఫాంనిండా ఎటు చూసినా జనాలే ఉన్నారాయె! దొంగ దొంగ అని గట్టిగా అరిస్తే చాలు జనం వీరాధివీరులై ఆ దొంగ వెధవని పచ్చడి పచ్చడికింద కొట్టేస్తారాయే! ఆపాటి ఆలోచనా జ్ఞానం ఇతగాడికి ఎందుకు లేకుండా పోయింది? ఆ దొంగ వెధవ చుట్టూ తిరిగి వాడి ఒంటిమీద ఏమేమున్నాయో, వాడేం సబ్బు వాడ్తాడో, ఏ బ్రాండ్ సిగరేట్ కాలుస్తాడో, వాడికి ఎక్కడెక్కడ పుట్టుమచ్చలున్నాయో ఇవన్నీ గమనించగలిగినవాడికి వాడిని పట్టుకునే ప్రయత్నం చేయాలనిపించక పోవటం అబ్సర్డ్‌గా లేదూ? మతున్నవాడెవడైనా అలా ప్రవర్తిస్తాడా?

అలాగని పోనీ పిచ్చివాడేమో అనుకుందామా అంటే మనిషి నీట్‌గా బాగానే ఉన్నాడు. పైగా చదువుకున్నవాడిలా ఉన్నాడు. అదీగాక పిచ్చివాడైతే నా సూట్‌కేస్ పోయిందోచ్ అని ఆనందంగా ఫ్లాట్‌ఫామ్ మీద గంతులేస్తాడే తప్ప, కంప్లైంట్ ఇవ్వడానికి ఎందుకొస్తాడు?

అసలింతకీ వీడి సూట్‌కేస్ నిజంగా పోయిందా లేక తనని ఆట పట్టించడానికి ఉత్తుత్తినే కంప్లైంట్ ఇస్తున్నాడా?

తనని ఆటపట్టించాల్సిన అవసరం వాడికేంటి?

పెళ్లికాని కుర్రాడిలాగే ఉన్నాడు. కాబట్టి ఆటంటూ పట్టిస్తే గిట్టిస్తే ఆడ పిల్లల్ని పట్టిస్తాడుగాని తననెందుకు పట్టిస్తాడు?

అదుగో ఆ స్తంభం దగ్గర నుంచున్న టున్‌టున్‌లాంటి అమ్మాయిని ఆటపట్టిస్తే దానికో అర్థముంటుందిగానీ తననెందుకు ఆటపట్టిస్తాడు సో...

వీడి సూట్‌కేస్ నిజంగానే పోయుంటుంది.

ఏమో...? నిజంగానే పోయిందో లేక వీడే వాడికిచ్చేశాడో?

వీడే వాడికిచ్చేస్తే తగుదునమ్మా అంటూ మళ్ళీ ఇక్కడికొచ్చి కంప్లైంట్ ఎందుకిస్తాడు? ఇవ్వడు. సో... వీడు వాడికిచ్చేసి ఉండడు.

రైల్వే పోలీసు ఎటూ తేల్చుకోలేక సతమతమవుతుంటే-

"నేను గుర్తులన్నీ చెప్పేశాను కాబట్టి మీకు వాడ్ని పట్టుకోడం చాలా ఈజీనే అనుకుంటానండీ" అన్నాడు భాస్కర్రావ్?

రైల్వే పోలీసు తన చేతిలో ఉన్న పెన్నుని భాస్కర్రావ్‌కి చూపుతూ అడిగేడు.

"దీన్నేమంటారు? "

ఆమాత్రం తెలీదా? అన్నట్టు చూశాడు భాస్కర్రావ్.

"పెన్ను"

రైల్వే పోలీసు తన కుడిచేతి చూపుడు మరియు బొటన వేళ్ళ మధ్య తన ముక్కు నిరికించుకుని అటూ ఇటూ ఊపుతూ అడిగేడు.

"దీన్నేమంటారు? "

"ముక్కు, అని చెప్పి... ఇదేంటిలా అడుగుతున్నాడు? ఈయనగ్గాని పిచ్చా? అనుకున్నాడు భాస్కర్రావ్!

"ముక్కుసరే... ఎవరి ముక్కు? "

"మీ ముక్కే... మీముఖంలో మీ ముక్కు గాక నా ముక్కుంటుందా? " రవంత చిరాగ్గా అన్నాడు భాస్కర్రావ్.

దాంతో రైల్వే పోలీసు సంతృప్తిగా తల పంకించాడు. "సో వీడికి పిచ్చిలేదన్నమాట. వీడు పిచ్చివాడుకాడన్నమాట. పిచ్చివాడైతే అడిగిన ప్రశ్నలన్నింటికీ అంత తెలివిగా సమాధానాలు చెప్పలేడుకదా? " అనుకున్నాడు మనసులో.

"మరి మీకు పిచ్చిలేనప్పుడు ఆ దొంగని పట్టుకునే ప్రయత్నం ఎందుకు చేయలేదు? '

రైల్వే పోలీసు ప్రశ్నకి అదిరిపోయి దేభ్యంలా చూశాడు భాస్కర్రావ్.

"నాకు పిచ్చి లేదని నేనెప్పుడన్నాను? " అనేశాడు కంగారులో.

"అయితే ఉందా? " రైల్వే పోలీసు అనుమానంగా చూశాడు.

"ఇప్పటివరకైతే లేదుగానండీ ఇప్పుడెక్కేలా ఉంది. లేకపోతే ఏంటి? నా సూట్ కేస్ పోయి నేను బాధపడ్తుంటే నాకు పిచ్చుంటారేంటి? " ఉక్రోషంగా అన్నాడు. భాస్కర్రావ్.

"నేనేం అలా అనలేదు. నేనంత తొందరపాటు మనిషినేంకాదు. కాబట్టే మిమ్మల్ని తెలివిగా ప్రశ్నించి మీకు పిచ్చిలేదని నిర్ధారణ చేస్కున్నాను. సరే... మీకు పిచ్చిలేనప్పుడు మీరా దొంగని అంత స్పష్టంగా గమనించి కూడా వాడ్నెందుకు పట్టుకోలేదు? " మళ్ళీ మొదటికే వస్తూ అన్నాడు రైల్వే పోలీసు.

భాస్కర్రావ్ ఒకింత చురుగ్గా ఆలోచించిన మీదట అతనికి రైల్వే పోలీసు





ఆంతర్యం అర్థమైపోయింది.

"అయితే మీరు అలా అపోహ పడ్డారన్న మాట నా గురించి" అని కొంచెం నవ్వి ఆ మీదట చెప్పేడు.

"నేను ఆ దొంగ వెధవని తొందర పడి ఎందుకు పట్టుకోలేదంటే... మా తాతగార్కి అలా అని మాటిచ్చేనుకదా! అందుకు..."

"మీ తాతగార్కి మాటిచ్చేరా! ఏమని మాటిచ్చేరు? ఆ దొంగ వెధవని పట్టుకోనని మాటిచ్చేరా? " రైల్వే పోలీస్‌లో మళ్ళీ అనుమానం బలపడి పోయింది- వీడికి పిచ్చేసే మోనని.

భాస్కర్రావ్‌కి తన తప్పేంటో తెలిసొచ్చింది.

తను వివరంగా చెప్పకపోతే రైల్వే పోలీసుకి అసలు విషయం ఎలా తెలుస్తుంది? అలా అనుకున్నాక తెలివి తెచ్చుకుని, మనసులో లెంపలేసుకుని ఆమీదట అన్నాడు-

"కన్‌ఫ్యూజవ్వాబాకండిసార్! నేనంతా వివరంగా చెప్తాను"

"చెప్పండి" అన్నాడు రైల్వే పోలీసు.

కుతూహలం అతన్ని ఒకింత ముందుకొంగేలా చేసింది.

★ ★ ★

భాస్కర్రావ్ బాల్యంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన ఓ అభాగ్యుడు.

తల్లి అతన్ని ప్రసవిస్తున్న సమయంలో పోగా, ఆపైన ఓ ఏడాదన్నా గడవకముందే తండ్రి పాముకాటుకి గురై చనిపోయాడు.

అప్పట్నుంచీ ఆ పసిగుడ్డుని అతని పితామహుడైన రామజోగయ్య గుండెల మీద వేసుకుని అల్లారు ముద్దుగా పెంచి పెద్దవాణ్ని చేశాడు అదిన్నూ ఆడదిక్కులేకుండా.

రామజోగయ్య భార్య తులసమ్మ అప్పటికి ఆరేళ్ళ క్రితమే ఏదో తీవ్రమైన సుస్తీ చేసి కాలధర్మం చెందింది. ఆ దంపతులకు భాస్కర్రావ్ తండ్రి శంకర్రావ్ ఒక్కడే

సంతానం. శంకర్రావ్ ఒకింత అమాయకుడు. శంకర్రావ్ భార్య కళ్యాణి చూడచక్కనిదే కాకుండా చురుకైంది.

వాళ్ళిద్దరిదీ అన్యోన్యమైన దాంపత్యం కానీ ఏంలాభం?

కొడుకునీ, కోడల్నీ కళ్ళారా చూసుకుంటూ భార్యలేని లోటును అప్పుడప్పుడే మర్చిపోతున్న రామజోగయ్యకు విధి ఆ అదృష్టాన్ని కూడా దక్కనివ్వలేదు.

మనవడ్ని మిగిల్చి లక్ష్మీదేవి లాంటి కోడలు వెళ్ళిపోగా, ఆ మనవడి బాధ్యతనీ, కొండంత దుఃఖాన్ని మిగిల్చి చెట్టంత కొడుకు కాస్తా విషకీటకానికి బలైపోయాడు.

అయినా రామజోగయ్య కృంగిపోలేదు. తల్లి అందాన్ని, తండ్రి అమాయకత్వాన్ని పుణికిపుచ్చుకున్న మనవడ్ని చూసి గుండె దిటువు చేసుకున్నాడు. శక్తికి మించిన పన్లే అయినా ఆ పసివాడి సకల చాకిరీలూ తనే చూస్తూ వాడ్ని కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చాడు.

ఉన్న మూడు ఎకరాల్నే శ్రద్ధగా సాగు చేస్తూ, ఉన్నంతలోనే బంగారం పండిస్తూ మనవడికి ఆర్థిక ఇబ్బందంటే ఏమిటో తెలియకుండా పెంచుకొచ్చాడు. తను చదివింది మూడో క్లాసే అయినా మనవడ్ని మాత్రం బియ్యేదాకా చదివించాడు.

మనవడంటే పంచప్రాణాలు ఆ తాతయ్యకి. తనని అంతగా ప్రేమించే ఆ తాతయ్యంటే ఎనలేని భక్తిగౌరవాలు మనవడికి.

అలా... ఇరవై రెండేళ్ళ పాటు కొనసాగింది ఆ తాతయ్య మనవల అనుబంధం.

కానీ... ఇరవై మూడోఏట... ప్రకృతి తన ధర్మాన్ని తాను నిర్వర్తించింది. డెబ్బైరెండేళ్ళ వృద్ధుడైపోయిన రామజోగయ్య మనవడ్ని ఒంటరివాడ్ని చేసి వెళ్ళిపోయాడు.

ఇంకో గంటకు చనిపోతాడు అనగా రామజోగయ్య మనవడ్ని చేరబిలిచి-

"ఒరే బాచీ! జీవితంలో నేను నా తొందరపాటు తనం వల్ల ఎన్నెన్నో కష్టాల్నెదుర్కొన్నాను మీ నాయనమ్మని పెళ్ళి చూపుల్లో చూసిందే తడవుగా ఎగిరి గంతేసి మరీ ఒప్పుకునేయడంతో మొదలు పెడ్తే, దిగువ వీధిలో ఉన్న మన రెండో పెంకుటింటిని నాగమల్లేశ్వర్రావుకి అడిగిన రేటుకి అమ్మేయటం వరకూ నేను చేసినవన్నీ తొందరపాటు పన్లే...వాటివల్ల నేనేం కోల్పోయానో నాకు మాత్రమే తెలుసు. మీ నాయనమ్మని ఒప్పేసుకున్నాక పాతికెకరాలు కట్నంగా ఇస్తామంటూ నాకు మరో సంబంధం వచ్చింది. కానీ ఏంలాభం? అప్పటికే మాటిచ్చేసి నందువల్ల ఆ అదృష్టం కాస్తా చెయి జారిపోయింది. అలాగే మొన్నటికి మొన్న నాగమల్లేశ్వర్రావు దగ్గిర అయిదు వేలు అడ్వాన్స్ పుచ్చేసుకున్నాక 'నేనైతే ఆ ఇంటికి మరో పదిహేను వేలు ఎక్కువిస్తా'నంటూ వీరారెడ్డి ముందుకు రావడం నీకు తెలిసిందేనాయె. ఇవి మచ్చుకు మాత్రమే చెబుతున్నాను. ఇలాంటివే నా జీవితంలో నా తొందరపాటు వల్ల ఎన్నెన్నో అనర్థాలు జరిగిపోయినై..." అని ఒక్కటొక్కటిగా స్ఫురణకు తెచ్చుకుంటూ ఇంకా కొన్ని సంగతులు చెప్పి...

"కాబట్టి నేన్నీకు చెప్పొచ్చేదేంటంటే వేసిన అడుగును వెనక్కి తీసుకోవడం ఎవరివల్లా కాదు. అంచేత అడుగు వేసేముందే బాగా ఆలోచించుకోవాలి. ఏవిషయం లోనూ తొందరపాటు ఎంతమాత్రం పనికిరాదు. నిదానమే ప్రధానమని పెద్దలు చెప్పిన మాటని ఎట్టి పరిస్థితుల్లోనూ మరువకూడదు" అంటూ సుదీర్ఘమైన హితబోధ చేశాడు.

భాస్కర్రావ్‌కి తాతగారి మాటంటే చిన్నప్పట్నుంచీ వేదవాక్కే. అంచేత ఆ హితబోధ విన్న వెంటనే "అలాగే తాతయ్యా! నిదానమే ప్రధానమన్న నీ సూక్తిని జీవితాంతం గుర్తుంచుకుంటాను. ఒట్టు" అంటూ తాతగారి చేతిలో చెయ్యి




వేశాడు.

"మంచిది బాచీ! నువ్విలా ఒట్టు కూడా వేసినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. అన్నట్టది నా సూక్తి కాదురా! ఎంతో అనుభవంతో మన పెద్దలు ఏనాడో చెప్పిన బంగారంలాంటిమాట! కానైతే నేను బుద్ధిలేనివాడ్ని కావటంవల్ల ఏనాడూ ఆ సూక్తిని పాటించకుండా కష్టాల పాలయ్యాను. నువ్వలా కాకూడదనే నీకీ విషయం ఇంతగా చెబుతున్నాను. నిదానమే ప్రధానం అన్న ఆ ఒక్క సూత్రానికీ కట్టుబడి ఉండుచాలు. నీ జీవితం సాఫీగా సాగిపోతుంది. ఇంక నీ గురించి నాకే చింతాలేదు. నిశ్చింతగా కన్ను మూస్తాను..." అంటూ తృప్తిగా నవ్వేడు రామజోగయ్య.

ఆయన అలా అంటున్నప్పుడు గగనంలో తథాస్తు దేవతలు తిరుగుతున్నారో ఏమోగానీ మొత్తానికి అలా అన్న గంటలోపలే ఆయన నిజంగానే కన్ను మూసేశాడు.

తాతయ్య మరణానికి గుండెలు పగిలేలా రోదించాడు భాస్కర్రావ్.

అంతకన్నా ఎవరు మాత్రం చేయగలిగిందేముంది?

కాలానుగతిన తాతగారు పోయిన దుఃఖం నుండి కోలుకున్న భాస్కర్రావ్, అప్పట్నుంచీ తాతగారు తనకు కడసారిగా చేసిన హితోపదేశాన్ని తు.చ తప్పకుండా పాటిస్తూ వస్తున్నాడు.

నిదానమే ప్రధానమన్న సూక్తి నిద్దట్లో కూడా అతని మనసులో మెదుల్తూనే ఉంటుంది.

★ ★ ★

"అదండీ సంగతి. మరణశయ్యపై ఉన్న మా తాతయ్యకి నేను ఎట్టి పరిస్థితుల్లోనూ తొందరపడనని మాటిచ్చాను. అందుకే ఇందాక ఆ వ్యక్తి చేతిలో నా సూట్ కేస్ ఉండటం చూసి కూడా నేను తొందరపడలేదు. ఏమో 'అచ్చం నా సూట్ కేస్‌లాంటిదే అతని క్కూడా ఉండకూడదా?' అనుకున్నాను! తొందరపడి అతనిమీద దొంగతనం మోపేస్తే, ఆ తర్వాత అతను దొంగ కాదని తేల్తే పాపం ఎంత బాధపడ్తాడు? ! అనుకున్నాను. అయినా ఎందుకయినా మంచిదని అతన్ని బాగా అబ్జర్వ్ చేశాను..."

రైల్వే పోలీసుకు తన గత చరిత్రని కొంత వివరించాక అప్పుడన్నాడు భాస్కర్రావ్ అలా.

రైల్వే పోలీసుకు నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు.

"అంటే తమరు నిదానమే ప్రధానమన్న సూక్తికి కట్టుబడి ఆ దొంగ వెధవని చూస్తూ చూస్తూ వదిలేశారన్న మాట! ఇంతకీ వాడెటుపోయాడు? అదన్నా గమనించారా? " భాస్కర్రావ్ అమాయకత్వానికి మనసులో తెగ జాలిపడిపోతూ అడిగాడు.

"అన్నీ గమనించిన వాణ్ణి అది గమనించకుండా ఎలా ఉంటానండీ? గమనించాను. వాడు బందరెళ్ళే ప్యాసింజర్లో ఎక్కి కూర్చున్నాడు..." భాస్కర్రావ్ కించిత్ గర్వంగా చెప్పాడు.

రైల్వే పోలీసు లబ్బున నెత్తి బాదుకున్నాడు. "ఈ విషయం ఓ అయిదు నిముషాల ముందు చెప్పేడవొచ్చు కదయ్యా? మా తాతయ్య అలాంటోడు, ఇలాంటోడు-నన్నలా చూస్కునేవాడు, ఇలా చూస్కునేవాడు అంటూ నీ సోదంతా చెప్పకపోతే? " అన్నాడు కోపంగా చూస్తూ. ఈ వెర్రివాజమ్మకి మర్యాదిచ్చేదేమిట్లే అనుకున్నాడో ఏమో, ఏకవచనంలోకి దిగిపోయాడు.

భాస్కర్రావ్ అమాయకంగా చూశాడు.

"అయిదు నిమిషాలు ముందు చెప్తే ఏం జరిగుండేదండీ? "

"నీ సూట్ కేస్ దొరికుండేది"

"ఇప్పుడింక దొరకదాండీ? " అన్నాడు. "ఏం, ఎందుకు దొరకదు" అన్నట్టు కళ్ళెగరేస్తూ!

"ఎలా దొరుకుద్దయ్యా? బందరు ప్యాసింజరు అయిదు నిముషాల క్రితమే వెళ్ళిపోయింది. ఆ సమయంలో నువ్ మీ తాతగారు నీకు లాగూ ఎలా తొడిగేవాడో చెప్తున్నావు..." అంటూ విరగబడి నవ్వేడు రైల్వేపోలీసు.

భాస్కర్రావ్ ముఖం టీవీలో క్రికెట్ మాచ్ చూస్తున్నప్పుడు కరెంట్ పోతే చూస్తున్నవాడి ముఖం ఎలా అవుతుందో అలా అయిపోయింది.



"అదేంటప్పుడే వచ్చేశావ్? నువ్ హైదరాబాద్ వెళ్లలేదా?"

భాస్కర్రావ్ ఇపుడు పెడనలో ఉన్నాడు. స్నేహితుడు గోకారి అలా అడుగుతుంటే భాస్కర్రావ్‌కి ఏడుపు రాబోయింది. అయినా నిగ్రహించుకున్నాడు.

"లేదు వెనక్కొచ్చేశాను" అన్నాడు పొడిగా.

"ఎందుకని?" అడిగాడు గోకారి.

విజయవాడ రైల్వే స్టేషన్‌లో ఏం జరిగిందో వివరంగా చెప్పాడు భాస్కర్రావ్

గోకారికి నవ్వాగలేదు.

"ఏడిసినట్టే ఉంది. మీ తాతగారేదో చెప్పినంత మాత్రాన్న దాన్ని గుడ్డిగా పాటించేయడమేనా? దేన్నికైనా సమయం సందర్భం కనిపెట్టి ప్రవర్తించాలి. ఇన్నాళ్ళూ నువ్ అమాయకుడివనుకుంటూ వచ్చానే తప్ప మరీ ఇంత వెర్రివాడివనుకోలేదు..." అన్నాడు నవ్వటం అయ్యాక.

"నువ్వూ అలాగే అంటున్నావా?" బిక్క ముఖం వేస్తూ అన్నాడు భాస్కర్రావ్. "ఆ రైల్వే పోలీసు కూడా అలాగే అన్నాడు నా గురించి"

"అతనే కాదు. ఎవరైనా అలాగే అంటారు మరి!" అందులో తప్పేమీ లేదన్నట్టుగా చూశాడు గోకారి.

భాస్కర్రావ్ మౌనంగా తల దించుకున్నాడు.



భాస్కర్రావ్‌ని వెంటబెట్టుకొస్తున్న గోకార్ని చూసి ఆశ్చర్యంగా అడిగింది రామేశ్వరి. "ఇదేంట్రా? భాస్కర్రావ్ హైదరాబాద్ వెళ్ళిపోయేడన్నావ్‌గా పొద్దున్న నాతో?!"

"పెద్ద పోటుగాళ్ళా వెళ్తాననే బయల్దేరాడు. సగం దూరం వెళ్ళాడు కూడా... కాని..." పూర్తిగా చెప్పకుండానే పొట్ట చేత్తో పట్టుకుని నవ్వటం ప్రారంభించాడు గోకారి.

"సగం దూరం ఏమీ వెళ్ళ లేదులే పెద్దమ్మా! విజయవాడదాకా వెళ్ళి తిరిగొచ్చేశాను" నవ్వుతున్న గోకారికేసి కోపంగా చూసి, మరీ చెప్పాడు భాస్కర్రావ్.

రామేశ్వరి భాస్కర్రావ్‌కి నిజంగా పెద్దమ్మ కాదు. చిన్నప్పట్నుంచీ అతనికి ఆమెను అలా పిలవటం అలవాటు అంతే! అతనూ, గోకారి ఒకటో తరగతినుండి పదో తరగతిదాకా ఒకే బళ్ళో చదువుకున్నారు. ఇళ్ళేమో ఇద్దరివీ ఒకే వీధిలో. అంచేత వాళ్ళిద్దరి మధ్యా చాలా గట్టి స్నేహమే ఏర్పడిపోయింది.

గోకారి టెన్త్‌క్లాస్ రెండుమార్లు తప్పేసి, ఇంక తనకి చదువు ఒంటబట్టదని నిర్ధారణ చేసేస్కుని, పెడనలోనే మెయిన్‌రోడ్‌మీద ఓ పాన్‌షాప్ రన్‌చేస్తూ రోజులు నెట్టుకొచ్చేస్తున్నాడు. కాగా భాస్కర్రావ్ చిన్నప్పట్నుంచీ చదువుమీద శ్రద్ధగలవాడే కావటంవల్ల ఎక్కడా తప్పకుండా బియ్యే





పూర్తిచేశాడు.

చదువుల్లో అలా తేడా వచ్చినా దాని ప్రభావం వాళ్ళ స్నేహంమీద కొంచెంకూడా పడలేదు. కాలేజీలో భాస్కర్రావ్‌కి క్లాస్‌మేట్సుంటూ అనేకమందున్నా, వాళ్లలో ఏ ఒక్కరూ గోకారిలా అతనికి సన్నిహితం కాలేకపోయారు. మరీ అర్జంటు పన్లున్న ప్పుడు తప్ప అతను సాధారణంగా గోకారి పాన్‌షాప్‌లోనే గడుపుతుంటాడు లేదా గోకారి వాళ్ల ఇంట్లో.

తనయుడి స్నేహితుడైన భాస్కర్రావ్ అంటే రామేశ్వరికి మొదటినుంచీ పుత్రవాత్స ల్యమే! తల్లి లేని పిల్లవాడు. పైగా తనని నోరారా 'పెద్దమ్మా' అని పిలుస్తాడు. గోకా రితోపాటు తనూ ఒక బిడ్డలాగే ఇంట్లో తిరుగుతుంటాడు. తన కూతురు వెంకటల క్ష్మిని సొంతచెల్లెలికన్నా మిన్నగా చూసు కుంటూ ఉంటాడు. వెంకటలక్ష్మి కూడా గోకారిని 'అన్నయ్యా' అంటే, భాస్కర్రావ్‌ని 'చిన్నన్నయ్యా'అంటూ తన కిద్దరన్నలున్నట్టే ప్రవర్తిస్తుంది తప్ప అతన్ని పరాయి వ్యక్తిగా చూడదు. చచ్చి ఏలోకాన్న ఉన్నాడో గాని మహానుభావుడు రామజోగయ్య తమకే అవసరం వచ్చినా, పైసా కూడా వడ్డీ తీసు కోకుండా ఎంత డబ్బుంటే అంత సర్దుబాటు చేసి ఆదుకుంటూ ఉండేవాడు!

"మంచిది నాయనా! అయితే మనసు మార్చుకున్నావన్నమాట! నీకిక్కడ ఏం తక్కువని బాబూ ఉద్యోగంకోసం ఉన్న ఊర్నీ, మమ్మల్నందర్నీ వదిలేసి ఆ హైదరా బాద్ వెళ్ళటం? ! నువ్ ఊరెళ్ళి పోయినం దుకు మధ్యాహ్నం వెంకటలక్ష్మి ఎంత ఏడ్చిందో తెలుసా? " అంటూ సంతోషంగా చూసింది రామేశ్వరి.

అసలు భాస్కర్రావ్ హైదరాబాద్‌కంటూ ప్రయాణమవుతున్నప్పుడే అతనికి శతవిధా లచెప్పి చూసిందామె... "దూరపు కొండలు నునుపు నాయనా! వొద్దు అంత దూరమె ళ్ళొద్దు. నీకు వ్యవసాయం చేత గాకపోయినా, ఆ ఉన్న పొలం కౌలుకిస్తే ఆ వచ్చేదే నీ జరుగుబాటుకి ఎక్కువ. పోనీ అదీ చాలదనుకుంటే మా గోకారిలాగే ఏ పాన్‌షాపో, ఫ్యాన్సీ షాపో పెట్టుకుంటే సరి! అక్కడ నీకెవరున్నారని అలా ఉరుకులు పెడ్తున్నావ్? నా మాటిని నీ ప్రయాణం ఆపుకో" అని.

కానీ భాస్కర్రావ్ వినిపించుకోలేదు. "మా తాతయ్యకి నేను వ్యవసాయం చేయ డమో వ్యాపారం చేయడమో బొత్తిగా ఇష్టం లేదు పెద్దమ్మా! నువ్వెప్పుడూ ఇస్త్రీ బట్టలేసు కుని టిప్‌టావ్‌గా తిరుగుతుండాల్రా... మంచి ఉద్యోగం చేయాలి అని ఎప్పుడూ అంటుండేవాడాయన... అందుకే తను చదువుకోకపోయినా నన్ను కష్టపడి చదివిం చాడు" అంటూ సాకులు చెప్పేడు.

ఆ సమయంలో ఆ పక్కనే ఉన్న గోకారి "అబ్బే మేమంతా ఇస్త్రీబట్టలు వేస్కోవడం లేదు! ఉతికి ఆరేసిన బట్టల్ని అలాగే వేసే సుకుంటున్నాం" అంటూ వెటకరించి "బతక డానికి ఓ ఆధారమంటూ ఉండాలి. అంతే గాని అది ఉద్యోగమైతేనేం, వ్యాపారమై తేనేం, వ్యవసాయమైతేనేం? " అని తన మట్టుకు తానూ నచ్చజెప్పబోయాడు.

కానీ భాస్కర్రావ్‌కి ఆ మాటలు రుచించ లేదు. అందుక్కారణం తాతయ్య అభిలాషే! ఒకసారి కాదు. కనీసం వందసార్లైనా అనుంటాడు తాతయ్య అలా. ఒరే బాచీ ఎప్పటికన్నా నువ్ మంచి ఉద్యోగం చెయ్యాల్రా! అని

అందుకే మళ్ళీ ఆ మాటే చెబుతూ తన వ్యతిరేకతను తెలియజేశాడు భాస్కర్రావ్. "నేను ఉద్యోగస్థుడ్ని కాకపోతే మా తాతయ్య ఆత్మ క్షోభిస్తుందిరా! అదీగాక చది విన చదువుకు సార్థకత చేకూరాలంటే ఉద్యోగం చేయకపోతే ఎలా? " అంటూ వాదించాడు.

ఆ తల్లీ కొడుకులు మరింతగా చెప్పి

చూశారు గాని భాస్కర్రావ్ కొంచెం కూడా లొంగలేదు. అలాంటిదిపుడు అతగాడు మళ్ళీ తిరిగొచ్చేయడం చూసి అతను మనసు మార్చుకున్నాడనే అనుకుంది రామే శ్వరి. అందుకే ఆమె ముఖంలో సంతోషం తాండవించింది.

"ఈ వెధవ మనసెందుకు మార్చుకుంటా డమ్మా! మనసు మార్చుకుని కాదు వీడు వెనక్కి తిరిగొస్త! సూట్‌కేస్ పోగొట్టుకొని తిరిగొచ్చేశాడు" అన్నాడు గోకారి మిత్రుడు దూరమైపోతున్నాడన్న బాధతో. అలా అంటున్నప్పుడు అతని కంఠంలో కసిలాంటిది ధ్వనించింది.

"ఏంటీ సూట్‌కేస్ పోయిందా? అరె ఎలా పోయిందీ? " ఆందోళనగా ప్రశ్నిం చింది రామేశ్వరి.

"వెర్రి వాజమ్మలా దొంగ చేతికప్పగించే శాడు" అని ప్రారంభించి విషయం పూసగు చ్చినట్టు వివరించి చెప్పాడు గోకారి.

"మరీ అంత అమాయకత్వం అయితే ఎలా నాయనా? " అంటూ నిట్టూర్చింది రామేశ్వరి.

భాస్కర్రావ్ బిడియంగా తల దించుకు న్నాడు. అంతలో కేబుల్ టీవీలో సిన్మా చూడ్డానికి పక్కింటికి వెళ్ళిన వెంకటలక్ష్మి వచ్చిందక్కడికి. ఆమెకి పధ్నాలుగేళ్ళు. నైన్త్ చదువుతోంది.

భాస్కర్రావ్‌ని చూడగానే ఆమె ముఖంలో సంభ్రమానందాశ్చర్యాలు ముప్పి రిగొన్నై!

"అరే! చిన్నన్నయ్యా! నువ్ ఊరెళ్ళలేదా?" గట్టిగా అరుస్తూ భాస్కర్రావ్‌ని సమీపించి అతని భుజాలు రెండూ పట్టుకుని కుదిపే సింది ఆనందంగా.

"లేదమ్మా... ప్రయాణం వాయిదా పడింది. మరో రెండ్రోజులాగి వెళ్తాను" రెడ్డొచ్చె మొదలాడు అన్నట్టుగా మళ్ళీ అంతా చెప్పుకురావటం దేనికిలే అని,





క్లుప్తంగా అనేశాడు భాస్కర్రావ్.

వెంకటలక్ష్మిలోని ఆనందోత్సాహాలు పాల పొంగుపై చన్నీళ్ళు చిలకరించినట్టు చప్పున చల్లారిపోయిన్నై!

"రెండ్రోజుల తర్వాత వెళ్ళిపోతావా? అదేం కుదర్దు. నువ్ వెళ్ళడానికి వీల్లేదు. నువ్వెప్పుడూ ఇక్కడే వుండిపోవాలి" అంది ఇంచుమించు ఏడుపు ముఖం పెడ్తూ.

భాస్కర్రావ్ ఆ పిల్ల తలమీద చెయ్యేసి నిమురుతూ అన్నాడు. "నేనెప్పుడూ ఇక్కడే ఉండిపోతే నాకు ఉద్యోగం ఎలా? "

"ఏం నీకు ఉద్యోగం లేకపోతే ఇపుడేం నష్టం వొచ్చింది? " వెంకటలక్ష్మి బుంగమూ తిపెడ్తూ అలా అంటుంటే బాగా అడిగేవ్ అన్నట్టుగా చూసింది రామేశ్వరి కూతురి కేసి.

"అది కాదమ్మా! నేను ఉద్యోగం చెయ్యటం మా తాతయ్య కిష్టం అందు కని..." అంటూ భాస్కర్రావ్ ఇంకా ఏదో అనబోతుంటే,

"మీ తాతయ్య ఇప్పుడు లేడుగా? " చప్పున అనేసింది వెంకటలక్ష్మి.

భాస్కర్రావ్ ముఖంలో సడన్‌గా విషాదం అలుముకుంది. తాతయ్య గుర్తుకు రావడంతో అతని కళ్ళు లీలామాత్రంగా చెమ్మగిల్లినై.

కూతురు అలా అనుండాల్సింది కాదు అనిపించింది రామేశ్వరికి. ఆమె ఏదో అన బోయిందిగాని ఈలోగా భాస్కర్రావ్ తేరు కుంటూ అన్నాడు.

"తాతయ్య ఇప్పుడు లేకపోయినా ఆయన ఆత్మ అనుక్షణం నన్ను గమనిస్తూనే ఉంటుందమ్మా! అందుకని నేను ఉద్యోగం చెయ్యాలి తప్పదు"

వెంకటలక్ష్మి వదిలిపెట్టలేదు. "పోనీ ఆ ఉద్యోగమేదో ఇక్కడే చెయ్యొచ్చుగా? " అంది సాగదీస్తూ.

"ఇది చిన్న ఊరుకదా! ఇక్కడ ఉద్యో గాలేం దొరుకుతాయ్? హైదరాబాద్ అంటే రాజధాని కాబట్టి అక్కడ ఎన్నెన్నో కంపెనీ

లుంటాయ్! ఏదో ఒకదాన్లో ఉద్యోగం దొరుకుతుంది? "

"ఒకవేళ అక్కడా దొరక్కపోతే? "

"ఏముందీ... మళ్లీ మనూరికొచ్చేస్తాను"

వెంకటలక్ష్మి కళ్లు మెరిశాయ్.

"అలాగా అయితే నీకక్కడ ఉద్యోగం దొరక్కూడదు. దేవుడా! మా చిన్నన్నయ్యకి ఉద్యోగం దొరక్కూడదు."

-చివరివాక్యాన్ని కనిపించని ఆ దేవుడికి కళ్లు మూసుకుని దండంపెడ్తూ అంది వెంకటలక్ష్మి.

చెల్లికాని ఆ చెల్లికి తనమీద గల వల్లమాలిన అభిమానానికి భాస్కర్రావ్ మనసు మురిసిపోయింది.

మాతృప్రేమ ఎరుగని భాస్కర్రావ్‌కి గోకారివాళ్ళ ఇల్లు చిన్నప్పట్నుంచి ఎడారిలో ఒయాసిస్సులాంటిదే. తాతగారిలో అతనికి భగవంతుడు కనిపిస్తే గోకారివాళ్ల కుటుంబ సభ్యుల్లో తల్లీతోబుట్టువులూ కన్పిస్తుంటారు.

తాతగారి మరణానంతరం అతను దాదాపు ఈ ఇంట్లోనే ఉంటున్నాడు. ఈ ఇంట్లోనే తింటున్నాడు. వారానికి ఒకట్రొండ్రోజులు మాత్రం తన ఇంట్లో నిద్రపోతాడు. అప్పుడైనా పక్కన గోకారి తోడుండాల్సిందే.

గోకారివాళ్ల కుటుంబాన్ని చూసినప్పుడల్లా అతనికి మనస్సులో ఒక సందేహం వస్తుంటుంది. ఇంత మంచి ఇల్లాల్ని, రత్నాల్లాంటి ఈ పిల్లల్నీ వదిలి ఆ మహానుభావుడు అదెవతోగాని దాని కొంగుపట్టుకుని వీళ్ళని గాలికొదిలి ఎలా వెళ్లిపోగలిగాడా అని.

నిజమే. గోకారి తండ్రి వీరభద్రం, వెంకటలక్ష్మి ఏడాది పిల్లగా ఉన్నప్పుడు ఓ మాయలాడి మోజులో పడి వీళ్లని నిర్దాక్షిణ్యంగా వదిలేసి ఆమెను తీసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు. వాళ్లిప్పుడెక్కడున్నారో కూడా ఎవ్వరికీ తెలియదు.

పాపం రామేశ్వరి అప్పట్నుంచి కలంకారి అద్దకం పనిచేస్తూ అతికష్టంమీద సంసారాన్ని గుట్టుగా నడుపుకుంటూ వస్తోంది. ఇప్పుడంటే గోకారి చేతికందొచ్చి నాలుగు రాళ్ళు తెస్తున్నాడు కాబట్టి ఫర్వాలేదుగాని అంతకుముందంతా ఆవిడ తిప్పలు ఆవిడకే తెలియాలి. అప్పే చేసిందో సప్పే చేసిందో గాని మొత్తానికయితే పిల్లల్ని లోటు తెలియకుండా పెంచుకొచ్చిందావిడ.

భర్త తననలా గాలికొదిలేసిపోయినా ఏనాడూ అతన్నావిడ పన్నెత్తు మాటనగా ఆలకించలేదు భాస్కరం. "ఆ ముండే ఆయనకేదో మందు పెట్టిం"దంటూ ఎప్పుడన్నా గొణుక్కోవడం మాత్రం విన్నాడంతే.

వెంకటలక్ష్మి మాటలకి మురిసిపోయిన భాస్కరం "ఇప్పుడు నువ్విలా మొక్కుకుంటున్నావు సరే. రేపు నీకు పెళ్ళయి నువ్ అత్తవారింటికి వెళ్లిపోయాక మేం ఏమని మొక్కుకోవాలి? " అంటూ నవ్వేడు.

పెళ్ళి మాటెత్తగానే ఆడపిల్లకు సిగ్గు ముంచుకురావడానికి వయస్సుతో నిమిత్తం ఏముంది? "ఛీ పో అన్నయ్యా" అంటూ రెండు చేతుల్లో ముఖం దాచుకుని అక్కడ్నించి లోపలకి పరుగుతీసింది వెంకటలక్ష్మి.

భాస్కర్రావ్ ఫక్కున నవ్వేడు.

దాంతో వాతావరణం తేలిక పడింది.

రామేశ్వరి కూడా చిన్నగా నవ్వి అంతలోనే ఓ నిట్టూర్పు విడిచింది. "ఇంకా ఆ భారం ఒకటి మిగిలిపోయింది నాయనా నామీద! దాని పెళ్లికంటూ వెనకేమీ వేయలేకపోయాను. ఆ భగవంతుడేం చేస్తాడో ఏమో" అంది కించిత్ దిగులుగా.

"ఆ భారం నీదెలా అవుతుంది పెద్దమ్మా! చెట్టంత అన్నలం. నేనూ గోకారి లేమూ? " అన్నాడు భాస్కర్రావ్ నిండుమనసుతో.

"అంతమాటన్నావు అదే పదివేలు నాయనా" అనలేదు రామేశ్వరి. భాస్కర్రావ్ మాటల్లో సిన్సియారిటీ కొట్టొచ్చినట్టు కనిపి

స్తుంటే అలాంటి సాదా సీదా మాటలు అనాలనిపించలేదామెకు.

'బంగారు తండ్రి' అనుకుంది మనసులో.

"నిజమేలే బాబూ! మీరిద్దరూ ఉండగా నాకేంటి భయం" అంది ఎంతో తృప్తిగా.

దరిమిలా గోకారి భాస్కర్రావ్‌ని స్నానానికి లేవదీశాడు.

"లెగరా! స్నానాలు కానిస్తే భోజనాలు చేసేయొచ్చు నాకు ఆకలి దంచేస్తోంది" అంటూ.

"ముందు నువ్ కానియ్" అన్నాడు భాస్కర్రావ్ లేచే ప్రయత్నమేదీ చేయకుండా. ఒక్కోసారి అతనంతే. రాత్రిపూట స్నానానికి బద్ధకించేస్తూ ఉంటాడు.

ఆ విషయం గోకారికి తెలిసిందే కావటం వల్ల... "అదేం కుదర్దు అసలే ప్రయాణం కూడా చేసొచ్చేవ్. ముందు నువ్వే చెయ్యి..." మిత్రుడ్ని జబ్బపట్టి లాక్కెళ్ళిపోయాడు అక్కడ్నించి.

★ ★ ★

భోజనానంతరం వెంకటలక్ష్మి డాబామీద పక్కలు వేస్తుంటే స్నేహితులిద్దరూ పిట్టగోడమీద కూర్చొని కబుర్లలోపడ్డారు.

"పోతే పోయిందిలే వెధవ సూట్‌కేసు. బట్టలేకదా మళ్ళీ కొనుక్కోవచ్చు ఏదో ఆ దొంగగాడి పుణ్యమా అని మళ్ళీ వెనక్కొచ్చేశావ్..." అని ప్రారంభించి మళ్ళీ పాతపాటే మొదలెట్టాడు గోకారి.

అంటే... వచ్చినవాడివి ఎలాగూ వచ్చేశావ్. ఇంక హైద్రాబాద్ వెళ్లే ఆలోచన మానేస్కో. ఇక్కడే ఉండి ఏదో ఒకటి చేసుకోవచ్చు అని సలహా ఇవ్వటం అన్నమాట!

"నేనొక నిర్ణయానికొచ్చాక దాన్ని మళ్ళీ మార్చుకునే ప్రసక్తే లేదని తెలుసుండి కూడా ఎందుకురా నన్నిలా సతాయిస్తావ్? ఇంకేదయినా చెప్పు వింటాను. అంతేగాని నన్ను ఉద్యోగ ప్రయత్నం మానమని మాత్రం అనొద్దు" వినీవినీ తల వాచిపోయి ఉందేమో ఒకింత విసుగ్గానే అన్నాడు భాస్కర్రావ్.

"అది తప్ప ఏం చెప్పినా వింటావా?" మనసులో ఒక దూరాలోచన చేస్తూ అడిగేడు గోకారి. "ఎందుకు విన్నూ? మొన్న మనం అతికష్టమ్మీద చూసిన 'డొక్క చిరుగుద్ది' సిన్మా కథని నువ్విప్పుడు సీన్‌బైసీన్ వర్ణించి చెప్పినాసరే ఓపిగ్గా వింటాను" అన్నాడు భాస్కర్రావ్!

'డొక్క చిరుగుద్ది' సిన్మాని సీన్‌బైసీన్ మళ్ళీ చెప్పడమంటే అది ఆత్మహత్య మరియు హత్యాప్రయత్నం లాంటిదని గోకారి అంత సాహసం చెయ్యలేడనీ అనుకున్నాడు మనసులో. అంతేతప్ప మిత్రుడు వేరే విధమైన ఆలోచనతో తనని ట్రాప్ చేస్తున్నాడని మాత్రం ఊహించలేకపోయాడు.

"నిజంగా వింటావా?" గోకారి రెట్టిస్తూ అడిగాడు.

"చెప్పే దమ్ము నీకుండాలేగాని వినేదమ్ము నాకూ ఉంది. ఊఁ కానియ్..." నిబ్బరంగా అన్నాడు భాస్కర్రావ్.

"నే చెప్తానంటోంది 'డొక్కచిరుగుద్ది' సిన్మా కథ కాదు..."

"ఏదో ఒకట్లే కానియ్... ఈ ప్రపంచంలో ఏదీ కూడా అంతకన్నా అధ్వాన్నంగా ఉండదు" 'డొక్కచిరుగుద్ది' కథ వింటానికి సిద్ధపడినవాణ్ణి... ఇంక దేనికి మాత్రం భయపడ్తాను?' అన్నట్టుగా చూస్తూ మరింత నిబ్బరంగా అన్నాడు.

"అయితే విను. మొన్న నీకొచ్చిన సంబంధం. అదే పాపారావ్‌గారి అమ్మాయి. నీకు అన్నివిధాలా అనుకూలమైనది. ఎందుకంటే అందాన్ని ఎవ్వరూ కొరుక్కు తినలేరుగాని డబ్బుంటే ఎవ్వరైనా సరే సుఖపడొచ్చుకదా... అందుకని..." పెల్లుబికి రాబోయిన నవ్వుని లోపలికి అణిచేసుకుంటూ అన్నాడు గోకారి.

అతనూహించినట్టే భాస్కర్రావ్ పక్కలో బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు.





"స్టాప్ నాన్సెన్స్" అనరిచేడు కోపంగా.

"నాన్సెన్సేముందిరా? నేనంత సెన్స్‌లెస్ ఫెలోని కాదు. మన పెడనలో పాపారావుగారికన్నా ధనవంతుడెవరున్నారు చెప్పు? ఆగర్భశ్రీమంతుడాయె. ఆ అమ్మాయి ఆ అపర కుబేరుడికి ఒక్కగానొక్క కుమార్తాయె. అఫ్ కోర్స్ అందంలో ఆమె కొంచెమే బాగుండే మాట నిజమే. అయినా... అందాన్నేం చేస్కుంటాం చెప్పు? " అంటూ ఇంకా ఏదో చెప్పబోయాడు గోకారి.

కానీ ఈలోగా "షటప్" అంటూ పరుగెత్తుకొచ్చింది పక్కవేస్తున్న వెంకటలక్ష్మి. అన్నయ్యలిద్దరూ దేనికో పోట్లాడేసుకుంటున్నారేమోనని కంగారు పుట్టిందామెకి.

"చూడమ్మా... గోకారేమంటున్నాడో? " ఫిర్యాదు చేస్తున్న ధోరణిలో అన్నాడు భాస్కర్రావ్ ఆమెతో.

"నేనేమన్నాన్రా... నీ మంచికోరి ఓ మంచిమాట చెబ్తుంటే ఎందుకలా గొంతు చించుకుంటావ్? " మళ్ళీ నవ్వును అణచి పెట్టుకుంటూనే అన్నాడు గోకారి.

మిత్రుణ్ణి కాసేపు సరదాగా ఏడిపిద్దామనే అతనా ప్రస్తావన తెచ్చాడు తప్పితే, పాపారావుగారి కూతుర్ని నిజంగా భాస్కర్రావ్ చేసుకోవాలని కాదు.

"ఏంటన్నయ్యా అది? "

వెంకటలక్ష్మి గోకారివేపు చూస్తూ అడిగింది. గోకారి ముసిముసిగా నవ్వుతుంటే భాస్కర్రావ్ చెప్పాడు. "వీడు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నాడు మళ్ళీ. నీకు పాపారావ్‌గారమ్మాయి తెల్సుకదా? నన్నా అమ్మాయిని చేస్కోమని సలహా ఇస్తున్నాడు"

"ఏంటీ ఆ తాటకినా? ఛఛ..." అంది వెంకటలక్ష్మి ఆముదం తాగినదాన్లా ముఖం పెట్టి.

"ఏం ఆ తాటకైతేనేం? వాళ్లకి బోల్డంత డబ్బుంది తెలుసా? పాపారావుగార్కి ఆమె ఒక్కత్తే కూతురు. నమ్మకపోవటంవల్ల అది కన్పించకుండా ఉంచటానికి ముఖాన్ని ఓ పక్కకి తిప్పేసుకుంటూ అన్నాడు గోకారి.

డబ్బుంటే మాత్రం? చందమామలాంటి చిన్నన్నయ్య పక్కన ఆ బుల్లిరాక్షసిలాంటి అమ్మాయి ఏం బావుంటుంది? " ఆకాశంలో సమయానికి చందమామ కన్పించి భాస్కర్రావ్ విషయంలో ఆ ఉపమానాన్ని వాడింది వెంకటలక్ష్మి.

"అద్దిరబన్నా అల్లా చెప్పు" అన్నాడు భాస్కర్రావ్ తనకో సపోర్ట్ దొరికినందుకు సంతోషపడిపోతూ.

"పోనీ నీకంత ఇదిగా ఉంటే నువ్వే చేస్కోవచ్చుగా ఆ అమ్మాయిని? " అంటూ గోకారికేసి చిలిపిగా చూశాడు.

"నేను చేస్కుంటానన్నా పాపారావ్ తన కూతుర్ని నాకివ్వొద్దూ? నీ సంగతి వేరు. నీమీద ముచ్చటపడి ఆయన మొన్న ఆ రామశాస్త్రిగారి ద్వారా కబురు చేశాడు కాబట్టి... ఆ అవకాశం నీకే ఉంది" తిప్పికొట్టాడు గోకారి.

ఓ పదిహేనురోజుల క్రితం రామశాస్త్రి అనే పెళ్ళిళ్ళపేరయ్య ద్వారా భాస్కర్రావ్‌కి అలాంటి వర్తమానం అందినమాట నిజమే. పాపారావ్‌గారిదీ, భాస్కరరావువాళ్ళదీ ఒకటే కులం. కులం కలిస్తే చాలు గర్భదరిద్రుడికైనా సరే తన కూతుర్ని చేసుకోమంటూ ఓమాట కబురంపి చూస్తుంటాడు పాపారావ్‌గారు.

అయినాసరే పాపం ఆయన కూతురికి కళ్యాణం అవ్వడం లేదంటే ఆమె ఎంత అందగత్తో వేరే చెప్పాలా?

భగవంతుడిచ్చిన రూపాన్ని ఎగతాళి చేయడం తప్పేగాని, నరజన్మ ఎత్తిన వాడెవడూ ఆమెను చేస్కోవడానికి ముందుకు రాడన్నది నిర్వివాదాంశం. లేకపోతే ఆయనకున్న ఆస్తికి, ఆయన తన కూతురికి పెళ్ళి చేయలేకపోవడం ఏమిటి?

"దూకాలనుకుంటే చెరువులో దూకే అవ

కాశం అందరికీ ఉంటుంది. అంతమాత్రాన ఎవరైనా దూకేస్తారా? అలాగే ఇదిన్నూ..."

మిత్రుడు తనని పాపారావ్‌గారి కూతుర్ని చేస్కోమంటున్నాడన్న ఉక్రోషంతో మనసు అదోలా అయిపోయి, అలాంటి అర్థం ఉందో లేదో తెలియని ఉపమానాన్ని చెప్పి... "ఇంక చాల్లే ఆపు! కొన్ని కొన్ని విషయాలు 'మాడు పగులుద్ది' సిన్మా కథకన్నా అధ్వాన్నంగా ఉంటాయన్న నగ్నసత్యం ఇప్పుడే తెలిసింది నాకు" అన్నాడు భాస్కర్రావ్.

మిత్రుడు రేపోమాపో తమని విడిచి వెళ్ళిపోబోతున్నాడన్న దిగులును మర్చిపోవడానికి గోకారి కాసేపు నవ్వులాటగా ఉంటుందికదాని కావాలనే పాపారావ్‌గారి కూతురి ప్రసక్తి తెచ్చాడు తప్పితే... అంతకన్నా మరో ఘోర దురాలోచన మాత్రం అతన్లో ఇంకేమీ లేదు.

"సర్లేరా! పాపారావ్‌గారమ్మాయొద్దులేగాని నీకెలాంటి అమ్మాయి కావాలో చెప్పు. నువ్వక్కడ ఉద్యోగం చేస్తుంటే మేము నీకు ఇక్కడ పెళ్లిసంబంధాలు చూస్తుంటాం" అంటూ నవ్వేడు గోకారి.

"ఇంక వేరే టాపిక్కేం దొరకనట్టు నా పెళ్లిమీద పట్టించావేంట్రా ఇవ్వాళ? చూడబోతే నీకు పెళ్లిమీద గాలి మళ్ళినట్టుందే?" సందేహాన్ని వ్యక్తం చేశాడు భాస్కర్రావ్.

"అదేంలేదులేగాని- నీ సంగతి చెప్పు. నీకెలాంటి అమ్మాయి కావాలి?"

మిత్రుడు కొంచెం సీరియస్‌గానే అడిగినట్టనిపించింది. సిన్సియర్‌గానే చెప్పాడు భాస్కర్రావ్.

"ఎంతవరకు నిజమో తెలీదుగాని మా తాతయ్య అప్పుడప్పుడూ అంటుండేవాడ్రా. జుట్టు పొడుగ్గా ఉన్న స్త్రీకి సహనం ఎక్కువని. సహనం సంగతి అలా ఉంచితే చూడ్డానిక్కూడా పొడవాటి జడున్న అమ్మాయిలు చక్కగా ఉంటారు. మనం ఆరోతరగతి చదివేటప్పుడు మన క్లాస్‌టీచర్ అచ్చుతాంబగారు గుర్తున్నారా? ఆవిడ జడ పొడుగ్గా ఎంత బావుండేదో గుర్తుందా? ఆవిడ చాలా నెమ్మదస్తురాలు కదా! ఎప్పుడూ ఎవ్వర్నీ కొట్టేది కాదు. కనీసం ఆవిడెవరిమీదా కోపగించగా కూడా నేనెప్పుడూ చూళ్లేదు. నీకు గుర్తుందో లేదోగాని నేను రోజూ మా పెరట్లో పూసిన గులాబీలు కోసుకెళ్లి ఆవిడకిస్తుండేవాణ్ణి. నేనిచ్చిన పూలు ఆవిడ తల్లో పెట్టుకుంటే నాకెంతో ఆనందంగా అనిపించేది. ఆవిడ క్లాస్‌లో ఉన్నంతసేపూ నేనామె జడకేసే చూస్తుండేవాణ్ణి. ఇంతకన్నా స్పష్టంగా అయితే చెప్పలేనుగాని... మొత్తానికి నాకు పొడవాటి జుట్టున్న అమ్మాయిలంటే ఇష్టం. అలాగని జుట్టొక్కటీ పొడవుగా ఉంటే చాలనుకోకు. నగ్మాలాగో, రోజాలాగో కొంచెం అందం కూడా ఉండటం అవసరమే"

"వార్నీ... మరి ఎప్పుడూ చెప్పావు కాదేం? అయితే నీకు సుకేశిని కావాలన్నమాట" రవంత ఆశ్చర్యంగా చూశాడు గోకారి.

"సుకేశినా ఆవిడెవరూ?" అనేశాక అప్పుడు వెలిగింది బల్బు.

"ఆం ఆం అవున్రా... సుకేశినే! సుకేశినే కావాలి" అన్నాడు భాస్కర్రావ్. తీరా అన్నాక అప్పుడొకింత బిడియంలాంటిది కలిగి ముఖాన్ని పక్కకు తిప్పేసుకున్నాడు.

"భలే భలే! అయితే మా చిన్నొదినకు నల్లతాచులాంటి తెగబారెడు జడుంటుందన్నమాట!" అంటూ చప్పట్లు కొట్టింది వెంకటలక్ష్మి.

ఆ అమ్మాయి ఇంకా అక్కడే నిలబడి వీళ్ల సంభాషణంతా ఆలకిస్తూనే ఉంది.

భాస్కర్రావ్ చిన్నగానవ్వి... "అదిసరేగాని... నువ్ తప్పకుండా రచయిత్రి వవుతావమ్మా!" అంటూ మాట మార్చబోయాడు.





"ఎందుకని?" అన్నాడు గోకారి.

"నువ్ గమనించేవో లేదోగాని చెల్లాయి అన్నిటికీ ఉపమానాలు వాడ్తుంటుంది... నల్లతాచులాంటి జడ... చందమామలాంటి చిన్నన్నయ్య..."

మధ్యలోనే అందుకుంటూ అన్నాడు గోకారి. "ఏదో నీ అందాన్ని పొగిడింది కదాని దాన్ని ఆకాశానికి ఎత్తేయనవసరం లేదు. ఆ దిక్కుమాలిన వీక్లీలూ అవీ చదివితే ఎవరికైనా అలాంటి భాషే వస్తుంది..."

టెన్త్‌క్లాస్ రెండు మార్లు రాసి కూడా ప్యాసవ్వలేకపోయిన గోకారికి పాఠ్య పుస్తకాలంటేనేకాదు, వారపత్రికలూ గట్రా అన్నా చిరాకే. అసలు అక్షరాల వెంట కళ్లని పరుగెత్తించడం అంటేనే అతనికి ఒళ్లు మంట. క్లుప్తంగా చెప్పాలంటే పుస్తకద్వేషి.

అన్నగారి మాటలకి ఉడుక్కొంది వెంకటలక్ష్మి. "ఏం నేను రచయిత్రిని కాలేననుకుంటున్నావా? చూస్తుండు. చిన్నన్నయ్య చెప్పినట్టు నేనెప్పటికైనా గొప్ప రచయిత్రినై గొప్ప పేరు తెచ్చుకుంటాను ఆc..." అంది చిత్రంగా చేతులు తిప్పుతూ.

"నాలా టెన్త్‌క్లాస్ తప్పకుండా ఉంటే అదే చాలు. రచయిత్రివైనంత ఫలితం..." అని తేలిగ్గా తీసి పారేశాడు గోకారి.

వెంకటలక్ష్మి మూతి మూడు వంకర్లు తిప్పి వెళ్లిపోయింది అక్కణ్ణుంచి.

"ఎందుకురా పాపం అలా అన్నావు? చిన్నపిల్ల... పాపం నొచ్చుకోదూ!" అన్నాడు భాస్కర్రావ్.

తేలిగ్గా నవ్వేశాడు గోకారి. మొత్తానికి సరదాగా సాగిన ఆ సంభాషణలో ఒక కొత్త విషయమైతే తెలిసింది... భాస్కర్రావ్ భావి సతీమణికి పొడవాటి జడ కంపల్సరీగా ఉండి తీరాలని.

★ ★ ★

నాల్రోజులు గడిచాక...

మళ్లీ కొత్త బట్టలూ అవీ కొనుక్కుని భాస్కర్రావ్ మరో సూట్‌కేస్‌లో వాటన్నిటిని సర్దుకుంటుంటే...

"మళ్లీ రేగిందాతిక్క?" అన్నాడు గోకారి, తమలపాకుల్ని ఓ పొడిగుడ్డతో శుభ్రంగా తుడిచి ఓ బేసిన్‌లో పేరుస్తూ.

సమయం ఉదయం అయిదున్నర. అతనింకా షాప్ తియ్యడానికి వెళ్లలేదు.

"నువ్వేమన్నా అనుకో... నేను మాత్రం వెళ్లేది వెళ్లేదే. అదీగాక ఈసారి నేనేం నిరాధారంగా వెళ్లటంలేదుకదా!" అన్నాడు భాస్కర్రావ్.

అతని చేతిలో రైస్‌మిల్లర్ కోటేశ్వర్రావ్ గారు హైదరాబాద్‌లో ఉంటున్న తన తోడల్లుడు జగదీష్‌కి రాసిన ఓ రికమండేషన్ లెటర్‌లాంటిది ఉంది. "ఇతను మా ఊరి కుర్రవాడు. బియ్యే పాసయ్యాడు. బుద్ధిమంతుడు. ఇతనికి నీ ఇన్‌ఫ్లూయన్స్ ఉపయోగించి ఏదన్నా ఉద్యోగం దొరికేలా చూడు. అంతవరకూ ఇతను ఉండటానికి వసతి గట్రా కూడా చూసి పెట్టు. డబ్బుకి ఇబ్బందేమీలేదు. ఉద్యోగం దొరికేదాకా తన ఖర్చులు తానే పెట్టుకుని మెయిన్‌టెన్ కాగలడు..." ఇదీ ఆ ఉత్తరంలోని సారాంశం.

కోటేశ్వర్రావ్‌గారు రామజోగయ్యగార్కి సమ వయస్కుడు కాకపోయినా మిత్రుడిలాంటివాడు. రామజోగయ్య మనవడు ఉద్యోగం కోసమని హైద్రాబాద్ బయలుదేరి విజయవాడలో సూట్‌కేస్ పోగొట్టుకుని తిరిగొచ్చేశాడన్న వార్త ఆయన చెవిని పడ్డంతో తనకుతానై భాస్కర్రావ్‌ని పిలిపించి మంచీ చెడ్డా మాట్లాడి, "సిటీలో నీకు తెలిసిన వాళ్లెవరూ లేరంటున్నావు కాబట్టి, మా తోడల్లుడికో ఉత్తరం రాసిస్తాను పట్టుకెళ్లు. ఆయన నీకు చేయగలిగినంత సహాయం తప్పకుండా చేసి తీర్తాడు. అసలే నువ్ కొంచెం అమాయకం టైపు. తెలిసిన వాళ్లెవరూ లేకపోతే ఆ మహా నగరంలో ఒంటరిగా నెట్టుకు రాలేవు" అంటూ ఆ ఉత్త

రాన్నిచ్చాడాయన.

అందువల్ల ఇపుడు తన చేతిలో కొత్తగా వజ్రాయుధమేదో వెలిసినంత ధీమాగా ఫీలైపోతూ భాస్కర్రావ్ అన్నాడలా...

"ఆ కోటేశ్వర్రావ్‌గారు చిన్న ఉత్తరమ్ముక్క రాసిచ్చినంత మాత్రాన అక్కడ నీ పనులన్నీ సజావుగా అయిపోతాయనుకోబాకు. ఉద్యోగం దొరికేదాకా ఎన్నిపాట్లు పడాల్సుంటుందో ఏమో?! ఎందుకైనా మంచిది మరొక్కసారి ఆలోచించుకో" పిరికిమందు నూరిపోస్తూ అన్నాడు గోకారి.

దానిక్కారణం మిత్రుడి మీదున్న అభిమానమే! మిత్రుడు తనకి దూరమైపోకూడదన్న తాపత్రయమే!

"నిదానమే ప్రధానమన్న సూత్రానికి కట్టుబడి ఉండేవాణ్ణి నేను. నేనేం తొందరపడిపోవటంలేదు. కోటేశ్వర్రావ్‌గారు నాకా ఉత్తరమిచ్చి మూడ్రోజులైంది. ఈ మూడ్రోజులూ నేను బాగా ఆలోచించే ఈ రోజు ప్రయాణమవుతున్నాను. ఆ జగదీష్‌గారు నాడు సహాయం చేసినా చెయ్యకపోయినా నేనైతే ఒంటరి పోరాటం చేసయినా సరే ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకుంటాను. అసలాయన ఈ ఉత్తరం ఇవ్వడం అనేది అనుకోకుండా జరిగింది. ఇది నా చేతిలో లేకపోయినా వెళ్లాలనేకదా నేను అనుకున్నాను?" అంటూ తన స్థిర నిర్ణయాన్ని తెలియజేశాడు భాస్కర్రావ్.

"సరే నీ ఇష్టం" అనేశాడు గోకారి పొడిగా. అంతలో రామేశ్వరీ, ఆమె వెనుక వెంకటలక్ష్మి కూడా వచ్చారా గదిలోకి.

ఆఖరి ప్రయత్నంగా మరోమారు చెప్పి చూద్దామా అనిపించినా కంఠశోషే తప్ప లాభముండదనిపించి మిన్నకుండిపోయింది రామేశ్వరి. వెంకటలక్ష్మి మాత్రం కాసేపు గునిగింది. "అంతేలే చిన్నన్నయ్యా! పోనీలే




చిన్నన్నయ్యా. అయినా మేం నీకేమవుతామని మా మాట వింటావులే చిన్నన్నయ్యా' అంటూ నిష్ఠూరాలు కూడా వేసింది.

అయినా భాస్కర్రావ్ ఆమెను సముదాయిస్తూ ఏవేవో చెప్పాడే తప్ప... తన మనసు మార్చుకోలేదు.

దాంతో రామేశ్వరి అతన్ని వారించే ప్రయత్నానికి స్వస్తిచెప్పింది. "జాగ్రత్త నాయనా! ఈసారి ప్రయాణంలో సూట్ కేస్ని జాగ్రత్తగా కాపాడుకో! సిటీలో మోసగాళ్లుంటారు. ఎవర్ని పడితే వాళ్లని గుడ్డిగా నమ్మేయబాకు"

"వెళ్లగానే ఏదన్నా రూమ్ చూసుకొని నీకు చేతనైనంతలో నువ్వే వండుకు తిను. హోటల్ భోజనం బావుండదు"

"సినిమాలూ అవీ ఎక్కువగా చూడొద్దు... రాత్రుళ్లు ఎక్కువసేపు మెలుకువగా ఉండి ఆరోగ్యం చెడగొట్టుకోకు..."

"నువ్వసలే అమాయకం. ఇక్కడెలా ఉన్నా ఫర్వాలేదుగాని, ఆ మహానగరంలో అలా ఉంటే లాభంలేదు. కాస్త గడుసుతనం నేర్చుకో!"

ఇలా ఒక్కొక్కటిగా ఏవేవో చెప్తూనే ఉందావిడ భాస్కర్రావ్ గడపదాటే వరకూ.

★ ★ ★

విజయవాడ స్టేషన్లో బండి దిగుతూనే ఓమారు ప్లాట్ ఫాం అంతా కలయజూశాడు భాస్కర్రావ్... ఒకవేళ ఆ దొంగగాని ఎక్కడన్నా కనబడతాడేమోనని.

జనం వేల సంఖ్యలో ఉన్నారు. రకరకాల అరుపులూ, కేకలూ, నానాగందరగోళం మధ్య అటూఇటూ హడావుడిగా తిరుగుతున్నారు.

ఇంతమందిలో ఆ దొంగని ఎలా గుర్తుపట్టడం?

అదీగాక వాడింకా అదే డ్రెస్సూ అదే గెటప్లో అలాగే ఉంటాడని గ్యారంటీఏంటీ?



గుర్తు పట్టడానికి వీల్లేకుండా ఈపాటికి వేషం మార్చేసే ఉంటారు. దొంగలు మారు వేష ప్రవీణులుకదా? అయినా ఆశ చావక ఓపిగ్గా ప్లాట్‌ఫాం అంతా ఆ చివర్నుండి ఈ చివరి వరకూ గాలించాడు.

అయినా లాభం లేకపోయింది. దాంతో ప్లాట్‌ఫాంమీద కెళ్లి అక్కడ కూడా గాలించాడు.

ఊహు... అక్కడాలేదు. అలాఅలా ప్లాట్‌ఫామ్‌లన్నీ గాలించుకుంటూ రెండో నంబర్ ప్లాట్‌ఫామ్మీదకెళ్లేసరికి నాలుక పిడచగట్టుకుపోతున్నట్టనిపించింది.

కోకాకోలా తాగితే బావుండును అనిపించింది. గాని అంతలోనే భయం కూడా వేసింది.

మొన్న కోకాకోలా తాగటంవల్లేకదా, సూట్‌కేస్ పోయింది. కాబట్టివద్దు. కోకాకోలా తాగొద్దు... అనుకున్నాడు. కానీ అంతలోనే అది చాలా తెలివి తక్కువతనం అనిపించింది.

కాదామరి? కోకాకోలా తాగినప్పుడల్లా సూట్‌కేస్‌పోవాలని రూలేముంది? ఈసారి జాగ్రత్తగా ఉంటేసరి.

అలా అనిపించేక ధైర్యం తెచ్చుకుని కూల్ డ్రింక్స్ అమ్మే షాపు దగ్గరికెళ్లి కోకాకోలా అడిగి తీసుకున్నాడు.

ఓ గుక్క గొంతులోకి జారగానే ఆ చల్లదనానికి కళ్లు మూతలు పడబోయినైకాని... అలా పడకుండా నిగ్రహించుకున్నాడు. కోకాకోలా కళ్లు మూసుకుని తాగటందేనికి? ఏం తెరుచుకుని తాక్కూడదా? అన్న రైల్వే పోలీసు మాటలు మనసులో మెదలటం వల్ల.

చలచల్లగా మరో రెండు గుక్కలు తాగేడు. బాగా దాహం వేస్తున్నదేమో ప్రాణం లేచొచ్చినట్టుగా అనిపించింది.

అంతలోనే అతనికి చెప్పలేనంత కంగారు పుట్టుకొచ్చింది.

ఎవడో తన సూట్‌కేస్‌ని దర్జాగా చేతిలో పట్టుకుని వెళ్లిపోతున్నాడు. ఆలివ్‌గ్రీన్ కలర్ సూట్‌కేసు.

తనదే... సందేహం లేదు తనదే!

అమ్మ దొంగముండాకొడుకా! నువ్వింకో దొంగవన్నమాట! సూటూ బూటూ వేస్కుని ఎంత దర్జాగా ఉన్నావ్‌రా? హుం... ఐతే మీ దొంగలందరూ ఇలా దర్జాగానే ఉంటారన్నమాట?

"దొంగ! దొంగ!" అని గట్టిగా అరవబోయాడు. కానీ గొంతు పెగల్లేదు.

అందుక్కారణం... "వొద్దు తొందరపడకు. నిదానమే ప్రధానం! నిదానమే ప్రధానం" అని అంతరాత్మ ఘోషించడం.

అంతరాత్మ ఘోషవల్ల కొద్ది క్షణాలు తటపటాయించినా అంతలోనే తెలివితెచ్చుకున్నాడు.

సమయం సందర్భం కనిపెట్టి ప్రవర్తించాలే తప్ప తాతగారి సూత్రాన్ని గుడ్డిగా ఫాలో అయిపోతే ఎలా?

గోకారికూడా ఆమాటే అన్నాడుకదా!

అంతే! ఇంక వెనకా ముందూ చూసుకోలేదు భాస్కర్రావ్. 'దొంగ! దొంగ...' అని బిగ్గరగా అరుస్తూ తన సూట్‌కేస్‌నెత్తుకెళ్లిపోతున్న ఆ దొరబాబులాంటి దొంగ వెనక పరుగుతీశాడు, కానీ మనసులో మాత్రం "సారీ తాతయ్యా! నీ సూత్రానికి తిలోదకాలిచ్చేసినందుకు నన్ను మన్నించు... తప్పదు మరి. నీ బోడి సూత్రానికి కట్టుబడి ఈసారి కూడా బంగారంలాంటి సూట్‌కేస్‌ని పోగొట్టుకోలేను" అనుకున్నాడు.

"దొంగ! దొంగ... పట్టుకోండి పట్టుకోండి"

ఒక పక్క అరుస్తూనే వెనకపాట్న వెళ్లి ఆ దొరబాబులాంటి దొంగనిగట్టిగా పట్టేసుకున్నాడు.

"వాటీజ్ దిస్ నాన్సెన్స్? ఎవర్నువ్వు? వొదులు... నన్నొదులు" గింజుకుంటూ అన్నాడు దొరబాబు. అప్పటికే ఓ ఇరవై ముప్పైమంది చుట్టూ కమ్మేసుకున్నారు వీళ్లిద్దర్నీ... ఏమైంది? ఏమైందంటూ.





"ఈ రాస్కెల్ నా సూట్ కేస్ ఎత్తుకుపోతున్నాడండీ... చూడండి ఎంత దర్జాగా ఉన్నాడో! దొరబాబులా వేషం వేస్కోడం, దొంగతనాలు చెయ్యడం అందరికీ ఇదో అలవాటయిపోయింది" దొరబాబుని వాటేస్కుని ఉన్న భాస్కర్రావ్ రొప్పుతూ అన్నాడు.

సాధారణంగా అలాంటి సందర్భాల్లో జనం చూస్తూ ఊరుకోరు. దొంగతనం మోపబడిన వాడిని ముందూ వెనుకా ఆలోచించకుండా ఉతికి పారేస్తారు. కానీ ఇక్కడీ సందర్భంలో ఆ దొరబాబు మరీ డిగ్నిఫైడ్‌గా మరీ జెంటిల్మన్‌లా ఉండటంవల్ల అతనిమీద చెయ్యి చేసుకోవడానికి సాహసించలేదెవ్వరూ.

అలాగని బొమ్మల్లా నించుండిపోయారని కాదు. చొక్కా చేతులూ గ్రుట్రాపైకి ముడుస్తూ ఒకపక్క సిద్ధపడిపోతూనే ఉన్నారు... ఒకవేళ దొంగేనని తేల్తే శక్తి కొద్దీ దంచటానికి.

"ఏయ్ మిస్టర్! ఏంటి నువ్ వాగుతోంది? " దొరబాబు కళ్ల వెంబడి నిప్పులు కురిపిస్తూ తనని వెనగ్గా వాటేసుకున్న భాస్కర్రావ్‌ని విదిలించి కొట్టేడు.

భాస్కర్రావ్‌కి వళ్లు మండిపోయింది.

దొంగరాస్కెల్‌కి ఎంత పొగరు? దొంగతనం చేసి దొరికిపోయినందుకు సిగ్గుతో చావాల్సిందిపోయి, పైగా ఎలా బుకాయిస్తున్నాడో? అనుకున్నాడు కోపంగా. "చాల్లే నోర్మూసుకోవయ్యా! నీ బోడి బెదిరింపులకి జడిసిపోరు ఇక్కడెవ్వరూ. మర్యాదగా నా సూట్ కేస్ నాకిచ్చేయ్!" అంటూ తనూ కళ్ల వెంబడి నిప్పులు కురిపించేడు.

"హోల్డ్ యువర్ టంగ్! ఎవడన్నాడ్రా ఇది నీ సూట్‌కేసని? "

"నేనే అంటున్నాను. అది నా సూట్ కేసే!"

"అల్లాగా? " వ్యంగ్యంగా అంటూ మరోసారి కళ్ల వెంబడి నిప్పులు కురిపించాడు దొరబాబు. "ఇది నీ సూట్ కేసే అయితే ఇందులో ఏమున్నాయో చెప్పగలవా? "

"వైనాట్? చెప్పడం కాదు కావాలంటే లిస్టుకూడా రాసివ్వగలను" భాస్కర్రావ్ కూడా మళ్లీ కళ్ల వెంబడి నిప్పులు కురిపించేడు.

ఇద్దరూ ఒకరిమీద ఒకరు అలా నిప్పులు కురిపించుకుంటూ ఉండటంవల్ల జనం కన్ఫ్యూజైపోసాగారు.

అంతలో జనంలోంచి ఎవరో అన్నారు...

"ఎందుకొచ్చిన గొడవయ్యా ఇది? పోలీసుల్ని పిలవండి. దొంగెవరో దొరెవరో వాళ్లే తేల్చేస్తారు..."

అతనా మాట పూర్తి చేశాడోలేదో, ఎవరూ పిలవకుండానే "ఏం జరిగిందేం జరిగిందంటూ అక్కడికి రానేవచ్చేడు ఓ రైల్వే పోలీసు. అతను వేరెవరో కాదు. దిసేమ్ ఓల్డ్ రైల్వే పోలీసే!

"నువ్వా? " అన్నాడు వచ్చీ రావడంతోనే భాస్కర్రావ్‌కేసి ఆశ్చర్యంగా చూస్తూ.

"మీరా? " భాస్కర్రావ్ కూడా ఆశ్చర్యంగానే అన్నాడు. అలా అంటూండగానే అతని ముఖంలోని ఆశ్చర్యాన్ని సంతోషం డామినేట్ చేసేసింది. తెలిసిన పోలీసే! సో... తనకింక భయమేమీలేదు. "సమయానికి దేవుల్లా వచ్చేరు సార్! చూడండి... ఈ దొంగవెధవ నా సూట్ కేస్ ఎత్తుకుపోతున్నాడు... మొన్నంటే ఏదో తెలివి తక్కువతనంగా వాడిని చూస్తూ చూస్తూ వదిలేశాగాని... ఇవ్వాళ అలాక్కాదు సార్! వీడిచేతిలో నా సూట్ కేస్ కనిపించగానే పట్టేసుకున్నాను" అన్నాడు ఆనందంగా.

రైల్వే పోలీస్‌కి చాలాచాలా డవుట్లొచ్చేసినయ్. అందువల్ల అతని తలగిర్రున తిరిగిపోయింది.

"అసలేం జరిగిందంటేనండీ... ఇవ్వాళ కూడా మళ్లీ దాహంవేసి కోకాకోలా తాగుతుంటే..."

"ఆగు!" భాస్కర్రావ్ ఇంకా మాట పూర్తి చేయకముందే గట్టిగా అరిచాడు రైల్వే పోలీసు. "నా తల తిరిగిపోతోంది. ముందు నన్ను తేరుకోనీ..." అన్నాడు

"సరేలెండి సార్! తేరుకున్నాకే చెప్తా పోనీ..." నమ్రతగా అన్నాడు భాస్కర్రావ్.

"ఏంట్రా నువ్ తేరుకున్నాక చెప్పేది?" దొరబాబు గాండ్రించాడు. "చూడండి సార్! వీడెవడో పిచ్చి వెధవలా ఉన్నాడు. ఈ సూట్ కేస్ తనదంటున్నాడు. మంచీ మర్యాదాలేకుండా నన్ను దొంగంటున్నాడు..."

దొరబాబులాంటి దొంగ తనని ఒరేయ్ గిరేయ్ అనటంతో నషాళం నెత్తికెక్కింది భాస్కర్రావ్‌కి. "మర్యాదగా మాట్లాడ్రా ఇడియట్! నా సూట్ కేస్ కాజేసింది చాలక పైగా తెగ నీలుగుతున్నావ్?... అందులో ఏమున్నాయో చెప్పమన్నావ్‌గా? చెప్తా విను. అయ్యా జనాలూ మీరు కూడా వినండి. రైల్వే పోలీసుగారూ మీరు కూడా వినండి" అన్నాడు తనూ గాండ్రిస్తూ.

"చెప్పు చూద్దాం" ఏమాత్రం తొణక్కుండా ధీమాగా అన్నాడు దొరబాబు.

"ఏంసార్... చెప్పమంటారా?" భాస్కర్రావ్ రైల్వే పోలీసుకేసి చూస్తూ అడిగేడు.

రైల్వే పోలీసుకింకా తలతిరుగుతూనే ఉంది.

అయినా సరే తలూపేశాడు చెప్పమన్నట్టు.

"సరే... చెప్పేస్తున్నా కాసుకో. అది నా సూట్‌కేసే. అందులో నావి నాలుగు జతల బట్టలున్నాయ్. రెండు లుంగీలూ, రెండు డ్రాయర్లు, రెండు బనీన్లూ, నాలుగు కర్చీఫ్‌లూ, రెండు టవల్సూ కూడా ఉన్నాయ్. అవ్వే కాకుండా ఒక షేవింగ్ సెట్టూ, రెండు పెన్నులూ..." భాస్కర్రావ్ చెప్పుకుపోతుంటే...

"ఇంక చాల్లే ఆపు" అన్నాడు దొరబాబు క్రోధంగా చూస్తూ.

"ఏం... ఎందుకాపాలి? నీ బండారం బయటపడిపోతుందని భయపడిపోతున్నావా?" హేళనగా చూశాడు భాస్కర్రావ్.

"నేను సూట్ కేస్ గనుక తెరిచానంటే బయట పడేది నా బండారం కాదు నీ బండారమే!" దొరబాబు కూడా హేళనగానే అన్నాడు.

"అట్లాగా నాయనా! సరే తెరువైతే" చేతులెండూ నడుంమీద పెట్టుకుని నిటారుగా నిలబడ్తూ ధీమాగా అన్నాడు భాస్కర్రావ్.

రైల్వేపోలీసుకి తల తిరగటం కొంచెం తగ్గిందప్పటికి. అంచేత జనాన్ని కాస్త దూరంగా వెళ్ళమన్నట్టు సైగచేస్తూ, "ఊ తెరవండి సార్" అన్నాడు దొరబాబు నుద్దేశించి. అతని కళ్ళక్కూడా దొరబాబు జెంటిల్మేన్‌లానే కనబడుతున్నాడు. అందువల్ల అప్రయత్నంగానే అలా మర్యాదగా అనేశాడు.

దొరబాబు కోటుజేబులోంచి ఓ తాళం చెవుల గుత్తిని బైటికి తీశాడు.

"బాగా చూడండి సార్! ఇందులో వీడు చెప్పిన వాట్లో కనీసం ఒక్క ఐటమ్ కూడా లేదు. అన్నీ మా కంపెనీకి సంబంధించిన డాక్యుమెంట్లే ఉన్నాయ్" అంటూ సూట్ కేస్ ఓపెన్‌చేసి అందరికీ కనిపించేలా ఓ తిప్పు తిప్పాడు.

"స్టుపిడ్" అన్నాడు రైల్వే పోలీస్. దొరబాబుని కాదు భాస్కర్రావుని.

ఎందుకంటే ఆ సూట్ కేస్ నిండా నిజంగానే ఏవేవో కాగితాలున్నాయ్ తప్ప మచ్చుకి ఒక్క గుడ్డముక్కయినా లేదు.

భాస్కర్రావ్ పరిస్థితి దారుణంగా అయిపోయింది. దొరబాబు కొరకొరా చూస్తుంటే మిగతా జనాలంతా అతనికేసి చాలా అసహ్యంగా చూడసాగారు.

అన్ని జతలకళ్ళు తనకేసి అంత తీవ్రంగా అలా చూస్తుంటే భాస్కర్రావ్‌కి సహజంగానే అరికాలినుండి నడినెత్తివరకూ వణుకు పుట్టుకొచ్చేసింది.





"ఏం బాబూ మలేరియా వచ్చిందా?" అతను వణికిపోతూండటం చూసి ఎగతాళిగా అని, ఆ మీదట రైల్వే పోలీస్‌తో అన్నాడు దొరబాబు. "చూశారుగా ఉత్తపుణ్యానికి నా మీద ఎలాంటి అభాండం వేశాడో. వీడిమీద ఏం ఏక్షన్ తీసుకుంటారో చెప్పండి"

"సారీ సర్! జరిగినదానికి అతని తరుపున నేను క్షమాపణ చెప్తున్నాను. డోంట్ థింక్ అదర్ వైజ్!..." అని రైల్వే పోలీస్ ఇంకా ఏదో అనబోతుంటే... "అతని తరుపున మీరెందుకండీ క్షమాపణ చెప్పటం? ఏం అతను మీకు చుట్టమా?" అన్నాడు దొరబాబు ఒకింత కోపంగా.

జనం రైల్వేపోలీసుకేసి ఆసక్తిగా చూశారు, అతనేం చెబుతాడోనని.

దొరబాబు మాటలు రైల్వే పోలీస్‌కి ఒకింత అవమానకరంగా అనిపించినాయి. తమాయించుకున్నాడు స్వతహాగా ఒకింత నెమ్మదస్థుడు కావటంవల్ల.

"మీరు నన్ను అపార్ధం చేస్కుంటున్నారండీ! అతను నాకు చుట్టమేం కాదు. కానీ అతనికి కొంచెం స్క్రూ లూజు. అందుకే అతన్ని పట్టించుకోవద్దంటున్నాను..." అన్నాడు నచ్చజెబుతున్న ధోరణిలో.

"యు మీన్, ఇతనికిపిచ్చా?" ఆశ్చర్యంగా అడిగేడు దొరబాబు. "అనే అనుకోవాలండి మరి! ఎందుకంటే తన సూట్‌కేస్ పోయిందంటూ ఇతనిక్కడిలా గోలచేయటం ఇప్పటికిది రెండోసారి" అన్నాడు రైల్వేపోలీసు భాస్కర్రావ్‌కేసి జాలిగా చూస్తూ. దాంతో ఆటో మేటిగ్గా జనాలందరి కళ్ళూ కూడా జాలితో నిండిపోయాయి.

అందరూ గుచ్చిగుచ్చి చూడసాగేరు భాస్కర్రావ్‌కేసి.

జరిగిపోయిన వింత పరిణామానికి మతిపోయినట్టి పిచ్చి చూపులు చూస్తూ నించుండిపోయిన భాస్కర్రావ్ నిజంగానే పిచ్చివాడిలా కనిపించేడు అందరి కళ్ళకీ.

"పాపం! లేత కుర్రాడే! ఎందుకని పిచ్చెక్కిందో" అనుకున్నారు కొందరు.

"పిచ్చి పలు విధాలంటారు ఇందుకే కాబోలు" అనుకున్నారు ఇంకొందరు.

"ఏదెక్కినా ఫర్వాలేదుగాని పిచ్చిమాత్రం ఎక్కకూడదు. పిచ్చివాడి బతుకు పిచ్చ దుర్భరం" అనుకున్నారు మరికొందరు.

అలా రకరకాలుగా అనుకుంటూ ఒక్కొరొక్కరే మెల్లగా జారుకోసాగారు అక్కడ్నించి.

కానీ దొరబాబు మాత్రం కదల్లేదు. అతనింకా అనుమానంగా చూస్తూనే ఉన్నాడు భాస్కర్రావ్‌కేసి.

"ఏంసార్! ఇతను పిచ్చివాడంటే మీకు నమ్మబుద్ధికావటం లేదా?" అడిగేడు రైల్వే పోలీసు.

"కాపోతే మీరెందుకు చెప్తార్లేగాని, మనిషి ఇంత నీట్‌గా ఉన్నాడు కదా ఇతనికి పిచ్చేమిటా అని కొంచెం అనుమానంగా ఉందంతే"

"దాందేముంది సార్! మనుషుల్లో రకరకాలున్నట్టే పిచ్చివాళ్ళలో కూడా రకరకాలుంటారు. కొందరు పిచ్చివాళ్ళు బట్టలూ అవీ చింపుకుని చాలా అసహ్యంగా వికారంగా ఉంటారు. కొందరేమో కొంచెం నీట్‌గా ఉంటారు. క్రితంసారి ఇతన్ని చూసినప్పుడు నాక్కూడా మీలాగే అనుమానమొచ్చింది. కానీ ఇప్పుడే అర్ధమైంది. ఇతను నీట్‌గా ఉండే పిచ్చివాడని"

"అవున్సార్! నేను నీట్‌గా ఉండే పిచ్చివాడ్ని" తన తరుపున వకాల్తా పుచ్చుకున్నట్టు రైల్వే పోలీస్ అంత కన్విన్సింగ్‌గా చెప్తుంటే తాను కనీసం ఒక్క మాటైనా మాట్లాడకపోతే బావుండదనిపించి అలా అన్నాడు భాస్కర్రావ్. ఎలాగోలా ముందే దొరబాబుని ఇక్కణ్ణించి సాగనంపేస్తే ఆ తర్వాత రైల్వేపోలీసుకి నిదానంగా ఎక్స్‌ప్లనేషన్ ఇచ్చుకోవచ్చని అతని ఆశ. అందుకే కొంత అతి తెలివి ప్రదర్శించాడు.

అతని అతితెలివి సత్ఫలితాన్నే ఇచ్చింది. తనకుతానే అతనిచ్చుకున్న సెల్ఫ్ సర్టిఫికేట్‌కి శాటిస్‌ఫై అయిపోయి, "నోడవుట్... హి ఈజ్ ఎ క్రాక్ మాస్టర్ జనరల్" అని నిర్ధారణ చేసేస్కుని, సరే సార్, నేనింక వెళ్తానైతే" అంటూ చేతిలోని సూట్‌కేస్ నూపుకుంటూ దొరబాబు ఠీవిగా ముందుకు సాగి జనంలో కలిసిపోయాడు.

"హమ్మయ్య! మొత్తానికి నన్ను గండం నుంచి గట్టెక్కించారు! వెరీ మెనీ థాంక్స్ సార్! కానీ ఒక విషయం. నేన్నిజంగా పిచ్చి వాణ్ణి కాదు" దొరబాబు కనుమరుగైపోగానే రైల్వే పోలీసుకేసి కృతజ్ఞత నిండిన కళ్ళతో ఆనందంగా చూస్తూ అన్నాడు భాస్కర్రావ్.

"డోంట్ బ్లఫ్..." కొంచెం కోపంగా అన్నాడు రైల్వే పోలీసు.

"నీలో ఏ మూలనో చిన్నప్పుడు తప్పిపోయిన మా రెండో తమ్ముడి పోలికలుండటంవల్ల నిన్ను సేవ్ చేశాను. లేకపోతే పిచ్చీగిచ్చీ వదిలిపోయేదాకా దంచేవాడ్నే"

"అసలు పిచ్చే లేదంటుంటే అది వొదిలిపోవటం ఏంటండీ బాబూ?" అంటూ ఇంకా ఏదో అనబోయిన భాస్కర్రావ్‌కి సడన్‌గా తన సూట్‌కేస్ గుర్తొచ్చి గుండెలు బాదుకున్నాడు.

"అయ్యబాబోయ్! అసలింతకీ నా సూట్‌కేస్ ఏమైనట్టు?"

"షటప్! మళ్ళీ సూట్‌కేస్ ఊసెత్తేవంటే నాలుక చీరేస్తాను"

"కాదండీ బాబూ! నా సూట్‌కేస్ నిజంగానే పోయింది" అంటూ బొంగరంలా ఓ మారు గిర్రున తిరిగిన భాస్కర్రావ్ దృష్టి కనుచూపు మేరలోనే ఉన్న కూల్‌డ్రింక్స్ షాపుమీద పడింది.

ఆలీవ్ గ్రీన్ కలర్ సూట్‌కేసు...

అరిస్టోక్రాట్ సూట్‌కేసు...

ఆ కూల్‌డ్రింక్స్ షాప్‌ముందు పదిలంగానే ఉంది!

అంతే! భాస్కర్రావ్ హృదయంలో ఆనందం మయూరమై పురివిప్పేసింది!

"నా సూట్‌కేస్ దొరికేసిందోచ్" అంటూ ఎక్కుపెట్టి వదిలిన బాణంలా పరుగుతీశాడు ఆ శీతల పానీయాల దుకాణంకేసి.

ఈ చోద్యమేమిటో చూద్దామనిపించి రైల్వే పోలీస్ కూడా అతన్ని వెన్నంటే వెళ్ళాడు.

భాస్కర్రావ్ ఆలీవ్ గ్రీన్‌కలర్ అరిస్టోక్రాట్ సూట్‌కేస్ని ఆప్యాయంగా గుండెలకు హత్తుకుంటుండగా వెనుకనుండి అతని భుజంమీద చెయ్యివేసిన రైల్వేపోలీసు, "ఐతే నువ్ నిజంగానే పిచ్చివాడివి కాదా?" అన్నాడమితాశ్చర్యంగా.

"కాద్సార్! కాకపోతే ఈసారి బుద్ధి గడ్డితిని నిదానమే ప్రధానమన్న మా తాతగారి సూక్తిని తుంగలో తొక్కి అనవసరంగా తొందరపడి లేనిపోని అనర్థాన్ని కొనితెచ్చుకున్నానంతే!"

ఎక్కడా కామాలూ గట్రా లేకుండా అతగాడా వాక్యాన్ని అంత అనర్గళంగా చెప్తుంటే రైల్వే పోలీస్‌కి అనుమానం తీరిపోయింది.

పిచ్చివాళ్ళు ఇంత అనర్గళంగా మాట్లాడలేరుకదా? కాబట్టి ఇతను నిస్సందేహంగా మంచివాడే అన్నమాట! అనుకున్నాడు ఆనందంగా.

ఎంతయినా తప్పిపోయిన తమ్ముడి పోలికలున్న వాడాయె. అతనికి పిచ్చిలేనందుకు ఆనందంగా అన్పించదూ మరి?

"అయితే మొన్న కూడా నీ సూట్‌కేస్ పోయిన మాట నిజమేనా?" అడిగాడు ఆనందం ఒకింత సద్దుమణిగాక.

"అవున్సార్! ఆ రోజేమో నిజంగానే పోయింది. ఈరోజేమో కంగారుపడిపోయి పోయిందేమో అనుకున్నాను! ఏది ఏమైనా ఇవ్వాళ మీరు సమయానికి దేవుళ్ళా అడ్డుపడి సర్దిచెప్పడంవల్ల నేను చాలా పెద్ద ఆపదనుండి గట్టెక్కగలిగేను. లేకుంటే నా పరిస్థితేమయ్యుండేదో" అంటూ కృతజ్ఞతను వ్యక్తంచేశాడు భాస్కర్రావ్.




'చిత్రమైన మనిషి!' అనుకున్నాడు రైల్వే పోలీసు.

"ఒకరకంగా ఇదీ మంచికే జరిగింది లెండి సార్! నిదానమే ప్రధానమన్న జీవన సూత్రాన్ని విస్మరిస్తే ఎలాంటి అనర్థాలెదుర వుతాయో ఇవ్వాళ నాకు బాగా అర్థమైంది! నాకిపుడు బాగా బుద్ధొచ్చింది. ఇకపై అటు సూర్యుడిటు పొడిచినా సరే మా తాతయ్య కిచ్చిన మాట మీరను..."

"మంచిది..." అన్నాడు రైల్వే పోలీసు పొడిగా.

రైల్వే పోలీసుతో చెప్పడమే కాకుండా, మనసులో కూడా అలాగే అనుకున్నాడు భాస్కర్రావ్. తాతయ్యగారి రూపాన్ని మనోఫలకంపై దర్శించుకుంటూ... "నన్ను క్షమించు తాతయ్యా! ఆ గోకారిగాడి మాటలు నెత్తికెక్కించుకొని ఇవ్వాళ నీకిచ్చిన మాట తప్పేశాను. ఇదే ప్రథమ మరియు ఆఖరి తప్పిదంగా భావించి నన్ను మన్నించు. ఇకపై నా మరణపర్యంతం సర్వకాల సకలావస్థలయందూ నిదానమే ప్రధానమన్న సూత్రాన్ని పాటిస్తూనే ఉంటాను" అని మనస్సులోనే పునః ప్రమాణం కూడా చేసేశాడు.

"అన్నట్టు మాటల్లో పడి మర్చేపో యాను... మీరు నాకు చేసిన సహాయానికి ప్రతిగా కనీసం ఓ కూల్‌డ్రింకైనా ఆఫర్ చేయడం నా కనీస ధర్మం కదా!"

"ఏం తీస్కుంటారు? కోకోకోలానా, థమ్సప్పా?"

"అబ్బే ఏమీ వద్దులే..." భాస్కర్రావ్ ఆఫ ర్‌ని తిరస్కరిస్తూ మొహమాటంగా అన్నాడు రైల్వే పోలీసు.

"భలే వార్సార్! ఒకపక్క ఎండ దంచే స్తొంటే కూల్‌డ్రింక్ వొద్దంటారేంటి? మా తాతయ్యెప్పుడూ చెబుతుండేవాడు... తినే దగ్గరా తాగే దగ్గరా మొహమాటం ఉండ కూడదని..." అంటూ ఆప్షన్ సంగతి గాలి కొదిలేసి "రెండు కోకోకోలా ఇవ్వండి" అని షాపువాడ్ని అడిగి తీసుకుని రైల్వేపోలీస్‌చే తిలో ఓ బాటిల్‌ని బలవంతంగా పెట్టేశాడు భాస్కర్రావ్.

కోకోకోలాలు తాగటం అయ్యాక రైల్వే పోలీసు భాస్కర్రావ్‌ని మాటల్లోపెట్టి అతన్ని గురించి పూర్తి వివరాలడిగి తెలుసు కున్నాడు.

"అయితే ఉద్యోగం కోసం హైదరాబాద్ వెళ్తున్నావన్నమాట! మంచిది. కానీ అక్కడ నువ్ చాలా జాగ్రత్తగా ఉండాలి. ముఖ్యంగా ఇలా అమాయకంగా ఉండకూ డదు. డేరింగ్‌గా ఉండటం నేర్చుకో..." భాతృ వాత్సల్యంలాంటిదేదో ముంచుకురాగా సలహా ఇచ్చాడు.

అంతలోనే ఏదో గుర్తుకొచ్చిన వాడిలా తల పంకించి, "అన్నట్టు హైదరాబాద్‌లో మా పెదనాన్నగారబ్బాయ్ ఒకాయనున్నాడు ఆర్టీసీలో కండక్టరు. పేరు వరహాల్రాజు. నీకు సిటీ కొత్తకాబట్టి అక్కడ నీకు తను కొంత గైడెన్స్ ఇవ్వగలడనుకుంటా. ఎందు కయినా మంచిది అడ్రెస్ రాసిస్తాను ఉంచు"

అంటూ సమీపంలో నేల మీద పడున్న ఓ ఖాళీ సిగరెట్ పెట్టె నందుకుని దాన్ని చించి ఆ అట్టమీద వరహాల్రాజు చిరునామా రాసి, దాన్ని చొరవగా భాస్కర్రావ్ జేబులో తనే పెట్టేశాడు.

"ఉత్తర మేదయినా రాసిస్తారా?" అడి గాడు భాస్కర్రావ్.

"ఎందుకులే... నా పేరు చెప్పు చాలు" అనేశాడు రైల్వేపోలీసు. అతను తనమీద చూపుతున్న అభిమానానికి మనసులో చాలా సంతోషంగా అనిపించింది భాస్కర్రా వ్‌కి.

మళ్ళీ ఎప్పుడైనా తను హైదరాబాద్ నుండి పెడన వస్తాడుగా. అప్పుడీయనకే దన్నా మంచి గిఫ్ట్ తెచ్చివ్వాలి! అనుకు



న్నాడు మనస్ఫూర్తిగా.



రైస్‌మిల్లర్ కోటేశ్వర్రావ్‌గారు చెప్పినట్టే నాంపల్లిలో కాకుండా సికింద్రాబాద్ స్టేషన్ లోనే దిగిపోయాడు భాస్కర్రావు.

ట్రైన్‌లోంచి కాలు కింద పెట్టడంతోనే ఓమారు చుట్టూతా చూశాడు.

విజయవాడ స్టేషన్‌తో పోలిస్తే చాలా చిన్నదే!

జనంకూడా అక్కడితో పోలిస్తే చాలా తక్కువమందే ఉన్నారు.

"తాతయ్యా నన్నాశీర్వదించు. నా జీవితంలో ఓ కొత్త అధ్యాయం ప్రారంభం కాబోతోంది. నన్నో ఉద్యోగస్థుడిగా చూడాలనుకున్న నువ్వు అప్పటివరకూ ఆక్కుండా నా చదువు పూర్తయిన వెంటనే నన్ను వంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయావు. నీ కోరిక నెరవేరి ఆత్మకు తృప్తి కలిగించాలని ఉద్యోగాన్వేషినై నేనీ కొత్త ప్రదేశానికొచ్చాను. నాకిక్కడ ఏ కష్టాలూ కలక్కుండా పైనుండి ఆశీర్వదిస్తూ ఉండు. ఎంతవరకు నిజమో నాకైతే తెలియదుగాని అందరూ నన్ను అమాయకుడంటారు. నువ్వూ అలాగే అనేవాడివి. కాబట్టి నాకు మంచి తెలివి కలిగేలా కూడా నన్నాశీర్వదించు..." మనసులో తాతయ్యను స్మరించుకుంటూ మనసులోనే ఆయనకు దండం పెట్టుకుని...

స్టేషన్‌లోంచి బయటికొచ్చాడు.

"సార్ ఆటో..."

"ఆటో కావాలా సార్?"

"ఆటో సార్... ఆటో..."

"పదండి సార్... ఎక్కడికి పోవాలి..."

ఓ డజనుమంది ఆటోవాలాలు ఒక్కసారిగా చుట్టుముట్టేసి కర్ణభేరులు పగిలిపోయేలా కాకిగోల ప్రారంభించడంతో కన్ఫ్యూజైపోయి... ఎవడో ఒకడి ఆటోలో ఎక్కి కూర్చుండిపోదామా అనుకున్నాడు.

కాని అంతలోనే మనసు మార్చేసుకున్నాడు.

అందుక్కారణం..."తొందరపడకు. నిదానమే ప్రధానం! నిదానమే ప్రధానం!" అని అంతరాత్మ ఘోషించటం.

ఆ అంతరాత్మ కూడా మామూలుగా కాదు, తాతయ్య కంఠస్వరంతో ఘోషించడం వల్ల "తాతయ్యా! ఇంకెప్పుడూ తొందరపడ్ను. నీ సూత్రాన్ని ఎల్లవేళలా పాటిస్తాను" అని మనసులో తాతయ్యకు మరోమారు హామీ ఇచ్చి.. "అవసరంలేదు. వెళ్ళండయ్యా" అంటూ అతికష్టమ్మీద వాళ్ళందర్నీ వొదిలించుకుని ఎలా గోలా ఆ ఆటోవాలాల పద్మవ్యూహంనుండి బయటపడ్డాడు.

ఆటోస్టాండ్‌ని దాటి ఇవతలికి రాగానే బోల్డన్ని సిటీబస్సులు కనిపించినై. అందులో ఓ రెండు మూడు డబల్‌డెక్కర్‌లు కూడా ఉన్నై.

సిటీకి కొత్త కావడంవల్ల ఆ వాతావరణం చాలా గమ్మత్తుగా, గందరగోళంగా, గజిబిజిగా అనిపించింది భాస్కర్రావ్‌కి. ఆడా మగా చిన్నా పెద్దా అన్న తేడా లేకుండా ఎవరిమట్టుకు వాళ్లు హడావుడిగా ఉరుకులూ పరుగులూ తీస్తున్నారు.

అందరూ బిజియేనా? ఒక్కరైనా ప్రశాంతంగా ఉన్నట్టు కన్పించరేం? ఏంటో... ఈ సిటీలైఫ్ ఇంతే. అనుకున్నాడు, అప్పటికే తనకేదో సిటీ గురించి చాలా చాలా తెలిసిపోయినట్టు.





ముఖ్యంగా జనం ఒకర్నొకరు నెట్టేసుకుంటూ కుమ్ముకుంటూ ఒక పద్ధతీ పాడూ లేకుండా సిటీబస్సుల్లో కెక్కుతున్న తీరు అతనికి చాలా అసహ్యంగా అనిపించింది.

పెడననుండి బందరుకి టౌన్‌బస్‌లున్నై. కానీ అక్కడిలా కుమ్ముకుంటూ ఎక్కరెవ్వరూ.

ఏం ముంచుకుపోయిందని అలా కుమ్ముకోవడం? క్యూ పద్ధతి పాటిస్తూ నిదానంగా ఒకరి వెనుక ఒకరు ఎక్కొచ్చుగా? అనుకున్నాడు ఏవగింపుగా. కొంతసేపు పోయాక తనూ అంతేనన్న సంగతి ఆ క్షణంలో అతనికి తెలియదుగా మరి. అన్నట్టు తనెక్కడి కెళ్ళాలిప్పుడు?

ముందుగా ఏదన్నా లాడ్జ్‌లో రూమ్ తీసుకోవడం మంచిదా? లేక నేరుగా కోటేశ్వర్రావ్‌గారిచ్చిన అడ్రెస్ ప్రకారం ఆ జగదీష్‌గార్ని వెతుక్కుంటూ వెళ్ళటం మంచిదా?

ఆలోచిస్తూ జేబులోంచి కోటేశ్వర్రావ్‌గారిచ్చిన లెటర్ని బైటికి తీశాడు. అప్పటికే కంఠస్తం వచ్చేసినా కూడా జగదీష్ ప్రసాద్ గారి అడ్రెస్‌ని మరోమారు పరిశీలించాడు.

వారాశిగూడ...

'అదెక్కడుందో? ఏ బస్సెక్కాలో?' అనుకోబోయి అంతలోనే మానేశాడు. ఎందుకంటే ఆ అవసరం అతనికి లేదు. కోటేశ్వర్రావ్‌గారు పెడనలోనే చెప్పారు. స్టేషన్ నుండి ఎయిటీసిక్స్ నెంబర్ బస్సెదెక్కినా వారాశిగూడలో దిగొచ్చని. మర్చిపోకుండా ఉండేందుకు తనానంబర్ని పాకెట్ నోట్ బుక్‌లో నోట్ చేస్కున్నాడు కూడా.

'ఎయిటీసిక్సే' అని గుర్తున్నా కూడా ఎందుకన్నా మంచిదని జేబులోంచి ఆ పాకెట్ నోట్ బుక్‌ని కూడా బైటికి తీసి ఎయిటీసిక్సేనని కన్‌ఫర్మ్ చేసుకుని మళ్ళీ దాన్ని జేబులో పెట్టేసుకున్నాడు. దాంతో పాటే కోటేశ్వర్రావ్‌గారిచ్చిన ఉత్తరాన్ని కూడా పెట్టేసుకున్నాడు.

ఆ తర్వాత జనంలో కాస్త మంచివాడిలా కన్పిస్తున్న ఓ వ్యక్తిని సెలక్ట్ చేసుకుని అతన్నడిగేడు, "ఎయిటీ సిక్స్ నెంబర్ బస్సెక్కడాగుతుంది సార్?"

"మీరెక్కడి కెళ్ళాలి?" సహజంగానే ఎదురుప్రశ్న వేశాడా వ్యక్తి.

"వారాశిగూడ..."

అయితే మీరు చెప్పిన నెంబర్ కరెక్టే" అన్నట్టు తలపంకించి "ఎయిటీసిక్స్ ఇక్కడ కాదండీ... అదుగో అలా కొంచెం దూరం వెళ్తే అక్కడింకో పెద్ద బస్టేషనుంటుంది..." అంటూ ఎటువెళ్ళాలో చేత్తో చూపించాడా వ్యక్తి. అతను మంచివాడిలా కన్పించడమే కాదు, నిజంగా కూడా మంచివాడేనన్న మాట.

"థాంక్సండీ" అని అతనికి కృతజ్ఞత తెలిపి, అతను పంపించిన దిక్కు నడకసాగించాడు భాస్కర్రావ్.

అటుపిమ్మట...

ఎయిటీసిక్స్ బస్సులాగే బస్టాప్‌ను కనుక్కోవడం అతనికి పెద్ద కష్టమేం లేదుగాని, 'నిదానమే ప్రధానం' అన్న సూక్తిని పాటిస్తూ కూర్చోవడంవల్ల, కళ్ళముందే నాలుగైదు బస్సులొచ్చి వెళ్ళిపోయినా కూడా అతను బస్సులో ఎక్కలేకపోయాడు.

బస్సొచ్చి ఆగటం ఆలస్యం దిగేవాళ్లింకా దిగకుండానే ఎక్కేవాళ్లు వాళ్ళని నెట్టేసుకుంటూ ఎక్కిపోతున్నారు. చూస్తుండగానే బస్ నిండిపోవడం కదిలి వెళ్ళిపోవడం.

అలా అయిదారు బస్సుల్ని పోగొట్టుకున్నాక గంటన్నర సమయాన్ని వృధా చేసుకున్నాక జ్ఞానోదయం లాంటిదయ్యింది భాస్కర్రావ్‌కి.

నిదానమే ప్రధానమన్న సూక్తి జంటనగరాల సిటీ బస్సుల విషయంలో సత్ఫలితాన్నివ్వదుగాక ఇవ్వదు.

నిదానంగా జనం తక్కువగా ఉన్నప్పుడెక్కొచ్చులే అనుకుంటే తానింక జీవితాంతం ఇక్కడే ఉండిపోవాల్సి రావడం గ్యారంటీ.



"సారీ తాతయ్యా! సిటీబస్సుల విషయంలో నేన్నీసూత్రాన్ని పాటించలేను. ఈ ఒక్క విషయంలో తప్ప మిగతా అన్ని విషయాల్లోనూ పాటిస్తాను"- తాతయ్యకిచ్చిన మాటకి మనసులో అమెండ్‌మెంట్ చేసుకున్నాడు జ్ఞానోదయం అయ్యాక.

అంతలో మరో ఎయిటీసిక్స్ నెంబర్ బస్సొచ్చాగింది. అంతే! భాస్కర్రావ్ క్షణంలో వెయ్యోవంతుని కూడా వృధా చేయలేదు. చేతిలో సూట్‌కేస్‌తోసహా యమ స్పీడ్‌గా బస్‌కేసి పరుగుతీసి కుమ్ములాడుకుంటున్న జనంలో తను కూడా చేరిపోయి తాతయ్య చిన్నప్పుడు గడ్డ పెరుగుతో తినిపించిన గోరుముద్దలవల్ల చేకూరిన బలాన్నంతా ప్రదర్శిస్తూ దిగ్విజయంగా బస్సెక్కిపోయాడు. అదృష్టవశాత్తూ అతనికి సీటు కూడా దొరికింది.

దాంతో విజయగర్వంలాంటిదేదో కలిగి నుదుటమీదపడ్డ జుట్టు వెనక్కి వెళ్ళేలా ఓమారు తలెగరేసి, "తప్పులేదు సిటీబస్సెక్కడానికి కుమ్ముకున్నా తప్పులేదు. తన్నుకున్నా తప్పులేదు" అనుకున్నాడు మనసులో.

★ ★ ★

వారాశిగూడలో బస్‌దిగి ముందుగా ఓ హోటల్లో దూరి ఓ కప్పు టీ తాగాడు భాస్కర్రావ్. కాదు 'చాయ్' తాగేడు.

తర్వాత హోటల్లోంచి బయటకొచ్చి ఓ కిళ్లీ కొట్టు దగ్గరికెళ్ళి, కాదు పాన్‌షాప్ దగ్గరికెళ్ళి- "ఈ అడ్రెసెక్కడో కాస్త చెప్తారా?" అనడిగేడు షాపువాణ్ణి.

మనుషులందరూ మంచివాళ్ళే ఉండరు కదా?

ఆ షాపతను 'నాకింక వేరేపనేం లేదనుకున్నావా?' అన్నట్టు చాలా కోపంగా చూశాడు భాస్కర్రావ్‌కేసి. "ఏమోబే! నాకు తెల్వాదు" కోపంగా చెప్పాడు.

"కొంచెం మంచిగా కొంచెం మర్యాదగా కొంచెం నిదానంగా చెప్పొచ్చుకదా? మీద పడి కొట్టేవాడిలా ఎందుకంత కరుగ్గా చెప్పటం?"

ముఖం చిన్నబుచ్చుకుంటూ అక్కణ్ణించి ముందుక్కదిలిన భాస్కర్రావ్ కనిపించిన వాళ్ళందర్నీ అడుగుతూపోయాడు "ఈ అడ్రెసెక్కడండీ?" అంటూ.

చాలామంది తెలీదన్నట్టు పెదవి విరిచేశారు. ఒకరిద్దరు "ఈ గల్లీలో ఉండొచ్చు బహుషా... ఆ గల్లీలో ఉండొచ్చు బహుశా" అంటూ రాంగ్‌గైడెన్స్ ఇచ్చేరు.

మొత్తానికి ఎలాగైతేనేం గల్లీలన్నీ తిరిగి తిరిగి ఎట్టకేలకు చిట్టచివరికి పట్టుకున్నాడు భాస్కర్రావ్ జగదీష్‌గారి ఇంటిని.

ఇల్లంటే ఏదో ఆషామాషీ ఇల్లు కాదది. చాలా పెద్ద బిల్డింగే! 'బయట కుక్క ఉన్నది జాగ్రత్త' అనే బోర్డుండటంవల్ల తొందరపడి గేటు తీసుకుని లోపలికి వెళ్ళిపోకుండా కాలింగ్‌బెల్ మోగించాడు భాస్కర్రావ్.

"ఎవరూ?" అంటూ వచ్చిందో నడివయస్కురాలు. ఆమె వెనకాలే కొంపలంటుకుపోయినట్టు తిరగబడి మొరిగేస్తూ ఓ పెద్ద సైజు కుక్క కూడా వచ్చింది.

'అబ్బ! ఎంత భయంకరంగా ఉందో' అనుకున్నాడు భాస్కర్రావ్. మొదలే అతనికి కుక్కలంటే మా చెడ్డ భయం. పైగా ఇది చాలా పెద్ద సైజుకుక్కాయె. అందువల్ల "ఇంత భయంకరమైన కుక్కల్ని ఎందుకు పెంచుతారో? బుద్ధీ జ్ఞానం ఉండదు కాబోలు" అని కూడా అనుకున్నాడు.

"ఎవరు కావాలి?"

"కుక్క..." అన్నాడు భాస్కర్రావ్ భయంగా.

"ఆ కుక్కని మేం అమ్మం. మావారు ముచ్చటపడి బెంగుళూరునుంచి తెచ్చారు" అంది నడివయస్కురాలు.

"అంటే నా ఉద్దేశం కుక్క కావాలని కాదండీ. దాన్ని చూస్తోంటే నాకు భయమేస్తోంది. కరుస్తుందా?" అన్నాడు భాస్క




గ్రాఫ్ మళ్ళీ భయంగానే.

"నేను కరవొద్దంటే కరవదు. కరవమంటే కరుసుద్ది. ఇంతకీ మీకెవరు కావాలి?" కుక్కకేసి ఆప్యాయంగా చూస్తూ అంది నడి వయస్కురాలు.

'వెల్ ట్రెయిన్డ్ డాగ్ అన్నమాట' అనుకున్నాడు భాస్కర్రావ్.

"అయితే కరవొద్దని చెప్పండి..." అన్నాడింకా భయంగానే.

"అది నేను చెప్పేదాకా కరవదులేగాని మీకేం కావాలి? ఎవరు కావాలి?" నడివయస్కురాలు గేటు కవతల్నుండే భాస్కర్రావ్‌కేసి ఎగాదిగా చూస్తూ అడిగింది. సిటీలో అడ్డమైనవీ పట్టుకుని సేల్స్ రెప్రజెంటేటివ్స్ వస్తూంటారు. డోర్ టు డోర్ కాంపైన్ అంటూ, కొనకపోయినా ఫర్వాలేదు ఓసారి చూడండంటూ విసిగిస్తుంటారు. ఇతను కూడా ఆ బాపతేమోనన్న అనుమానంతో అలా చూసిందావిడ. గతంలో ఒకడిలాగే రోజూ వొచ్చి వాక్యూమ్‌క్లీనర్ కొనమని విసిగిస్తుంటే అతన్ని కుక్కతో కరిపించిందామె.

"మాది పెడనండీ! నన్ను కోటేశ్వరరావుగారు పంపించారు. జగదీష్‌గారిల్లిదేకదా?" శునకాందోళన్ను కాస్త పక్కకినెడ్తూ అసలు సంగతి చెప్పాడు భాస్కర్రావ్.

"ఏంటి బావగారు పంపించారా? మరా సంగతి ముందే చెప్పొచ్చుగా? రండి..." అంటూ గేటు తీసిందావిడ.

"కుక్క..." అన్నాడు భాస్కర్రావ్ మళ్ళీ శునకాందోళనకు లోనవుతూ.

"కరవదు... ఏయ్ టైగర్ నువ్వు లోపలికెళ్లు" చెప్పిందావిడ. టైగర్ 'అలాగే' అన్నట్టు తలూపి లోపలికెళ్ళిపోయింది. నరభాష అర్థమయ్యే కుక్క. ఇట్సేగుడ్ డాగ్! అనుకున్నాడు భాస్కర్రావ్.

తర్వాత ఆ నడివయస్కురాలు దారి చూపుతుండగా ఆమెననుసరించి వాళ్ల హాల్లోకి వెళ్ళి ఆమె చూపించిన సోఫాలో కూర్చున్నాడు.

"ఊఁ ఇప్పుడు చెప్పండి. మీరెవరు? మా బావగారు మీకెలా తెలుసు? మిమ్మల్నెందుకు పంపించారు?" తనూ ఓ కుర్చీలో కూర్చుంటూ ప్రశ్నలవర్షం కురిపించింది నడివయస్కురాలు. అంతలోనే పనిపిల్లను పిలిచి మంచినీళ్లు తెమ్మని పురమాయించింది.

"నా పేరు భాస్కర్రావండీ. బాచీ అంటారంతా. కోటేశ్వర్రావుగారు మా తాతయ్య రామజోగయ్యగారికి స్నేహితులు... ఇవన్నీ చెప్పటంకన్నా ఇదుగోండి ఈ ఉత్తరం చదవండి. విషయం మీకే తెలుస్తుంది" అంటూ జేబులోంచి కోటేశ్వరరావుగారి ఉత్తరాన్ని తీసి ఆమెకందించాడు భాస్కర్రావ్.

ఆమె ఆ ఉత్తరాన్ని చదువుతుండగా పనిపిల్ల ఫ్రిజ్‌లోంచి చల్లటినీళ్లు తెచ్చి అతనికందించింది. తాగి సేదదీరి ఆ మీదట నడివయస్కురాలికేసి చూశాడు భాస్కర్రావ్.

ఉత్తరం చదవటం ముగించి అన్నదావిడ. "సరే మంచిదబ్బాయ్! నువ్వో నాల్రోజులాగి మళ్ళీ కన్పించు" కుర్రాడేకదా అని కాబోలు ఏకవచనంలోకి మారిపోయింది.

"జగదీష్‌గారు..."

"ఊళ్ళో లేరు. నాల్రోజుల తర్వాతొస్తారు. కొంచెం ఆలస్యం కూడా కావచ్చు ఎందుకయినా మంచిది. నీకు మళ్ళీ మళ్ళీ తిప్పటెందుకులేగాని పోనీ ఓ వారం తర్వాతే కన్పించు"

నీరుగారిపోయాడు భాస్కర్రావ్. నీరసం ముంచుకొచ్చేసినట్టనిపించింది. 'ఎక్కడి కెళ్ళేరండీ?' అనగడబోయి మానేశాడు అధిక ప్రసంగం అవుతుందేమోనని.

"ఫర్వాలేదులెండి. నాల్రోజులతర్వాత మళ్లీ ఓసారొచ్చి చూస్తాను" అన్నాడు నీరసంగా.

"ఎందుకులే అబ్బాయ్! ఆయన నిన్నే వెళ్ళారు. రావటం రెండ్రోజులటూ ఇటూ



కావచ్చుగదా? అన్నట్టు మా బావగారు నీ బాగోగులన్నీ చూసుకోమని రాశార్లేగాని, అవన్నీ ఆయనొచ్చేకే. అసలే నువ్ కొత్త మనిషివి. ఆయన లేకుండా నేనేం చేయలేనుగదా? "

ఆవిడలా అంటుంటే ఆ మాటలు సబబుగానే అనిపించినై భాస్కర్రావ్‌కి.

ఆవిడ జగదీష్‌గారి భార్యని చెప్పకనే తెలుస్తోంది. నిజమేకదా? భర్త ఊళ్లో లేనప్పుడు ఆవిడంతకన్నా ఏం చేయగలుగుతుంది?

"ఫర్వాలేదులెండి... మీరు చెప్పినట్టు వారం తర్వాతే వస్తాలెండి పోనీ" అంటూ లేచి నిలబడ్డాడు.

అప్పుడు పడింది అతని దృష్టి ఎదురుగా గోడకున్న ఫొటోమీద.

చాలా పెద్ద ఫొటో అది.

అంచేత ఆ ఫొటోలోని వ్యక్తి చాలా స్పష్టంగానే కన్పిస్తున్నాడు.

అయినాసరే ఓమారు కళ్లు నులుముకొని మరోసారి చూశాడు.

"ఆయన... ఆయన... ఆయనెవరండీ? "
అడుగుతుంటే కంఠం కంపించింది.

"నువ్వెవరికోసం వచ్చావో ఆయనే ఆయన! అంటే మావారు" రవంత చమత్కారంగా చెప్పిందామె. క్లోజ్... అయిపోయింది. ఈ చాప్టర్ ఇంతటితో ముగిసిపోయింది అనుకున్నాడు భాస్కర్రావ్.

'హే భగవాన్! ఏమిటీ అగ్నిపరీక్ష? ' అనైతే అనుకోలేదుగాని ముఖం మాత్రం అనుకున్నట్టుగానే మారిపోయింది.

"వస్తానండీ!" అని కదలబోయి ఆగిపోయాడు.

"మంచిది వెళ్లిరా" అని 'ఎందుకాగిపోయేవ్? ' అన్నట్టుగా చూసిందామె.

"కుక్క... "

"ఫర్వాలేదు. నేను చెప్పందే అదెవర్నీ కర




వదు..."

"మంచి కుక్క! నరభాష తెలిసిన కుక్క!" భయం మర్చిపోవడానికి మనసులో అలా అనుకుంటూ బైటికి దారితీసిన భాస్కర్రావ్, బై దిగ్రేసాఫ్‌డాగ్, సురక్షితంగానే బయటపడ్డాడు ఆ ఇంట్లోంచి.

"మళ్లీ వారం తర్వాత వస్తావుగా?" వరండా మీదనుంచే గట్టిగా అడిగిందావిడ.

"రాను" అని తెగేసినట్టు చెప్పి వడివడిగా ముందుకు సాగిపోయాడు భాస్కర్రావ్.

నడివయస్కురాలు నిర్ఘాంతపోయింది.

'ఇదేంటీ కుర్రాడిగ్గాని పిచ్చా?' అనుకుంది మనసులో.

★ ★ ★

మళ్లీ వారాసిగూడ బస్టాప్‌కొచ్చి నిలబడ్డాక భాస్కర్రావ్ అంతరాత్మ అతన్ని గద్దించటం ప్రారంభించింది...

"నీకు బుద్ధిలేదు. ఇప్పటికిప్పుడే మీ తాతగారికిచ్చిన మాట మర్చిపోయి మళ్లీ తొందరపడిపోయేవ్.."

"నేనా? తొందరపడ్డానా? ఎప్పుడూ?" ప్రశ్నించేడు భాస్కర్రావ్ అంతరాత్మని.

"ఇప్పుడే ఆ జగదీష్‌గారి భార్య మళ్లీ వారం తర్వాత వస్తావ్‌గా? అనడిగినప్పుడు ఠకీమని "రాను" అని చెప్పేశావ్. అది తొందపాటు కాదూ?"

"అది తొందరపాటెలా అవుతుంది? నేనెలాగూ ఇంక మళ్లీ వాళ్లింటికెళ్లేది లేదుకదా? అందుకని ఉన్నమాటే చెప్పేను"

"అదే తొందరపాటంటే! నిదానమే ప్రధానమన్న సూక్తిని గుర్తుంచుకొని నువ్ కాస్త నిదానంగా ఆలోచించి ఉంటే నీకో విషయం తట్టి ఉండేది..."

"ఏమిటా విషయం?"

"ఈ ప్రపంచంలో మనిషిని పోలిన మనుషులుండటం అసంభవమేమీ కాదన్న విషయం"

"చాల్లే బోడి తెలివి తేటలు! మనిషిని పోలిన మనుషులుండటం సంభవమే కావొచ్చుగాని అచ్చుగుద్దినట్టు ఒకేలా ఉండటం అసాధ్యం. అదిన్నూ ముక్కు మీద పుట్టుమచ్చతో సహా"

"ముక్కు మీద పుట్టు మచ్చా? "

"అవును ఫొటోలోని జగదీష్ ప్రసాద్‌గారి ముక్కుమీద పుట్టుమచ్చ ఉంది. విజయవాడ రైల్వేస్టేషన్‌లో ఆ దొరబాబు ముక్కు మీద కూడా అచ్చం అలాంటి పుట్టుమచ్చే ఉంది. కాబట్టి వాళ్లిద్దరూ ఒకేలా ఉండటం కోయిన్స్‌డెన్స్ కాదు. నిర్వివాదంగా ఇద్దరూ ఒక్కరే"

"అంతేనంటావా? "

"ముమ్మాటికీ అంతే! ఇందులో నేను పొరబడి ఉండటానికి స్కోపేలేదు. వాళ్లిద్దరూ ఒక్కరే అయినప్పుడు నేను మళ్లీ వాళ్లింటికి ఏ ముఖం పెట్టుకుని వెళ్లగలను? "

"అవును వెళ్లలేవు" ఒప్పుకుంది అంతరాత్మ.

"మరందుకే నేనలా చెప్పా! కాబట్టి నువ్వింక నీతులు బోధించటం మానేసి నోర్మూస్కో..." అని కోప్పడ్డాడు భాస్కర్రావ్. దాంతో అంతరాత్మ నోరు మూసేసుకుంది.

అప్పుడు భాస్కర్రావ్ మళ్లీ ఆలోచనలోపడ్డాడు... ఒక ఆశాదీపం ఆరిపోయింది.

ఒక మహత్తరావకాశం మూసుకుపోయింది.

వారం తర్వాత జగదీష్‌గారు ఊర్నుండి తిరిగొచ్చినా, భార్య చేతిలో ఉన్న తోడల్లుడి ఉత్తరాన్ని చదువుకున్నా, తగుదునమ్మా అంటూ తను గనుక వెళ్తే సహాయం చెయ్యడు సరిగదా తాట వొలుస్తాడు.

అవునుమరి! విజయవాడ స్టేషన్‌లో ఆయన్ని తను అవమానించిన విధానం సామాన్యమైందా? ఈ జన్మంతటికీ గుర్తుండిపోయేలా అవమానించేశాడాయె!

ఆ అవమానాన్ని మర్చిపోయి ఆయన తననెలా క్షమించగలుగుతాడు?

నర జన్మెత్తిన వాళ్లెవ్వరికీ అంతటి క్షమా గుణం ఉండదు. సో ఆ అధ్యాయం ముగిసిపోయినట్టే. కిం కర్తవ్యం?

భాస్కర్రావ్ మనసులో చప్పున రైల్వే పోలీసు మెదిలాడు. భగవంతుడు దయామయుడు. అందుకే తనకింకో ఆధారం చూపాడు.

ఇలా జరుగుతుందని భగవంతుడికి ముందే తెలుసా? ఏమోలేగాని మొత్తానికయితే తనకింకో ఆధారముంది. వెంటనే జేబులోంచి పాకెట్ నోట్‌బుక్‌ని బైటికి తీసి అందులో పదిలంగా ఉన్న సిగరెట్ ప్యాకెట్ అట్టని ఇవతలికి లాగి రైల్వే పోలీసుగారి పెదనాన్నగారి అబ్బాయిగారి అడ్రెస్ నోమారు పరిశీలించాడు.

వరహాల్రాజు... బస్ కండక్టర్... జీడిమెట్ల డిపో. క్రింద ఇంటి అడ్రస్ కూడా ఉంది.

సనత్‌నగర్...

అదెక్కడుందో ఏం పాడో. ఇక్కణ్ణుంచి అక్కడికి డైరెక్ట్‌గా బస్‌లున్నాయోలేదో? నగరానికి కొత్త కావటంవల్ల అంత చిన్న విషయానికి ఎంతో ఆందోళనగా అనిపించింది భాస్కర్రావ్‌కి. ఆ సమయంలో తన నోట్లో ఓ నాలుకుందన్న సంగతి అతనికి గుర్తుకు రాలేదు. ఏం చేయడమబ్బా? అనుకొని వర్రీ అయిపోయాడు.

అంతలోనే నిదానమే ప్రధానమన్న సూత్రాన్నోమారు గుర్తుకు తెచ్చుకుని కంగారు పడటం కాస్త తగ్గించి కొంచెం నిదానంగా ఆలోచించాడు.

అప్పుడు గుర్తొచ్చింది అతనికి తన నోట్లో ఓ నాలుకుందన్న సంగతి. దాంతో తన పక్కనే ఉన్న వ్యక్తినడిగేడు.

"సార్! సనత్‌నగర్ పోవాలంటే ఎలా? "

"ముందు సికింద్రాబాద్ స్టేషన్‌కెళ్లండి. అక్కణ్ణుంచి టెన్నెంబర్ బస్సులు చాలా





ఉంటాయ్! దాదాపు ఏ టెన్నెక్కినా మీరు సనత్‌నగర్ వెళ్లొచ్చు"

మనుషుల్లో కొందరు మంచి వాళ్లకూడా ఉంటారు. ఇదుగో ఇలాంటివాళ్లు అనుకున్నాడు భాస్కర్రావ్.

★ ★ ★

"నమస్కారం సార్! నా పేరు భాస్కర్రావ్. బాచీ అంటారంతా!" వరహాల్రాజుకి తననితాను పరిచయం చేస్కుంటూ అన్నాడు భాస్కర్రావు. సనత్‌నగర్‌లో అతనికి వరహాల్రాజు ఇల్లు ఒకింత సులభంగానే దొరికింది. ఇతను వెళ్లేసరికి ఆ రోజు అదృష్టవశాత్తూ డ్యూటీ లేకపోవడంవల్ల ఆయనింట్లోనే ఉన్నాడు. ఇల్లు చిన్నదే అయినా ఒద్దికగా ఉంది. ఇంటిముందు ఖాళీస్థలం కొంచెమే ఉన్నా అందులోనే నాలుగైదు కుండీల్లో పూల మొక్కలూ గట్రా ఉన్నై. భాస్కర్రావ్ వెళ్లిన సమయానికి ఆ పూల మొక్కలకి నీళ్లపోస్తూ ఆయన వాకిట్లోనే ఉన్నాడు. "వరహాల్రాజుగారు మీరేనా!" అనడిగి తెలుసుకుని, ఆ తర్వాతే తననితాను అలా పరిచయం చేస్కున్నాడు భాస్కర్రావ్.

"మీరు? ..." పేరు సరే... మిగతా వివరాలు చెప్పమన్నట్టు చూశాడు వరహాల్రాజు. సూర్యకాంతికి ఆయన బట్టతల నిగనిగా మెరుస్తూ ఉంది.

"విజయవాడలో ఉండే రైల్వే పోలీసుగారు నాకు అడ్రసిచ్చారండీ" జేబులోంచి సిగరెట్ ప్యాకెట్ అట్టని బైటికి తీస్తూ అన్నాడు భాస్కర్రావ్.

"విజయవాడలో అనేకమంది రైల్వే పోలీసులుంటారు. ఏ రైల్వేపోలీసు? ఆయనకి పేరులేదా? " వరహాల్రాజుకి కాస్త నసవాగుడెక్కువ. అంచేత తన అడ్రసిచ్చి ఇతన్ని పంపించింది ఎవరయ్యుంటారో చెప్పకనే తెలుస్తూనే ఉన్నా అలా అడిగాడు.

"భలే వారండీ! పేర్లేకుండా ఎలా ఉంటుంది! ఆయన పేరు రాయపాటి రంగరాజుగారు" రైల్వే పోలీస్ పేరును ఇంటి పేరుతో సహా గుర్తుకు తెచ్చుకుని చెప్పేడు భాస్కర్రావ్.

"వాడా? వాడు నాకు తమ్ముడే అవుతాడండి. నాకన్నా మూడేళ్లు చిన్న. అయినా సరే మా ఇద్దరి పెళ్ళిళ్లూ ఇంచుమించు ఒకేసారి అయ్యాయి. నాది కాస్త లేట్ మ్యారేజ్ లెండి. అద్సరే ఇంతకీ మీరొచ్చిన పనేంటి? "

"నేను ఉద్యోగం కోసం వచ్చానండీ! సిటీకి కొత్త. అందుకని రంగరాజుగారు నాకు మీ అడ్రసిచ్చారు"

"నాకిక్కడ పెద్ద ఇన్‌ఫ్లుయెన్సేం లేదు. నా అడ్రసిచ్చినంత మాత్రాన నేనేం చేయగల్ను? అయినా ఉద్యోగం కావాల్సిన ప్రతివాడూ సిటీకొచ్చేస్తూంటంవల్ల రోజురోజుకీ ఇక్కడ జనాభా పెరిగిపోతున్నారు. ఇక్కడ కూడా ఉద్యోగాలేమీ అంత సామాన్యంగా దొరకటంలేదు. మొన్నటికి మొన్న మా అక్కకొడుకు రాంబాబుగాడికి ఉద్యోగం వేయించేసరికి నా తల ప్రాణం తోక్కొచ్చింది. వాడికి టైపూ కంప్యూటరూ షార్ట్‌హ్యాండూ అన్నీ వచ్చు అయినా సరే అన్ని తిప్పలు పడాల్సొచ్చింది. అదిసరే ఇంతకీ నువ్వేం చదివేవ్? "

షరా మామూలే అన్నట్టుగా వరహాల్రాజు కూడా ఏకవచనంలోకి దిగిపోయాడు.

"బియ్యే సెకండ్ క్లాస్‌లో ప్యాసయ్యానండీ!" వినయంగా చెప్పేడు భాస్కర్రావ్.

"టెక్నికల్ క్వాలిఫికేషన్స్ ఏమైనా...? "

"ఏమీలేవండీ"

"పోనీ టైపన్నా వచ్చా? "

"అదీ రాదండీ"

"మరలాంటోడివి ఊపుకుంటూ ఉద్యోగం కోసం ఎందుకొచ్చేవ్? నీ మొహానికి ఉద్యోగమెలా దొరుకుద్ది? " అని పైకైతే అన్లేదు గాని అన్నట్టుగానే చూశాడు వరహాల్రాజు. అంటే శుద్ధవేస్టు గాడికేసి చూసినట్టు చూశాడన్నమాట.

చూడ్డం అయ్యాక "ఉత్త బియ్యేతో నువ్వి క్కడ సాధించగలిగేదేం లేదయ్యా! ఏదన్నా టెక్నికల్ క్వాలిఫికేషన్ ఉంటేనే తప్ప ఉద్యోగం దొరకటం కష్టం. ప్చ్... లాభం లేదు" అంటూ పెదవి విరిచేశాడు.

'నోర్మూయ్యరా! అపశకున పక్షీ!' అని అర వాలనిపించింది భాస్కర్రావ్‌కి. అయినా సభ్యతగా ఉండదని నిగ్రహించుకున్నాడు. ఎంతో ఆశతో శుభమా అని ఉద్యోగ ప్రయ త్నంలో అంతదూరం నుండి ఇక్కడికొస్తే అలా నిరుత్సాహ పరుస్తూ మాట్లాడ్తే ఒళ్లు మండదామరి?

"నెమ్మదిగా టైపూ షార్టుహ్యాండూ అన్నీ నేర్చుకుంటానండీ! కంప్యూటర్ కూడా నేర్చు కుంటాను" కోపాన్ని మనసులోకి తొక్కేస్తూ నమ్రతగానే అన్నాడు.

"ఈపాటికే అవన్నీ నేర్చేసుకునుండా ల్సింది. ఇప్పుడు నేర్చుకోవడం మొదలెడితే ఎప్పటికయ్యేనూ? నీకు ఉద్యోగం ఎప్పటికి దొరికేనూ? ఈలోగా తిండీతిప్పలూ..."

'కొంపదీసి నామీదగాని ఆధారపడి పోదా మనుకుంటున్నావా?' అని పైకయితే అన్లే దుగాని అన్నట్టుగానే చూశాడు వరహా ల్రాజు. అంటే కప్ప పాముకేసి చూసినట్టు భయం భయంగా చూశాడన్నమాట!

అది గమనించి అన్నాడు భాస్కర్రావ్.

"వాటికేం ఇబ్బంది లేదండీ! ఉద్యోగం దొరికేదాకా నేను మా ఊర్నుండి డబ్బు తెప్పించుకోగల్ను... మావూళ్లో నాక్కొంత పొలమూ, ఇల్లూ ఉన్నాయి. ఓ పాతిక వేలుదాకా బ్యాంక్ బ్యాలన్స్‌కూడా ఉంది"

దాంతో వరహాల్రాజు ముఖంలో ప్రస న్నత లాంటిదేదో చోటు చేసుకుంది. ఇలాంటి ఉద్యోగాన్వేషులకు ఆశ్రయం ఇవ్వ టంలో తప్పులేదు. నెలాఖర్లో చేబదుళ్లుగట్రా తీస్కుంటుండొచ్చు! కొంత తీర్చి కొంత ఎగ నామం పెట్టినా తప్పులేదు. ఆశ్రయమిచ్చిన వాళ్లని గట్టిగా అడగలేరుకదా?

"సరే... ఇంతకీ నేన్నీకు చేయగలిగిన సహాయం ఏంటి? అకామిడేషన్ కావా లంటే ఇవ్వగలను. నీకు అభ్యంతరం లేక పోతే ఈ ముందరి గదిలో ఉండొచ్చు నువ్వు. అద్దె నీ వీలునిబట్టి ఎంతోకొంత ఇస్తావనుకో అది వేరే సంగతి. తిండి విష యమంటావా అది కూడా ఏదో ఒకటి చెయ్యొచ్చు ఎటొచ్చీ ఉద్యోగమే వెంటనే దొరకటం కష్టం. చెప్పేనుగా టెక్నికల్ క్వాలి ఫికేషన్స్ ఉండాలి"

భాస్కర్రావ్‌కభ్యంతరం లేకపోతే అతన్ని పేయింగ్ గెస్ట్‌గా తన ఇంట్లో ఉంచేసుకోవా లని అప్పటికప్పుడే ఓ నిర్ణయానికొచ్చేసిన వరహాల్రాజు చాలా కూల్‌గా చెప్పేడు. అత నంత త్వరగా అలాంటి నిర్ణయానికొచ్చేయ డానికి కారణం అతను ఆలస్యం అమృతం విషం అనే సూక్తిని పాటించేవాడు కావటం.

నెల చివర్లో చిన్నచిన్న అవసరాలక్కూడా కటకటలాడిపోయే వరహాల్రాజులాంటి మధ్య తరగతి గృహస్థుకి సొంత ఊళ్లో ఇల్లూ, పొలంతోపాటు పాతికవేలు బ్యాంక్ బ్యాలన్స్ కూడా ఉన్న భాస్కర్రావ్ లాంటి నిరుద్యోగ యువకుడు పేయింగ్ గెస్ట్‌గా లభిస్తే అంతకన్నా కావాల్సిందేముంది? ఇంట్లో ఎదిగిన ఆడపిల్లలుంటే కొంచెం భయపడాలి. కాని వరహాల్రాజుకా ప్రాబ్లెం లేదు. ముగ్గురూ మగపిల్లలే!

భాస్కర్రావ్ చాలా సంతోషపడిపోయాడు వరహాల్రాజుగారి మంచితనానికి. నీకు మా తమ్ముడెలా తెలుసు? మీ ఇద్దరికీ ఎన్నా ళ్లుగా పరిచయముంది? మీదే ఊరు? నీ తండ్రెవరు? లాంటి ప్రశ్నల్తో విసిగించి చంపాల్సింది పోయి అవేమీ అడక్కుండానే తనకు వాళ్లింట్లో చోటు కల్పిస్తున్నాడూ అంటే నిజంగా ఈయనంత మంచివాడు ఈ ప్రపంచంలో ఇంకెవ్వరూ ఉండరనుకు న్నాడు చాలా నమ్మకంగా.





ముందుముందు ఆయన తన దుంపతెం చుతాడని అతనికేం తెల్సు? అతనికి భవిష్యత్తులోకి తొంగిచూడగల అద్భుతశక్తులేమీ లేవుకదా? అంచేత సహజంగానే అతనలా తొందరపడిపోయి వరహాల్రాజుగారి మీద అలాంటి సదభిప్రాయానికొచ్చేశాడు.

"అంతకన్నా మహాభాగ్యమా సార్! ఈ క్షణంనుండి నా బస ఇక్కడే" అని కూడా అనెయ్యాలనుకున్నాడు. కాని అంతలోనే అంతరాత్మ వారించింది...

"ఆ తొందరపాటే పనికిరాదు. నిదానమే ప్రధానమన్న సూత్రాన్ని అప్పుడే మర్చిపోయావా? రూమెలా ఉందో చూడకుండానే ఒప్పేసుకుంటావేం? " అని గదమాయించింది.

దాంతో తెలివి తెచ్చుకుని "నేనాలోచించుకుని చెప్తాను సార్" అన్నాడు తెలివిగా.

"ఏంటినువ్ ఆలోచించుకుని చెప్పేది? "

"అదేసార్! నన్ను మీ ముందరిగదిలో ఉండమంటున్నారుగా? ఉండాలో వద్దో ఆలోచించుకుని చెప్తానంటున్నాను. ఎందుకంటే నేనే విషయంలోను తొందరపడను. నిదానమే ప్రధానమన్న సూత్రాన్ని ఎల్లవేళలా పాటిస్తుంటాను. ఆమేరకు మా తాతయ్యగార్కి మాట కూడా ఇచ్చేను"

"ఏంటీ?, నువ్ నిదానమే ప్రధానమన్న సూత్రాన్ని పాటిస్తుంటావా? " చాలా విచిత్రమైన విషయం విన్నట్టు ఆశ్చర్యంగా చూశాడు వరహాల్రాజు.

"అవున్సార్! ఎందుకలా ఆశ్చర్యపోతున్నారు? "

"ఏంలేదు. నువ్ నాకు క్వయిట్ ఆపోజిట్ అన్నమాట! అందుకని..."

"అంటే? " అన్నట్టుగా చూశాడు భాస్కర్రావ్.

"నేను నాకు ఊహ తెలిసినప్పట్నుంచి ఆలస్యం అమృతం విషం అన్న సూత్రాన్ని నమ్ముకున్నాను. నువ్వేమో అందుకు పూర్తిగా వ్యతిరేకమయిన సూత్రాన్ని నమ్ముతానంటున్నావు... విచిత్రంగా లేదూ? "

"అవున్సార్ విచిత్రంగానే ఉంది" గంగిరెద్దులా తలాడించాడు.

"అంటే మనిద్దరం ఉత్తర దక్షిణ ధృవాల్లాంటివాళ్ళం అన్నమాట!" బట్టతలమీద ఓమారు నిమురుకుని అన్నాడు వరహాల్రాజు. మరి మనిద్దరం పరస్పర విరుద్ధమైన నమ్మకాలు గల వాళ్ళం కదా!? నేన్నీకు రూమివ్వటం బాగుంటుందంటావా? "

గురిచూసి వదిలిన బాణం తగలాల్సిన చోటే తగిలింది. వరహాల్రాజూహించినట్టే భాస్కర్రావ్ కంగారుపడిపోయాడు. అతని ముఖం పాలిపోయింది.

"ఎ...ఎ.... ఎందుకు బాగుండదుసార్! నమ్మకాలు అంటురోగాలు కాదు గదా? ఒకరివి ఒకరికి అంటుకోవు కదా? అందుకని బాగానే ఉంటుంది" అనడం కంగారుగానే అన్నా కాస్త తెలివైన వివరణే ఇచ్చాడు.

అలారా దారికి. లేకపోతే నేనేదో నిన్ను కాళ్లావేళ్లా పడి బతిమాలుతున్నట్టు 'ఆలోచించుకుని చెప్తాసార్' అంటూ బెట్టు చేస్తావా? !... హుఁ... అనుకున్నాడు వరహాల్రాజు మనసులో.

"ఏమోనయ్యా! నాకు మాత్రం అలా అన్పించటంలేదు. నీకు రూమివ్వడమంటే కొరివితో తల గోక్కోవడమేనేమోనన్పిస్తోంది"

మరో బాణం వేశాడు వరహాల్రాజు. భాస్కర్రావుని గాభరా పెట్టేసి తన ఇంట్లో పేయింగ్ గెస్ట్‌గా ఉండటానికి అతన్తో ఇప్పటికిప్పుడే ఊఁ కొట్టించేస్కోవాలని ఆయన ప్లాను.

ఆయనూహించినట్టే భాస్కర్రావ్ ఉండేలు దెబ్బ తగిలిన పక్షిలా గిజగిజలాడిపోయాడు. "అబ్బే అలాగేం జరగద్సార్! నేను స్వతహాగా బుద్ధి మంతుణ్ణి మరియు అమాయకుడ్ని కూడా. అంచేత నాకు రూమిస్తే



మీకెలాంటి ట్రబులూ రాదు" అన్నాడు బీద ముఖం పెట్టి.

"నీ బుద్ధి మంచిదే కావొచ్చయ్యా! కాని మన నమ్మకాలు విరుద్ధమైనవి కదా? "

దీన్నింకో బాణం అనైతే అనలేంగాని మొత్తానికి చురకలాంటిదే!

"నమ్మకాల్దేముంది సార్! ఎవరివి వారికే ఉంటాయ్! ఇందాక నేను చెప్పినట్టు అవేమీ అంటురోగాలు కావుగదా? "

"ఇంతకీ నువ్వనేదేంటి? నాకిష్టమైతే నువ్ మా ముందరి గదిలో ఉండి పోతానంటావ్? "

"అవున్సార్ అంతే అంతే!" అనేశాడు భాస్కర్రావ్ 'ని.ప్ర' సూత్రాన్ని తాత్కాలికంగా మర్చిపోతూ.

"పడింది కేసు" అనుకున్నాడు వరహాల్రాజు.

"సరేనయ్యా! రూమైతే ఇస్తాననుకో... మరి వంట మాట? నీకు వొండుకోవడం వచ్చా లేక భోజనం కూడా నన్నే పెట్టమంటావా? "

"మిమ్మల్నంత శ్రమపెట్టన్లెండి. ఏదన్నా మెస్ చూస్కుంటా" మొహమాటంగా అన్నాడు భాస్కర్రావ్.

"మెస్‌మెతుకులు మనిషి జన్మెత్తిన వాడెవడూ ముట్టలేడు" మరో బాణం వేశాడు వరహాల్రాజు.

"అయినా నీకు భోజనం పెట్టడంలో మాకు శ్రమేముంటుంది? మేం వొండుకున్నదే నువ్వూ తింటావు. అదనంగా ఖర్చువ్వద్దనుకో. కానీ దాందేముందీ? నువ్వేం ఊరికే తినవ్ కదా? నెలకింతని ఎంతో కొంత లెక్కగట్టి ఇవ్వకపోవుగదా? ఏమంటావ్"

"ఇవ్వకుండా ఎందుకుంటాను సార్? ఆ లెక్కేదో మీరే కట్టి ఎంతవు తుందో తేల్చి చెబితే పైసా తేడా రాకుండా ఇచ్చేస్తాను" తానేమంటున్నాడో తనకే తెలీని స్థితిలో వరహాల్రాజుగారింట్లో పేయింగ్ గెస్ట్‌గా ఉండటానికి తన అంగీకారాన్ని తెలిపేశాడు భాస్కర్రావ్.

ఆ సమయంలో అతనికి "ని.ప్ర" సూత్రం గాని, మరేది గాని గుర్తుకురాలేదు.

'పూర్తిగా పడిపోయింది పిట్ట' అనుకున్నాడు వరహాల్రాజు.

"సో... ఈ క్షణంనుండి నువ్ మా ఇంట్లో పేయింగ్ గెస్ట్‌గా ఉండటానికి డిసైడ్ చేసేస్కున్నావన్నమాట! గుడ్! మంచిది! సరే ఇంట్లోకి నడువ్... ముందు చల్లటి మజ్జిగైనా తీసుకుందువుగాని" అంటూ చేతిలో ఉన్న ప్లాస్టిక్ మగ్గుని పక్కన పడేసి లోనికి దారి తీశాడు.

అంతసేపూ ఆయన పాపం భాస్కర్రావ్‌ని నించోబెట్టే మాట్లాడేడు. అంచేత అప్పటికే కాళ్ళుగుంజటం ప్రారంభించిన భాస్కర్రావ్ మారుమాట మాట్లాడకుండా ఆయన వెంట మంత్రముగ్ధుడిలా నడిచాడు.

అలా భాస్కర్రావ్ జీవితంలో ఇంకో కొత్త అధ్యాయం ప్రారంభమైంది.



ఇంట్లోకి తీసుకెళ్లాక ఓ గ్లాసుడు చల్లటి మజ్జిగిచ్చి భాస్కర్రావ్ తాగి సేదతీరేక అప్పుడు అతగాడి గురించి పూర్తి వివరాలు అడిగి తెలుసుకున్నాడు వరహాల్రాజు.

'చిత్రమైన మనిషి' అనుకున్నాడు భాస్కర్రావ్.

లేకపోతే ఏంటి

ముక్కూమొహం తెలియని వ్యక్తిని పేయింగ్ గెస్ట్‌గా చేర్చేసుకున్నాక ఇప్పుడా వివరాలడగటం? అని కూడా అనుకున్నాడు. గురువిందగింజ సామెతగా తానూ ఒక చిత్రమైన మనిషేనన్న సంగతి ఆ సమయంలో అతనికి తట్టలేదు.

"ఇల్లు చూద్దువుగాని పద" వివరాలు తెలుసుకున్నాక భాస్కర్రావ్‌ని లేపి గదీగదీ తిప్పి చూపించాడు వరహాల్రాజు.

చిన్నవే అయినా ఓ హాలూ నాలుగు గదులూ ఉన్నాయ్. అవి కాక ఓ కిచెనూ, సపరేటుగా - అంటే పెరట్లో ఒకింత దూరంగా బాత్‌రూమ్, లావెట్రీ ఉన్నాయ్.

పెరడు కూడా చిన్నదే అయినా, అక్కడ కూడా ఓ నాలుగైదు కుండీల్లో పూలమొక్కలున్నాయ్. అదికాక ఓ కరివేపాకు చెట్టు కూడా ఉంది.

ఇంట్లో సామానూ గట్రా మరీ అట్టహాసంగా ఏంలేదు. ఒక మామూలు మధ్య తరగతి గృహంలో ఏమేం ఉంటాయో అవ్వే ఉన్నాయి.

టీవీ కూడా బ్లాకెండ్‌వయిట్, పోర్టబుల్

ఇల్లు చూడ్డం ముగించి మళ్ళీ హాల్లోకొచ్చి సోఫాలో కూర్చున్నాడు. అప్పటిగ్గాని వెలగలేదు భాస్కర్రావ్‌కి మెదళ్ళోని బల్బు.

అంతా బాగానే ఉందిగాని ఇంట్లో మనుషులెవరూ కన్పించరేంటి?

ముగ్గురు మగపిల్లలు, ఒక భార్యనే చెప్పేడు కదా? వాళ్ళంతా ఏరి?

"అన్నట్టు ఆంటీగారూ పిల్లలూ ఏరి సార్?"

"పిల్లలు స్కూల్‌కెళ్ళారు. తనేమో వాళ్ళ దూరపు బంధువుల అమ్మాయెవరో పెద్దమనిషైతే ఆ ఫంక్షన్‌కెళ్ళింది. దూరపు బంధువులంటే మరీ దూరమేం కాదులే. ఒక రకంగా దగ్గరే! ఆవిడ- అంటే ఆ కనకలత- ఈవిడకి- అంటే నా భార్యకి మేనత్తగారి కూతురి తోటికోడలికి చెల్లెలవ్వుద్దన్న మాట! అంటే మరీ దూరమేం కాదు గదా?" అన్నాడు వరహాల్రాజు.

"అవునవును దూరమేం కాదు" అన్నాడు భాస్కర్రావ్.

మనసులో 'దూరం కాకపోవడమేంటి నీ బొంద' అనుకున్నాడు. వరహాల్రాజొక నసగాడని అప్పుడే తెలిసొచ్చిందతనికి. లేకపోతే ఏంటి ఏదో ఫంక్షన్ కెళ్ళిందని క్లుప్తంగా చెప్తే సరిపోయేదానికి ఈ నసంతా దేనికి?

"అద్సరేగాని నువ్ నిజంగానే భోంచేసొచ్చావా?"

"అవున్సార్! వారాశిగూడ నుంచి స్టేషన్ కొచ్చాక టెన్ నెంబర్ బస్సెక్కేముందు ఎదురుగా ఓ హోటల్ కనిపిస్తే ఎందుకన్నా మంచిదని భోజనం చేసేశాను. మీ ఇల్లింత సులభంగా దొరుకుతుందనుకోలేదు"

నిజమే చెప్పాడు భాస్కర్రావ్.

"సరే మంచిదైతే. రాత్రంతా ప్రయాణం చేశావ్ కాబట్టి కాసేపు రెస్ట్ తీస్కో. సాయంకాలానికల్లా పిల్లలూ, మా ఆవిడా వస్తారు. వాళ్లని పరిచయం చేస్తాను" అన్నాడు వరహాల్రాజు.

భాస్కర్రావ్ 'సరేనండీ' అన్నట్టు తలూపడంతో అతన్ని ముందర గదిలోకి తీస్కెళ్ళి, అక్కడో చాపాదిండూ వేసి, "ప్రస్తుతానికిలా అడ్జస్ట్ చేస్కో. తర్వాత నెమ్మదిగా మంచమూ గట్రా కొనుక్కుందూగాన్లే" అంటూ ఉచితసలహా పారేసి... "నేనూ కాసేపలా నడుం వాలుస్తా"నంటూ వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోబోతూ ఏదో గుర్తొచ్చినవాడిలా వెనక్కి తిరిగొచ్చి "అన్నట్టు నన్ను సారూ గీరూ అని పిలవద్దు. బాబాయ్ అని పిలువ్ బాగుంటుంది? ఎందుకంటే మాతోపాటే మా ఇంట్లోనే ఉండబోతున్నావ్ కాబట్టి అలా వరసలు కలిపి పిల్చుకుంటే బావుంటుంది" అన్నాడు 'ఎలా ఉంది నా అయిడియా?' అన్నట్టు కళ్ళెగరేస్తూ.



"మంచిది బాబాయ్‌గారూ!" ఆయన సలహాని వెంటనే అమల్లో పెట్టేస్తూ అన్నాడు భాస్కర్రావ్. నాక్కూడా అలాగే ఇష్టం. అక్కడ మా గోకారోళ్లింట్లో కూడా అంతే! అక్కడ నన్నెవ్వరూ పరాయివాడిలా చూడ్రు..."

"ఇక్కడా నిన్నెవరూ పరాయివాడిలా చూడరు. ముందు ముందు నీకే తెలుస్తుంది లే" అనేసి వెళ్ళిపోయాడు వరహాల్రాజు.

"అబ్బ! ఎంత మంచి బాబాయో!" అనుకున్నాడు భాస్కర్రావ్ ఆనందంగా.

మొత్తానికి ఆ దొంగెవడోగాని తన సూట్ కేస్ నెత్తుకుపోయి మంచిపనే చేశాడు. వాడివల్లే కదా తనకి విజయవాడలో రైల్వే పోలీస్‌గారు పరిచయమవుతా? ఆయన పరిచయం వల్లే కదా తనకిపుడీ అండ లభిస్తే? అని కూడా అనుకున్నాడు.

అలసిపోయి ఉన్నాడేమో, మరి కాసేపటికి అతనికి ఒళ్ళు తెలీకుండా నిద్ర పట్టేసింది.



సాయంత్రం అయిదున్నర గంటల వేళప్పుడు... హఠాత్తుగా భూకంపం వచ్చింది. తానున్నది హైదరాబాద్‌లోనా? లాతూర్‌లోనా? ఇదేంటింత సడన్‌గా భూకంపమొచ్చేసింది? అని బిత్తరపోతూ కళ్ళు తెరచిన భాస్కర్రావుకి- చుట్టూ శవాలు, కూలినగోడలూ, విరిగిపోయిన మట్టిపెళ్ళలూ వగైరా వగైరా లేమీ కన్పించ లేదు. పైగా గదిలోని వస్తువులు... అంటే అంతకుముందే ఆ గదిలో ఉన్న వరహాల్రాజుగారి వస్తువులు... ఎక్కడివి అక్కడే ఉన్నాయ్! గోడలు కూడా బీటలూ గట్రా ఇవ్వకుండా మామూలుగానే ఉన్నాయ్!

దాంతో భూకంపం నిజంగా రాలేదనీ తనలాంటి భ్రమకు లోనయ్యాడనే గ్రహించగలిగాడు భాస్కర్రావ్.

మరి ఆ భయంకరమైన ధ్వనులేమిటి? వేలాదిమంది ముక్తకంఠంతో అరుస్తున్న ఆ అరుపులేమిటి? దిగ్గున లేచిపోయి వరండామీదకెళ్ళి హాల్లోకి చూశాడు.

హాల్లో ముగ్గురు కుర్రాళ్ళు నానా బీభత్సం చేస్తున్నారు.

ఒకడు పరీక్షలు రాసే అట్టతో ఇనప టేబుల్ మీద దబాదబా బాత్తున్నాడు. మరొకడు ఇత్తడి బిందెనొకదాన్ని బోర్లించి దాని మీద గోడలకి రంధ్రాలు చేయటానికి ఉపయోగించే జంపర్‌తో దరువేస్తున్నాడు. ఇంకొకడు ఓ ట్రంకు పెట్టెమీద నిలబడి గుమ్మి గుమ్మిమని ఎగురుతున్నాడు.

తన్మూలంగా చాలా భయంకరమైన ధ్వనులు ఉత్పన్నమవుతున్నాయ్. దానికి తోడు టీవీయేమో ఫుల్ వాల్యూంతో దద్దరిల్లిపోతోంది. అందులో క్రికెట్ వస్తోంది.

భాస్కర్రావ్‌కి మొదట్నుంచీ ఆటలంటే అంతగా ఆసక్తి లేకపోవటంవల్ల అతనికి క్రికెట్ గురించి బొత్తిగా తెలీదు. కానీ అజారుద్దీన్ మాత్రం తెలుసు- పేపర్లో ఫొటోలూ గట్రా చూస్తుంటాడు కాబట్టి. టీవీ స్క్రీన్ మీద అజారుద్దీన్ ముఖం ఓ మారు కనిపించింది కాబట్టి వస్తున్నది క్రికెట్టనీ, ఇండియావాళ్ళు ఇంకేదో దేశంతో ఆడ్తున్నారనీ మాత్రం గ్రహించగలిగాడు.

వేలాదిమంది ముక్తకంఠంతో అరుస్తున్న అరుపులు టీవీలోంచి వస్తున్నవే! అక్కడెక్కడో ఆట చూస్తూన్న ప్రేక్షకులు అరుస్తూన్న అరుపులు!

ఏమిటీ కిష్కింధకాండ?

వీళ్ళసలు మనుషులేనా లేక ఆ రూపంలోవున్న వానరాలా? అనుకున్నాడు భాస్కర్రావ్, ఆ ముగ్గురు కుర్రాళ్ళకేసీ అయోమయంగా చూస్తూ.

"ఏంటయ్యా మెలుకువ వచ్చేసిందా? ఎంత సేపైంది లేచి?" అంటూ లోపల్నుంచి వరండా మీదకొచ్చాడు వరహాల్రాజు.

"ఈ కోతులు మీ సుపుత్రులా?" అనడగ





బోయి నిగ్రహించుకున్నాడు భాస్కర్రావు.

"అవున్సార్! కాదవును బాబాయ్‌గారూ!" అన్నాడు వినయంగా.

పిల్లలలా వీరవిహారం చేస్తుంటే చావ గొట్టి చెవులు మెయ్యాల్సింది పోయి ఇలా చూస్తూ ఊర్కున్నాడేంటీయన?! అనుకున్నాడు మనసులో.

అతగాడి సందేహాన్ని నివృత్తి చేస్తూ అడక్కపోయినా ఆ విషయమే చెప్పాడు వరహాల్రాజు.

"వీళ్ళు నా సుపుత్రులయ్యా! వాడు పెద్దోడు హరి- టెన్తుక్లాసు. వీడు రెండోవాడు గిరి- ఎయిత్ క్లాసు. వీడు! చివరోడు మురారి- సెవెన్త్‌క్లాసు. క్రికెట్టంటే ప్రాణం వెధవలు ముగ్గురికీ. ఇండియా గెలిచేలా ఉంది కదా అందుకని అలా సంతోషాన్ని వ్యక్తంచేస్తున్నారు. వాళ్ళమ్మ గనుక ఇంట్లో ఉంటే కుక్కిన పేనుల్లా ఉంటారు. లేకపోతే మాత్రం ఇదుగో ఇలాగే అంతు లేకుండా అల్లరిచేస్తుంటారు. నా భయం వీళ్ళకాస్త తక్కువలే"

'తక్కువేంటి నీమొహం? నువ్వంటే వాళ్ళకసలు భయభక్తులే లేవు' అని మనసులో అనుకున్నాడు భాస్కర్రావ్.

ఇండియా గెలుస్తున్నంత మాత్రాన్న ఆ ఆనందాన్ని మరీ ఇంత అసహ్యంగా వ్యక్తం చెయ్యాలా? ఇంత వికారపు చేష్టలు చెయ్యాలా? వీళ్ళే గనుక నా పిల్లలయ్యుంటే వెధవల్ని చిన్నప్పుడు తాగిన ఉగ్గుపాలతోసహా కక్కుకునేలా చావబాదుండేవాడ్నే! అని కూడా అనుకున్నాడు.

కానీ విజ్ఞత వెన్నుతట్టగా ఆ పిల్లలపట్ల తనలో ఏర్పడిన ఏహ్యాభావం ముఖంలో వ్యక్తంకాకుండా తగు జాగ్రత్త వహించి, "పిల్లలన్నాక గొడవచేయకుండా ఉంటారేంటి బాబాయ్‌గారూ!? ఏ వయసులో చేయాల్సిన వెధవ పన్లు ఆ వయసులో చేయాల్సిందే! మొత్తానికి పిల్లలు ముగ్గురూ రత్నాల్లా ఉన్నారు. ఇంక పిన్నిగారెలా ఉంటారో చూడాలి" అంటూ కొంచెం అతిగానే వాగాడు.

అతి అన్నివేళలా అనర్ధదాయకం అన్న సూక్తిని అతని తాత అతనికి చెప్పుండలేదు మరి!

వరహాల్రాజుకి సహజంగానే డవుటొచ్చేసింది. కోతివెధవల్ని పట్టుకొని రత్నాల్లాంటి పిల్లలంటున్నాడూ అంటే... ఇతగాడు తనని కాకా పట్టాలని చూస్తున్నాడన్నమాట!

కానీ అంతలోనే తనకి తానే సర్ది చెప్పుకున్నాడు- సరే పట్టనీలే ఏంపోయిందని.

"మీ పిన్నిగారికి ఆకారం గాంభీర్యము. నోరూకాస్త ఎక్కువే గాని మనసు మాత్రం వెన్న. ఇంకో గంటకో అరగంటకో వస్తుందిలే. అప్పుడు నువ్వే చూస్తావుగా? "

వరహాల్రాజు అలా అనగానే భాస్కర్రావ్‌కో విషయం అర్ధమైంది... సౌభాగ్యలక్ష్మి పిప్పళ్ళ బస్తాలా లావుగా ఉంటుందని.

"అది సహజమేలెండి బాబాయ్‌గారూ! ఆకార గాంభీర్యమూ, నోరూ ఉన్నవాళ్ళకెప్పుడూ మెత్తని మనసే ఉంటుంది" అన్నాడు మళ్ళీ కొంచెం అతిగానే.

అంతలో ఏమయ్యిందో ఏమో... గదిలో నానాభీభత్సం చేస్తున్న కుర్రాళ్ళు ముగ్గురూ సడన్‌గా అల్లరాపేశారు. ఆఖరోడు గభాల్న వెళ్ళి టీవీ కట్టేశాడు. మిగతా ఇద్దరూ మెరుపువేగంతో ట్రంకుపెట్టె, ఇత్తడి బిందే, జంపరూ, పరీక్ష అట్టా ఇత్యాదుల్ని ఎక్కడుండాల్సిన వాటిని అక్కడ పెట్టేశారు.

ఆపైన ఆ నరరూప వానరాలు ముగ్గురూ బుద్ధిగా చేతులు కట్టుకొని సోఫాలో ఒకరి పక్కన ఒకరు గాంధీగారి కోతుల్లా కూర్చుండి పోయారు.

దాంతో అంతవరకూ భూకంప భ్రాంతిని కలుగజేసిన వాతావరణం కాస్తా సడన్‌గా మారిపోయింది.

ఇంచుమించు పిన్‌డ్రాప్ సైలెన్స్ ఏర్పడిపోయింది.



"దిక్కుమాలిన సంత! దిక్కుమాలిన సంత! ఎన్నిసార్లు చెప్పినా బుద్ధుండదేమో! చెత్తంతా తీస్కొచ్చి ఇక్కడ పోస్తారు. కడుపుకి అన్నం తింటారో గడ్డి తింటారో. చెత్త కుండీదాకా వెళ్ళే ఓపిక లేకపోతే వాళ్ళ కొంపలముందు పోసుకుచావొచ్చుగా? తేరగా ఈ ఇల్లే దొరికింది కాబోలు..."

స్వర్గీయ సూర్యకాంతం స్వరంలో స్వర్గీయ ఛాయాదేవి స్వరాన్ని మిక్స్‌చేసి ఆపైన దాన్ని వందతో హెచ్చించి, మూడుతో భాగిస్తే ఎలా ఉంటుందో అలా వుందా ఆ స్వరం.

"వాళ్ళమ్మొస్తోంది. అందుకే కుక్కిన పేనుల్లా అయిపోయారు"

ఏదో గొప్ప విషయం చెబుతున్నట్టుగా ముఖంపెట్టి కొంచెం తగ్గుస్వరంతో అన్నాడు వరహాల్రాజు.

'భార్యంటే ఈయనకీ హడలేనన్నమాట' అని అపోహపడ్డాడు భాస్కర్రావ్ ఆయనలా స్వరం తగ్గించడంతో.

అవునది అపోహే! ఎందుకంటే భార్యంటే భయాన్ని ప్రదర్శిస్తాడే తప్ప నిజంగా భయపడడు వరహాల్రాజు.

"పాపం..." అని జాలిగా ఇంకా ఏదో కూడా అనుకోబోయాడు భాస్కర్రావ్. కానీ మానేశాడు.

అందుక్కారణం... పర్వతానికి ముఖము, కళ్ళు, చేతులూ పెట్టినట్టుగా ఉన్న సౌభాగ్య లక్ష్మి గేటు తీసుకుని అప్పటికే అక్కడికి వచ్చేయటం.

'బాప్‌రే బాప్ ఎంత లావో?' అనుకున్నాడు భాస్కర్రావ్ ఆశ్చర్యంగా. ఎందుకంటే అంతకు ముందెప్పుడూ అతను అంత స్థూలకాయురాల్ని చూసుండలేదు.

వచ్చీరావడంతోనే సహజంగానే ఆమె దృష్టి భాస్కర్రావ్ మీదపడింది.

"ఎవడీ కుర్రకుంక?" అన్నట్టు కళ్ళెగరేసింది.

"ఇతను భాస్కర్రావని పెడన్నుండొచ్చాడు. విజయవాడలో మా బాబాయ్ కొడుకు రంగరాజు లేడూ వాడు పంపించాడు. ముందు నువ్వింట్లోకి పద. తర్వాత వివరాలన్నీ మాట్లాడుకోవచ్చులే" భార్య కళ్ళ ప్రశ్నకి నోటితో జవాబు చెప్పి పక్కకు ఒరిగాడు వరహాల్రాజు.

అవును మరి! ఆమె లోపలికెళ్ళాలంటే గుమ్మానికి అడ్డంగా ఎవ్వరూ ఉండకూడదు.

"న... న... నమస్కారం పిన్నిగారూ" భాస్కర్రావ్ చేతులు జోడిస్తూ అన్నాడు. కారణం లేకుండానే అతని కంఠం కంపించింది.

అతనికేసి కిందినుండి పైదాకా అదోలా చూసిందావిడ అదోలా అంటే 'వరసలు కలుపుతున్నావ్- ఏంటి కత?' అన్నట్టుగా అన్నమాట.

ఆ చూపుకే బేజారెత్తిపోయాడు భాస్కర్రావ్.

"బా... బాబాయ్‌గారే అలా పిలవమన్నారండీ. అంటే వరుసలు కలిపి పిల్చుకుంటే పరాయివాళ్ళం అన్న భావన పోతుందికదండీ. అందుకని అన్నమాట" ఆమె నోరు తెరిచి తననేమీ అడక్కపోయినాసరే కంగారుపడి ఎక్స్‌ప్లనేషన్ ఇచ్చాడు.

'ఇతని వాగుడికి అర్థమేంటి?' అన్నట్టు కళ్ళెగరేసిందామె వరహాల్రాజుకేసి చూస్తూ.

"అదంతా తర్వాత చెప్తాలే. ముందు నువ్ లోపలికి నడు" కాస్త గట్టిగా మొగుడిలాగే అన్నాడు వరహాల్రాజు.

'సరే చూస్తా చూస్తా' అన్నట్టుగా తల పంకించి లోనికి నడిచిందామె.

ఆమె మౌనం భాస్కర్రావ్‌ని చాలా భయపెట్టింది. ఒత్తంటించి వదిలిన శివకాశి బాంబు నడుచుకుంటూ ఇంట్లోకి వెళ్ళిన భావం.

అది ఎప్పుడన్నా పేలచ్చుకదా?

భాస్కర్రావ్ ముక్కుమీద ముత్యాల్లా మెరుస్తున్న చిరుచెమట బిందువుల్ని చూసి





అతని మానసిక స్థితిని అంచనా వేయగల్గిన వరహాల్రాజు అతనికి బాగా దగ్గరగా జరిగి..." నువ్వేం భయపడాల్సిన పన్లేదు. ఒక్కోసారి మాటల్తోనూ, ఒక్కోసారి మౌనం తోనూ తనలా భయపెడ్తూంటుందే తప్ప మనసు మాత్రం నేను ముందే చెప్పినట్టు వెన్నపూసే! అదీగాక తనెప్పుడూ నేను గీచిన గీటు దాటదు. అంచేత ఇక్కడనీ ఉని క్కొచ్చిన ప్రమాదమేమీ లేదు" అన్నాడు ఇంచుమించు చెవిలో చెప్పినంత నెమ్మ దిగా.

అతనన్నది నిజమే. సౌభాగ్యలక్ష్మి ఆకా రమూ, నోరూ ఎలా ఉన్నా, ఆమె నోటికి జడిసి అనేక సందర్భాలలో అతను తనంత టతానే తగ్గిపోయి ప్రవర్తించినా, ఆ ఇంట్లో ఫైనల్‌గా చెల్లుబాటయ్యేది అతని మాటే. కడవంత గుమ్మడికాయైనా కత్తిపీటకు లోకు వేగదా అన్న సామెత వాళ్ల విషయంలో సెంట్ పర్సెంట్ వర్తిస్తుంది.

ఆమె గుమ్మడి కాయ. అతను కత్తిపీట. భాస్కర్రావ్‌తో అలా చెప్పినమీదట నెమ్మ దిగా ఇంట్లోకి వెళ్ళిన వరహాల్రాజు, సౌభా గ్యలక్ష్మి పెరట్లో కాళ్లు కడుక్కుంటూ ఉండటం చూసి అక్కడికి వెళ్ళాడు.

"ఎలా జరిగింది ఫంక్షన్?" అంటూ మాటకలిపి,' ఆమె ఏదో సమాధానం చెప్పాక భాస్కర్రావ్ విషయం తానే ఎత్తి క్లుప్తంగా వివరాలన్నీ చెప్పి, ఆ మీదట చిదంబర రహస్యాన్ని కూడా చెప్పాడు. అంటే తానే ఉద్దేశంతో అతనికి తమ ఇంట్లో పేయింగ్ గెస్ట్‌గా స్థానం కల్పించాడో అద న్నమాట.

చివర్లో "కాబట్టి అతన్ని మనం మంచిగా చూస్కుంటే ముమ్ముందు అతను మనకు చాలా ఉపయోగపడతాడు" అన్న ఊరిం పుతో ముగించాడు.

"సరే మీ ఇష్టం" అనేసింది సౌభాగ్య లక్ష్మి.

"అతను నువ్వేమీ మాట్లాడకుండా వచ్చేసి నందుకు నొచ్చుకున్నట్టున్నాడు. వెళ్ళి పలక రించు"

'అలాగే' అన్నట్టు తలూపి కాళ్ళు కడుక్కో వటం ముగించిన సౌభాగ్యలక్ష్మి భాస్కర్రా వ్‌ని వెతుక్కుంటూ వరండామీదకు వచ్చింది. ఆమె వెనుకే వరహాల్రాజు కూడా వచ్చాడు.

వీళ్ళొచ్చేసరికి భాస్కర్రావింకా మునుపటి స్థానంలోనే నిలబడి ఉన్నాడు... 'లోపలకె ళ్ళిన లక్ష్మీబాంబు ఎప్పుడు పేల్తుందా?' అని ఎదురు చూస్తూ.

అలాంటిది లక్ష్మీబాంబు పేలకపోగా ఒకింత నవ్వు ముఖంలో తిరిగిరావటం చూసి ఆశ్చర్యపోయాడు.

"నీ పేరేంటన్నావబ్బాయ్?" లక్ష్మీబాంబు పలకరించింది.

"భాస్కర్రావ్, పిన్నిగారూ! బాచీ అంటా రంతా?" చెప్పాడు భాస్కర్రావ్.

"నన్ను కూడా అలాగే పిలవమంటావా?"

"మీ ఇష్టం పిన్నిగారూ!"

"సరే బాచీ! ఇక్కణ్ణుంచి అలాగే పిలుస్తా నైతే. మీ బాబాయ్‌గారు నీ గురించి అంతా చెప్పారు. ఇకనుంచి నువ్ మా పిల్లల్లో ఒక డివి. ఇది నీ ఇల్లే అనుకో. మమ్మల్ని పరా యివాళ్ళుగా భావించవద్దు..."

సౌభాగ్యలక్ష్మి అలా అంటుంటే, 'బాబా య్‌గారు చెప్పింది నిజమే! ఈవిడ మనసు వెన్నపూసే!' అనుకున్నాడు భాస్కర్రావ్. "అలాగే పిన్నిగారూ" అన్నాడానందంగా.

"అన్నట్టు సాయంత్రం కూరేం చేయమం టావ్? వంకాయకూర నీకిష్టమేనా? ఎందు కంటే అడిగి తెలుసుకోవాలిగా. కొందరు కొన్ని వస్తువులు తినరు. నీకు పడనివే మన్నా ఉంటే ముందే చెప్పేసెయ్. వండటం మానేస్తాను" అంది సౌభాగ్య లక్ష్మి.

ఆమె అప్పుడే తనపట్ల అంత ప్రత్యేకమ



యిన శ్రద్ధని చూపటం చాలా సంతోషాన్ని కలిగించింది భాస్కర్రావ్‌కి.

'మనసు వెన్నపూస మాత్రమే కాదు. మనిషి కూడా నిజంగా నరరూపదేవతే!' అనుకున్నాడు మనసులో తొందరపడి అలా ఒక అభిప్రాయానికి వచ్చేయబాకు. 'నిదానమే ప్రధానం... నిదానమే...' అని అంతరాత్మ హెచ్చరించినా దాన్నతను ఖాతరు చేయలేదు.

లక్ష్మీబాంబనుకున్న వ్యక్తి అమ్మ కాని అమ్మలా అలా ఆప్యాయంగా మాట్లాడుతుంటే కుశంకలెలా కలుగుతై ఎవర్కైనా?

"నాకు పడని వస్తువులంటూ పెద్దగా ఏంలేవు పిన్నిగారూ! కాకపోతే బెండకాయ, చేమదుంపల్లాంటి జిగురు పదార్థాలు అంతగా ఇష్టపడనంతే"

"దాందేముందిలే బాబూ!? అవి రెండూ వండటం మానేస్తే సరి. అన్నట్టు నీకు కూరల్లో కారం ఎక్కువ ఉండాలా? తక్కువ ఉండాలా? "

"ఎలా ఉన్నా ఫర్వాలేదు పిన్నిగారూ. నేనన్నిటికీ అడ్జస్టయిపోగల్ను. నా కోసం మీరు ప్రత్యేకంగా ఏమీ చేయనక్కరలేదు. అలాగే మీ ఇష్టాల్ని కూడా మార్చుకోనక్కరలేదు. మీరు పెట్టిందే తింటాను" అన్నాడు భాస్కర్రావ్. నిజంకూడా అదే. అతను తిండికి పెద్దగా ప్రాధాన్యత నివ్వడు. ఏదుంటే దాన్తో అడ్జస్ట్ అయిపోతాడు. ఆడదిక్కులేని ఇంట్లో పెరిగినవాడు కావటంవల్ల మొదట్నించి అతనికలా అలవాటైపోయింది.

"అబ్బే అదేం మాటలేవోయ్..." వరహాల్రాజు మధ్యలో తల దూరుస్తూ అన్నాడు. "ఏదోటి తిని అడ్జస్ట్ అవ్వాల్సిన అవసరం నీకేంటి? కావాల్సినవే అడిగి వండించుకు తిను. నువ్వేం ఊరికినే తినవ్‌గదా? డబ్బులిచ్చి తింటున్నప్పుడు కావాల్సినవి అడిగి చేయించుకుతినే హక్కుంటుందికదా?





కాబట్టి నువ్వేం మొహమాటపడకు. నీకేం కావాలో మీ పిన్నితో చెప్పు... ఆమె చేస్తుంది దట్సాల్"

వరహాల్రాజు అనడంలో ఆప్యాయతకన్నా 'నువ్ పేయింగ్ గెస్ట్‌వన్న సంగతి మర్చిపోబాకు సుమా!' అన్న హెచ్చరికే ఎక్కువ ధ్వనించడం భాస్కర్రావ్ గుర్తించినా పెద్దగా పట్టించుకోలేదు.

"డబ్బులిచ్చినంత మాత్రాన ఎదుటివారికి ఇబ్బంది కలిగేలా ప్రవర్తించాలని రూలుందా ఏంటి బాబాయ్‌గారూ? అయినా కాకపోయినా నేన్నిజమే చెబుతున్నాను. నేను నిజంగానే భోజనప్రియుణ్ణి కాను. ఏదోవేళకింత కడుపులో పడితే చాలంతే" అనేశాడు తేలిగ్గా.

'అలా అయితే మరీ మంచిది' అనుకుంది సౌభాగ్యలక్ష్మి మనసులో. "నువ్వలా అన్నంత మాత్రాన చెత్తాచెదారం పెట్టన్లే నాయనా. ఉన్నంతలోనే రుచిగా శుచిగా నోటికింపుగా చేసిపెడ్తాను. సరేనా? " అంది పైకి.

భాస్కర్రావ్ బిడియంగానే నవ్వి అన్నాడు, "అభిమానంతో పెట్టిన అంబలైనా అమృతప్రాయమే పిన్నిగారూ! నన్ను మీ పిల్లల్లో ఒకడిగా జమకట్టారు. అంతే చాలు. చిన్నప్పట్నుంచీ తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని నాకు మీరిద్దరూ దేవుడిచ్చిన తల్లిదండ్రులనుకుంటాను. దయచేసి ఈ విషయం ఇంతటితో ముగించండి..."

అలా అంటున్నప్పుడు తన కళ్ళు లీలామాత్రంగా చెమ్మగిల్లినై. అది గమనించిన ఆ దంపతులకు అతనిమీద తొలిసారిగా నిజమైన వాత్సల్యంలాంటిదేదో కలిగింది.

"సరే బాచీ! ఇంక ఆ సంగతులొద్దులే గాని... మరొక్క విషయం. సార్లే కాదు. గార్లు కూడా మనుషుల మధ్య దూరాన్ని పెంచుతయ్. నువ్వది కూడా గుర్తిస్తే మంచిది" అన్నాడు వరహాల్రాజు అతన్ని సమీపించి భుజంమీద చెయ్యేసి దగ్గరికి తీసుకుంటూ.

"నిజమేననుకోండి బాబాయ్‌గారూ! కానీ తండ్రిని కూడా 'నాన్నగారూ' అని పిలుస్తారు. అంతమాత్రాన ఆ పిలుపు తండ్రీ కొడుకుల మధ్య దూరాన్ని పెంచదుగదా! అలాగే ఇదీను..." అన్నాడు భాస్కర్రావు.

"సరే నీ ఇష్టం" అంటూ నవ్వేశాడు వరహాలరాజు.

'మొత్తానికి కుర్రాడు బుద్ధిమంతుడే' అనుకొంది సౌభాగ్యలక్ష్మి.

ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్ ది బెస్ట్ ఇంప్రెషన్ అంటారు. ఆమెలో అతనిపట్ల అలాంటి అభిప్రాయం మొదటే ఏర్పడ్డం ఒకరకంగా అతని అదృష్టమనే అనుకోవాలి.

★ ★ ★

ఆ రాత్రి గుత్తివంకాయకూర, పప్పుచార్లతో తృప్తిగా భోంచేసిన భాస్కర్రావ్ నరరూప వానరాల్ని తన రూమ్‌లోకి పిల్చుకెళ్లి వాళ్ళతో చెలిమికట్టాడు.

అంటే వాళ్ళతో కబుర్లేసుకుని వాళ్ళ ఇష్టాఇష్టాలడిగి తెలుసుకుని వాళ్ళకి నచ్చేలా కబుర్లు చెబుతూ వాళ్ళతో స్నేహం చేశాడన్నమాట. నవ్వుతూ నవ్విస్తూ మాట్లాడగలగాలేగాని పిల్లల్తో స్నేహం చేయడం ఎంతసేపు?

ఇకపై తానెలాగూ ఆ ఇంట్లోనే ఉండాల్సినవాడాయె. అలాంటప్పుడు ఆ కోతులు ముగ్గుర్నీ స్నేహం పేరుతో మచ్చిక చేసుకునైనా తన కంట్రోల్‌లోకి తెచ్చుకోవడం ఎంతో అవసరంగా భావించి ముందుగా ఆ పనిచేశాడు.

అల్లరి విషయంలో కోతులైతే అవ్వొచ్చుగాని మామూలుగా మాత్రం వాళ్ళు ముగ్గురూ మంచివాళ్లే కాకుండా తెలివైన వాళ్ళు కూడా అని గ్రహించేశాడు భాస్కర్రావ్ ఆ కొద్దిసేపట్లోనే.

ముగ్గురూ 'అన్నయ్యా! అన్నయ్యా' అని పిలుస్తూ తనతో కబుర్లు చెప్పడానికి ఒకర్తో ఒకరు పోటీలు పడ్తుంటే ఒక స్టేజిలో మధ్యాహ్నం వాళ్ళని గురించి చాలా చెడ్డగా అనుకున్నందుకు కొంచెం పశ్చాత్తాపం లాంటిది కూడా కలిగింది భాస్కర్రావ్‌లో.

వాళ్ళతో మాట్లాడుతున్నప్పుడు అతనికి వెంకటలక్ష్మి మనసులో కనిపించింది.

"ఆమె తనకి దేవుడిచ్చిన చెల్లెలైతే వీళ్లు దేవుడిచ్చిన తమ్ముళ్లు అంతే... తమ్ముళ్లను నరరూప వానరాలు అనుకోవడం తగదు గాక తగదు. కాబట్టి ఇంకెప్పుడూ అలా అనుకోకూడదు' అని మనసులో ఓ నిర్ణయం లాంటిది కూడా చేసుకున్నాడు.

భాస్కర్రావ్ తమ పిల్లల్తో అలా కలిసిపోయి కబుర్లాడ్డం వరహాలరాజు దంపతులక్కూడా ఎంతో సంతోషాన్ని కలిగించింది.

ముఖ్యంగా వరహాలరాజుకి మరీ సంతోషాన్ని కలిగించింది. అందుక్కారణం... 'ముందు ముందు పిల్లలకి ట్యూషన్ చెప్పడానికి కూడా ఉపయోగపడేలా ఉన్నాడు' అన్న ఒక్క ఆలోచన.

రాత్రి పావుతక్కువ పదౌతుండగా వరహాలరాజు, భాస్కర్రావ్ రూమ్‌కెళ్ళి పిల్లల్ని కేకేశాడు.

"ఇంక అన్నయ్యని పడుకోనివ్వండిరా రేపు చెప్పుకోవచ్చులే కబుర్లు..." అంటూ.

ఆ ముందరిగది ఇప్పుడు కాదు కొన్ని గంటలక్రితమే భాస్కరావ్‌దైపోయింది. ఆ గదిలోంచి అతనికి మరీ అడ్డంగా ఉంటాయనిపించే కొన్ని సామాన్లని ఇవతలికి తీసేసి "ఇదిగోనయ్యా నీ రూము..." అంటూ సౌభాగ్యలక్ష్మి అతనికి అప్పగించేసింది.

★ ★ ★

మర్నాడు పొద్దున్నే భాస్కర్రావ్‌కి ఓ టెస్ట్ పెట్టాడు వరహాలరాజు.

టెస్టంటే డైరెక్ట్‌గా తెలిసేలా పెట్టిన టెస్ట్ కాదు.

అదోరకమైన ఇన్‌డైరెక్ట్ టెస్టు.

ఆ విధానం బెట్టిదంటే...

"కుర్రాడు అన్ని విషయాల్లోనూ మంచివాడిలాగే కన్పిస్తున్నాడు. కానీ డబ్బు విష

యంలో ఎలాంటివాడో మనకింకా తెలీదు కదా? మనంతట మనం ఇప్పుడు డబ్బు విషయం కదపటం బాగుండదు. కాబట్టి...'

అంటూ భార్యను చెంతకుపిల్చి ఆమె చెవిలో ఓ ఉపాయంలాంటిది చెప్పాడు వర హాల్రాజు.

ఆమేరకు ఆవిడ భాస్కర్రావ్ పళ్లు తోము కుంటుండగా అతనికి వినిపించేలా భర్తమీద నోరు పారేసుకోవడం ప్రారంభించింది.

"నెలకు సరిపడా బియ్యం ఒక్కసారే తెచ్చి పడేయమంటే నా మాట విన్రు... అప్పుడు పాతిక్కేజీలు, అప్పుడు పాతిక్కేజీలు తెస్తారు... బియ్యండబ్బా ఖాళీ అయిపో యింది. డ్యూటీకి వెళ్తారుగావల్ను. ముందు బియ్యం ఇంట్లో పడేసెళ్లండి..."

"అచ్చి! ఎందుకే అంత గట్టిగా అరు స్తావ్? గిరిగాడ్నో, హరిగాడ్నో ఖాతాకొట్టుకి పంపించి అందాకో అయిదు కేజీలు తెప్పిం చొచ్చుగా పోనీ..."

"పిల్లలు వెళ్తే వాడివ్వడు. పోయిన్నెల్లో మనం పూర్తిగా జమెయ్యలేదని చిరాకు పడ్తున్నాట్ట. నిన్న మంచినూనెకి పంపిస్తే మురారిని తిట్టేట్ట..."

"ఎందుకు తిట్టడం? ఏం మనకేమన్న తేరగా ఇస్తున్నాడా? ఫస్టొచ్చాక రూపాయి నోట్లు లెక్కట్టి తీస్కోవట్లేదా? పోయిన్నెల్లో అంటే ఏదో ఇబ్బందివల్ల కొంత బాల న్సుంచాం! ఎప్పుడూ అలాగే చేస్తున్నామా?"

"అలా అని మీరెళ్ళి దులపరించి ఉ౦క గండి. పిల్లాడవన్ని అడగ్గలడా?"

"నేనెళ్తే బాలన్సుంటూ జిడ్డులా పట్టుకుం టాడే బాబూ! హరిగాడ్ని వెళ్ళమను. ఏదో కాసేపు గొణిగినా వాడే ఇస్తాళ్ళే..."

ఆ దంపతులలా పోట్లాడుకుంటున్న టైప్‌లో మాట్లాడుకుంటుంటే...

వరహాల్రాజూహించినట్టే "ఏంటి పిన్ని గారూ డబ్బుకేమన్నా ఇబ్బందిగా ఉందా?" అంటూ మధ్యలో వచ్చి తలదూర్చాడు భాస్కర్రావ్.

"ఏం లేదులే బాచీ... నువ్వెళ్ళి నీ పన్చూ సుకో. మధ్యతరగతి కొంపల్లో ఇబ్బందు లెప్పుడుండవు గనుక?" అన్నాడు వరహా ల్రాజు భార్యకు నోరు తెరిచే అవకాశం ఇవ్వ కుండా.

అలా అని భాస్కర్రావ్ ముఖంలోని రియాక్షన్‌ని చూడ్డంకోసం క్రీగంట చూశాడ తనికేసి.

భాస్కర్రావ్ టెస్ట్‌లో ఫెయిలవ్వలేదు.

"అవేం మాటలు బాబాయ్‌గారూ?" అంటూ బాధగా ముఖంపెట్టాడు. "మీ ఇంట్లో ఉంటున్నప్పుడు మీ ఇబ్బందులు నావికావా? ఖర్చుకోసం నేను తెచ్చుకున్న డబ్బులున్నాయి. ఎంతివ్వమంటారు? ఓ అయిదొందలు సరిపోతాయా?"

వరహాల్రాజు ముఖం వికసించింది. కానీ తన ముఖం అలా వికసించినట్టు భాస్క ర్రావ్ గమనించడం బాగుండదు కాబట్టి వికసించిన ముఖాన్ని క్షణాల్లో ముడిచేసుకు న్నాడు. ముడుచుకున్న ముఖంమీద మొహ మాటాన్ని పులుముకుంటూ, "ఛఛ... అప్పుడే నీ దగ్గర డబ్బు తీస్కోవడం ఏం బావుంటుందబ్బాయ్... వద్దులే నువ్వెళ్ళు... నా తిప్పలేవో నేను పడ్తాలే" అన్నాడు అడ్డంగా తలాడిస్తూ.

"ఇది నా ఇల్లే అనుకోమని చెప్పి, మీరే నన్ను పరాయివాడిలా చూస్తే ఎలా బాబా య్‌గారూ?" అన్న భాస్కర్రావ్ ఆ ప్రశ్నకు సమాధానాన్నాశించకుండా చటుక్కున తన రూమ్‌లోకి వెళ్ళి, సూట్‌కేస్‌లోంచి ఓ అయి దొందలు తెచ్చి వరహాల్రాజు వద్దంటున్నా సరే అతని చేతిలో కుక్కేశాడు.

"వెరీగుడ్! నూటికి నూటేభై మార్కుల్తో ప్యాసైపోయావ్ నా టెస్ట్‌లో" అనుకున్నాడు వరహాల్రాజు మనసులో.

"భలేవాడివయ్యా నువ్వు!" అంటూ నవ్వే





శాడు పైకి.

'మొత్తానికి మీరు అసాధ్యులండి.' అనుకుంది సౌభాగ్యలక్ష్మి మనసులో.

అలా... తనకు తెలియకుండా ఫేస్ చేసిన టెస్ట్‌లో బెస్ట్ పెర్‌ఫార్మెన్స్ చూపించి ఆ దంపతుల మనస్సుల్లో గుడ్‌బోయ్‌గా స్థిరపడిపోయిన భాస్కర్రావ్, వరహాల్రాజు సలహా మేరకు ఆరోజు కూడా ఇంట్లోనే ఉండిపోయి రెస్ట్ తీసుకున్నాడు.

ఆ మర్నాటినుంచి ప్రారంభమైంది అతని ఉద్యోగాల వేట!

★ ★ ★

ఓ వారం తిరిగేసరికల్లా 'ఉత్తుత్త బియ్యే గాళ్ళకి ఉదారంగా ఉద్యోగాలు దొరకడం కష్టం. టెక్నికల్ క్వాలిఫికేషన్స్ ఉండి తీరాలి' అన్న వరహాల్రాజు మాటల్లోని నిజం బోధపడిపోయింది భాస్కర్రావ్‌కి.

అదే పనిగా పెట్టుకుని పేపర్లోపడ్డ 'వాకిన్ ఇంటర్వ్యూ'కల్లా హాజరయ్యాడు. ఆ వారంలో ప్రతిచోటా ఉండే ఒక ట్రెండు ఉద్యోగాలకి తంబలు తంబలుగా జనం! ఎస్సెల్సీ చాలన్న పోస్టులకి ఎమ్మేస్సీలు కూడా వస్తుంటే ఇంక భాస్కర్రావేం సెలక్ట్ అవుతాడు.

ఉద్యోగం దొరకటం లాటరీలో బహుమతి రావటంలాంటిదేనాయె! అదృష్టం అందర్నీ అర్జంటుగా వరించేయదుగా?

అయితే మనసులో 'నిదానమే ప్రధానమన్న' సూక్తి అనునిత్యం మెదుల్తూనే ఉండటంవల్ల భాస్కర్రావ్ పెద్దగా డీలాపడిపోలేదు.

టైమూ గట్రా కలిసి రావాలి. తొందరపడితే ఎలా? అని తనకుతానే సర్దిచెప్పుకుని హ్యాపీగానే ఉండసాగాడు.

వరహాల్రాజు సిటీ మ్యాపొకటి కొనిచ్చి ఏయే నెంబర్ బస్‌లు ఏయే రూట్లలో తిరుగుతాయో బాగా ఎక్స్‌ప్లెయిన్ చేయడం వల్లా, ఓరోజు డ్యూటీకి డుమ్మాకొట్టి మరీ అతనికి సిటీ అంతా తిప్పి చూపించటంవల్లా ఇపుడు భాస్కర్రావ్‌కి కన్‌ఫ్యూజన్ బాగా తగ్గిపోయింది. అంటే మొదటి రోజులాగ అతనిపుడు గాభరాపడటంలేదు. సిటీలో ఎక్కడికైనా సరే వెళ్ళి తిరిగొచ్చేయగల నేర్పూ ఓర్పూ అబ్బేసినై.

దాందేముంది? అభ్యాసం కూసువిద్య అనుకున్నాడు.

పోతే ఈ వారం రోజుల్లో వరహాల్రాజు గారి కుటుంబ సభ్యులంతా అతనికి బాగా సన్నిహితమైపోయారు.

★ ★ ★

"బాచీ!"

"ఏంటి బాబాయ్‌గారూ? " గడ్డం గీసుకుంటున్న భాస్కర్రావ్ వరహాల్రాజు పిలుపుకి తలపైకెత్తి చూశాడు.

"ఈరోజు పేపరు చూశావా? " అతనికి దగ్గరగా ఓ స్టూల్ని లాగి కూర్చుంటూ అడిగాడు వరహాల్రాజు.

"పొద్దున్న లేవగానే ముందు నేను చేసే పనే అదిగదా!? చూశాను. ఏం? " అన్నాడు భాస్కర్రావ్.

"సమీర స్టీల్స్ ప్రైవేట్ లిమిటెడ్‌వాళ్ళు ఆఫీస్ అసిస్టెంట్లు కావాలంటూ ఇచ్చారు. దానికో అప్లికేషన్ పడేయ్..."

"మీరు ప్రత్యేకంగా చెప్పాలా బాబాయ్ గారూ? నాకు ఎలిజిబిలిటీ ఉన్న ప్రతి దానికీ ఓ అప్లికేషన్ తగిలిస్తూనే ఉన్నాను. పోతే 'వాకిన్ ఇంటర్వ్యూ' అన్న ప్రతిదానికి వెళ్తొస్తూనే ఉన్నాను..."

"అవున్లేగానీ సమీరా స్టీల్స్ విషయంలో నిజంగానే ఓ ప్రత్యేకతుంది. అందుకే స్పెషల్‌గా చెప్తున్నాను"

భాస్కర్రావ్ కుతూహలంగా చూశాడు.

"ఏంటి బాబాయ్ అది? "

"నా కొలీగ్ ప్రణయభాస్కర్ వాళ్ళ బావగారు సమీరా స్టీల్స్‌లోనే చేస్తారు! నాకైతే గుర్తులేదుగాని మొత్తానికయితే ఏదో పెద్ద పోస్టే... కాబట్టి నువ్వప్లికేషన్ పడేస్తే

ఇంటర్వ్యూ టైమ్‌లో రికమెండేషన్ చేసిద్దాం. నేనివ్వాళే ప్రణయభాస్కర్‌తో మాట్లాడ్తాను" అంటూ అసలు విషయం చెప్పాడు వరహాల్రాజు.

రికమండేషన్ అనగానే ప్రాణం లేచొచ్చిన ట్టుగా అనిపించింది భాస్కర్రావ్‌కి. "నిజం గానా బాబాయ్‌గారూ! అబ్బ ఎంత మంచి వార్త చెప్పారు బాబాయ్‌గారూ!"అన్నాడానం దంగా.

"ఏమోలే... అప్పుడే అంత సంతోషపడి పోవద్దు. అక్కడ రికమండేషన్లు ఎంతవ రకు పన్జేస్తాయో మనకైతే తెలీదు. కానీ ఓ మార్గమంటూ కన్పిస్తోంది కాబట్టి మన ప్రయత్నం మనం చేద్దాం"

వరహాల్రాజలా అనగానే ఉత్సాహం కాస్త తగ్గినా, 'అవునదీ నిజమేగదా?' అనిపించింది భాస్కర్రావ్‌కి.

"అంతేలే బాబాయ్‌గారూ! మన ప్రయత్నం మనం చేస్తాం. ఆపైన అదృష్టం కూడా కలిసిరావాలి కదా? ఉద్యోగం రావటం రాకపోవటం తర్వాత. కానీ నా విషయంలో మీరిలా స్పెషల్ ఇంట్రస్ట్ తీస్కుంటున్నందుకు నాకు చాలా సంతో షంగా ఉంది" అన్నాడు గడ్డం గీసుకునే ప్రక్రియని శీఘ్రతరం చేస్తూ.

"అది నా బాధ్యత. అది సరేగాని దానికి లాస్ట్ డేట్ ఈనెల ట్వంటీయత్‌దాకా ఉంది. ఇంకా టైముందికదాని నువ్ నెగ్లెక్ట్ చెయ్యొద్దు. ఆలస్యం అమృతం విషం అన్నారు పెద్దలు. ఇవ్వాళే అప్లికేషన్ పంపించేయ్"

తన తాతగారి సూత్రానికి డెడ్ ఎగెనెస్ట్ సూత్రాన్ని వరహాల్రాజు ఉచ్చరించటం ఉలి క్కిపడేలా చేసింది భాస్కర్రావ్‌ని. ఆ ఉలి క్కిపడ్డంలో అసలే చకాచకా గీస్కుంటున్నా డేమో గడ్డం కాస్తా తెగి చివ్వున రక్తం ఎగ జిమ్మింది.

అచ్చూసి కంగారుపడిన వరహాల్రాజు, "అరెరె... ఎందుకోయ్... అంత కంగారు? ! నిదానం! నిదానం! నిదానమే ప్రధానమ న్నారు పెద్దలు" అంటూ అసంకల్పితంగా తాను నమ్మే సూత్రానికి వ్యతిరేకమైన సూత్రాన్ని వల్లించాడీసారి.

దాంతో భాస్కర్రావ్ పెదవులమీద చిరు మందహాసం విరిసింది.

"ఒకపక్క గడ్డం తెగి రక్తం కార్తుంటే నవ్వుతావేంటోయ్? "

"నేను నవ్వుతోంది గడ్డం తెగినందుకు కాదు బాబాయ్‌గారూ! ఇప్పటికిప్పుడే మీరు ప్లేటు మార్చేసినందుకు"

"ప్లేటా? ప్లేటేంటి? " అయోమయంగా చూశాడు వరహాల్రాజు. నిజంగానే ఆయనకి విషయం అర్థంకాలేదు.

భాస్కర్రావ్ మరోసారి నవ్వి అసలు విషయం చెప్పాడు. "అదే బాబాయ్‌గారూ! నా గడ్డం తెగేసరికల్లా మీ ఆలస్యం అమృతం విషంకాస్తా నిదానమే ప్రధానమై పోయింది కదా?' అదీ ప్లేటు మార్చడ మంటే"

"అదా... భలేవాడివోయ్" అంటూ తనూ నవ్వేశాడు వరహాల్రాజు. "నీ రక్తం చూసే సరికి కళ్ళు తిరిగి కంగార్లో ఏదో అలాంటి తప్పుడు సూత్రాన్ని వల్లించాను. అంతే తప్ప నిజానికి మనం పాటించాల్సింది మాత్రం ఆలస్యం అమృతం విషం అన్న సూత్రాన్నే సుమా!"

భాస్కర్రావ్ ఈసారి మనసులో నవ్వుకున్నాడు. "మీబోడి హితబోధలకి లొంగిపోయి మా తాతయ్యగారు చెప్పిన అమూల్య సూత్రాన్ని విస్మరిస్తానా? నో నెవ్వరు" అనుకున్నాడు మనసులోనే. పైకి మాత్రం ఏమీ అనకుండా 'అలాగే బాబాయ్ గారూ!' అన్నట్టు తలూపి ఊరుకున్నాడు.

"అది సరేగాని బాచీ... చిన్న రిక్వెస్టు..."

"చెప్పండి బాబాయ్‌గారూ" షేవింగ్ ముగించేసి రక్తం వొస్తున్నచోట తుండుగు డ్డతో అద్దుకుంటూ, ఏంటన్నట్టుగా





చూశాడు.

"నువ్ మరోలా అనుకోకూడదు ..." నసిగేడు వరహాల్రాజు.

"ఫర్వాలేదు చెప్పండి బాబాయ్‌గారూ!" చెప్పకనే తెలిసిపోయింది భాస్కర్రావ్‌కి ఆయన డబ్బులడగబోతున్నాడని. డబ్బు కోసం కాకపోతే ఆయనకి తనవద్ద అలా నసగాల్సిన అవసరం ఏముంటుంది?

"మరేంలేదోయ్... నెలాఖరుకదా, కాస్త ఇబ్బందిగా ఉంది. లెక్కా డొక్కా తర్వాత చూస్కో వచ్చులే గాని... ఓ రెండొందలుంటే సర్దగలవా?" భాస్కర్రావ్ ఊహని నిజం చేస్తూ అడిగాడు వరహాల్రాజు.

"భలేవారే బాబాయ్‌గారూ! దానికింత మొహమాటం దేనికి? ఇస్తానుండండి" అంటూ లేచి సూట్‌కేసు దగ్గరికి నడిచాడు భాస్కర్రావ్.

వరహాల్రాజు ముఖం వికసించింది.

★ ★ ★

ఓ గంట పోయాక...

దగ్గర్లోనే ఉన్న ఓ జిరాక్స్ సెంటర్‌కెళ్ళి, అప్లికేషన్‌కి జత చెయ్యాల్సిన సర్టిఫికేట్స్ అన్నింటినీ కాపీలు తీయించుకుని అక్కడే ఓ బయోడేటా ఫాం కూడా కొనుక్కొని మళ్ళీ ఇంటికొచ్చిన భాస్కర్రావ్, 'సమీర స్టీల్స్'కి అప్లికేషన్నైతే సిద్ధం చేసేశాడుగాని... దాన్ని పోస్ట్‌చేసే విషయంలో మాత్రం ఆలోచనలో పడ్డాడు.

అందుక్కారణం ఆరోజు తిథి అష్టమి కావడం.

అష్టమినాడు తల పెట్టిన పనులేవీ సక్రమంగా జరగవని అతని తాతయ్యగారు అంటుండేవాడు.

అది గుర్తొచ్చి అతనాలోచనలో పడ్డాడు.

తాతయ్యపుడు సజీవంగా లేకపోయినా ఆయన ఆత్మ తనని గమనిస్తూనే ఉంటుంది...

ఆయన కిష్టంలేని తిథి అని తెలిసికూడా ఈరోజే ఆ అప్లికేషన్‌ని పోస్ట్ చేయడం ఏం బావుంటుంది? ఆయన ఆత్మ క్షోభించదూ?

టైమ్ లేకపోతే ఆ దారివేరు. కానీ ఇంకా టైముందిగా? ఇవ్వాళా రేపూ ఆగితే ఎల్లుండి దశమి.

దశమినాడు చేసే ఏపనైనా సత్ఫలితాన్నే ఇస్తుందంటుండేవాడు తాతయ్య.

కాబట్టి దశమినాడు పోస్ట్‌చేస్తే అటు తిథి విషయంలోనూ ఆయన మాటను మన్నించినట్టుంటుంది. ఇటు నిదానమే ప్రధానమన్న సూక్తినీ పాటించినట్టుంటుంది.

అలా అనిపించగానే అలాగే చెయ్యాలన్న నిర్ణయానికొచ్చేసి, అప్లికేషన్‌ని బల్లమీదున్న డిక్షనరీలో పెట్టేసి వేరే పనిమీద అంటే ఇంకేదో కంపెనీవాళ్ళు ప్రకటించిన వాక్-ఇన్ ఇంటర్వ్యూకి హాజరయ్యేందుకు బైటికి వెళ్ళిపోయాడు భాస్కర్రావ్.

మర్నాడు వరహాల్రాజు, "ఏం బాబీ? అప్లికేషన్ సంగతేం చేసావ్? పంపించేశావా?!" అనడిగితే లేదని చెప్పి ఆయన మనసు నొప్పించడం దేనికి లెమ్మని, "ఆఁ నిన్ననే పోస్ట్ చేసేశా బాబాయ్‌గారూ!" అని బొంకేశాడు భాస్కర్రావ్.

పెద్దవారి మనసు నొప్పించడంకన్నా బొంకడం మేలుకదా?



త్రానొకటి తలిస్తే విధి ఒకటి తలుస్తుందన్నది భాస్కర్రావ్ అప్లికేషన్ విషయంలో అంటే సమీరా స్టీల్స్ అప్లికేషన్ విష

యంలో నిజమే అయింది.

పాపం 'దశమి'నాడు పోస్ట్ చేస్తే దశతి రుగుతుంది కదా అనుకున్నాడు భాస్క ర్రావ్.

కానీ నిజానికేం జరిగిందంటే దశమినాడు అతనా అప్లికేషన్‌ని వీధి మొగలో ఉన్న పోస్ట్‌బాక్స్‌లో వేసి ఇంటికొచ్చేశాడు. లోకల్ కాబట్టి రేపటికల్లా చేరిపోతుంది. ట్వంటీయత్ ఎల్లుండి కదా? అనుకున్నాడు ఎంతో ధీమాగా.

అంతలో చప్పున స్ఫురించిందతనికి ఇవ్వాళ సాటర్‌డే కదా రేపేలా చేర్తుందీ? ! అని.

రేపు కాకపోతే ఎల్లుండి. ఎల్లుండి అయిదు గంటల్లోగా ఎప్పుడు చేరినా ఫర్వా లేదుకదా? ! అని సర్దిచెప్పుకున్నాడంతలోనే.

కానీ అతనికో కఠోరమైన సత్యం సోమ వారంనాడు కవర్లు కొంటానికి పోస్టాఫీస్‌కెళ్తే అపుడు తెల్సింది.

కవర్లూ, స్టాంపులు అమ్మే కౌంటర్ ముందు కొల్లేటి చాంతాడంత క్యూ ఉండటం చూసి "ఇంత మందున్నారేం టండీ -రేషన్ షాపు ముందున్నట్టు? " అన్నాడు పక్కవాడితో.

"నిన్నా మొన్నా సెలవులు కదండీ" అన్నాడు పక్కవాడు.

"నిన్నంటే సండే అనుకోండి... మొన్నేం సెలవు? మొన్న వర్కింగ్‌డేనే కదా? " అన్న ట్టుగా చూశాడు.

"మీకు తెలీదా? మొన్న గురునానక్ బర్త్‌డే! పోస్టల్ హాలిడే" అన్నాడు పక్క వాడు.

అంతే! గుండెలో బాంబేదో పేలినట్టు అదిరిపడ్డాడు భాస్కర్రావ్!

బాప్‌రే బాప్! ఎంతపనైంది? !

అంటే తన అప్లికేషన్ నిన్నా మొన్నా పోస్ట్‌బాక్స్‌లోనే మగ్గి ఇవ్వాళ బైటికొచ్చిం దన్న మాట! గమ్యస్థానానికి రేపు చేర్తుం దన్న మాట!! అంటే ఒకరోజు లేటుగా!

మైగాడ్! ఇప్పుడెలా?

తాతయ్యనీ, తాతయ్యా తిథుల సిద్ధాం తాన్నీ, తాతయ్యా చెప్పిన బోడి 'సి.ప్ర' సూత్రాన్నీ బండబూతులు తిట్టాలనిపిం చింది భాస్కర్రావ్‌కి. కానీ తాతయ్యా ఆత్మని క్షోభింపచేయటం ఇష్టంలేక ఆ పని చేయలే కపోయాడు.

ఇప్పుడెలా?

వాళ్ళు లేటుగా అందిన అప్లికేషన్లని కన్సి డర్ చేస్తారో చెయ్యరో? టైమ్ చూసుకు న్నాడు, మూడున్నర.

ఇప్పుడు ఇంటికెళ్ళి మరో అప్లికేషన్ తయారుచేసి పర్సనల్‌గా వెళ్ళి ఇచ్చొద్దా మన్నా టైమ్ సరిపోదు.

ఇవ్వాళ ఆటోలు స్ట్రయిక్ కాబట్టి వెళ్తే గిళ్తే సిటీబస్సుల్లోనే వెళ్ళాలి. మరో అప్లికేషన్ తయారుచేస్కుని మూడు బస్సులు మారి అక్కడికెళ్లేసరికి కచ్చితంగా ఆఫీసు మూసే స్తారు.

చ్ఛ... బంగారంలాంటి అవకాశం చేజారి పోయింది. ఎందుకంటే నిన్ననే చెప్పేరు బాబాయ్‌గారు తన విషయం ప్రణయ భాస్కర్‌తో మాట్లాడినట్టూ, తప్పకుండా రిక మండేషన్ చేపిద్దాం అని ఆ ప్రణయ భాస్కర్ ఒప్పుకున్నట్టూ.

ఇప్పుడెలా?

ఎలా ఏముంది? తూర్పుకి తిరిగి దండం పెట్టడమే! ఆ పనే చేశాడు భాస్కర్రావ్.

అంటే నిజంగానే తూర్పుకి తిరిగి దండం పెట్టేడని కాదుగాని నా ఖర్మ అని నెత్తి బాదుకుని ఊరుకున్నాడు.

★ ★ ★

ఓ పదిహేను రోజుల తర్వాత...

"ఆ సమీరా స్టీల్స్ వాళ్ళు ఇంటర్వ్యూకి కాల్ లెటర్స్ పంపించారట! నీకింకా రాలే దేంటి? " అని వరహాల్రాజు అడిగినప్పుడు... ఏమో అనబోయి





మనసొప్పక అసలు విషయంకాస్తా చెప్పే శాడు భాస్కర్రావ్.

అది విని మండిపడ్డాడు వరహాల్రాజు.

"ఆలస్యం అమృతం విషమయ్యా బాబూ! ఈ రోజే పోస్ట్ చేసేయ్! అని నేనారోజు అంతగా చెప్తే చివరికిదన్నమాట నువ్ చేసిన నిర్వాకం... మీ తాతయ్యగారి బోడి తిథులూ, బోడి సూత్రాలూ నీకు కూడు పెడ్తాయా? ఇదెక్కడి గోలయ్యాబాబూ!" అంటూ పెద్దరికం కొద్దీ కేకలు వేశాడు.

అంతేకాదు.. ఆఖరు ప్రయత్నంగా ఆ సమీరాస్టీల్స్ ఆఫీసుకు వెళ్లి (భాస్కర్రావ్‌ని కూడా వెంటబెట్టుకుని వెళ్లి) "మా వాడికి కాల్ లెటర్ రాలేదేంటి?" అని వాకబుచే శాడు.

"మీ వాడి అప్లికేషన్ లేటుగా అందింది. లేటుగా అందిన వాట్ని మేం లెక్కలోకి తీస్కోలేదు. ఇప్పుడీ స్టేజ్‌లో మేం చెయ్యగ లిగింది కూడా ఏమీలేదు" అంటూ చేతులె త్తేశారు వాళ్లు. దాంతో భాస్కర్రావ్‌ని ఇంటి కీడ్చుకొచ్చి, అంటే నిజంగా ఈడ్చుకొచ్చాడని కాదు ఈడ్చుకొచ్చినంత పన్జేసి అతనికి మరో సారి బ్రెయిన్ వాష్ ఇచ్చాడు వరహాల్రాజు.

"ఆ దిక్కుమాలిన సూత్రాన్ని ఇకనైనా కట్టగట్టి అటకమీద పడేయ్! అంతేకాకుండా ఆలస్యం అమృతం విషం అన్న సూత్రాన్ని పాటించటం నేర్చుకో. బాగు పడతావ్" అంటూ చాలాసేపు హితబోధచేశాడు.

అసలే నసగాడేమో, 'ఆ. అ. వి' సూత్రాన్ని నమ్ముకోవడంవల్ల జీవితంలో తానెన్ని సార్లు లబ్ధిపొందేడో ఉన్నవాటికి లేనివి నాలుగు జోడించి మరీ అనేకానేక ఉదాహరణలు చెప్పుకొచ్చాడు.

సహజంగానే భాస్కర్రావ్‌కి తల వాచిపో యింది. సమ్మెట దెబ్బల్ని కాలిన ఇనుమైతే తట్టుకోగలుగుతుంది.

అంచేత భాస్కర్రావ్ కళ్లనీళ్ల పర్యంతమై పోతూ "అలాగే మహాప్రభో! ఇకనుంచి 'ఆ. అ. వి' సూత్రాన్నే పాటిస్తాను. మీ ఉదాహ రణలింకచాలు. ఆపేయండి. లేదా నన్ను ఎండ్రిన్‌లో ముంచిలేపిన కత్తితో పొడిచే యండి" అంటూ గర్జన చేశాడు.

దాంతో వరహాల్రాజు శాంతించి అతన్నం తటితో వదిలిపెట్టేశాడు.

వరహాల్రాజు తనని వదిలి వెళ్లిపోయాక భాస్కర్రావ్ ఆలోచనలోపడ్డాడు.

ఏమిటది? ఎందుకిలా జరుగుతోంది? తనమీద ఎంతో ప్రేమతో తాతయ్య కడసా రిగా చెప్పిన 'ని. ప్ర' సూక్తి తన విష యంలో ఎందుకిలా బెడిసి కొడ్తోంది? 'ని. ప్ర' సూత్రంకన్నా 'ఆ. అ. వి' సూత్రమే గొప్పదంటున్నాడు బాబాయ్‌గారు.

ఏది సత్యం? ఏది అసత్యం? !

ఏది సత్ఫలితాన్నిస్తుంది? ఏది దుష్ఫలి తాన్నిస్తుంది? దేన్ని పాటించాలి? దేన్ని పాటించకూడదు? మెదడులోని నరాలు చిట్లిపోతాయేమోనన్న భయం కలిగేవరకూ అలా ఆలోచిస్తూనే ఉండిపోయాడు భాస్క ర్రావ్.

అయినా అతనిలో తలెత్తిన సందేహాలకు సమాధానాలు దొరకలేదు. చివరికి ఆలోచిం చటం మానేశాడంతే.

★ ★ ★

మర్నాడు పొద్దున్న సౌభాగ్యలక్ష్మి భాస్క ర్రావ్‌కి ఉప్మాలో చక్కెరవేస్తూ చెప్పింది...

"రాత్రంతా మీ బాబాయ్‌గారు నీ గురించి బాధపడ్తూనే ఉన్నారు బాచీ! నీ అప్లికేషన్ వాళ్లకి టైమ్‌లో అందుంటే నీకా ఉద్యోగం తప్పకుండా వచ్చుండేదట. చేతులారా మంచి అవకాశాన్ని పోగొట్టుకున్నావని చాలా బాధపడ్డారు"

'నిన్నంతా ఆయన వాయించాడు. తెల్లార గానే నువ్వు తగులుకున్నావా తల్లీ' అనుకు న్నాడు భాస్కర్రావ్ మనసులో.

అవునుమరి. పొద్దున్నే అలా తగులు కుంటే చిరాకెయ్యదూ!

కానైతే పైకి మాత్రం ప్రసన్నంగానే నవ్వాడు.

"నిజమే పిన్నిగారూ! కానీ ఇప్పుడేం చేయ

గలం చెప్పండి? అది అలా జరిగిపోయింది... దేనికన్నా ప్రాప్తముండాలంటారందుకే”

“అదీ నిజమేలే బాచీ! మనం ఎన్నో అనుకుంటాంగానీ ప్రాప్తం లేనిదే ఏదీ జరగదు. మన మురారి విషయమే తీస్కో. ఈసారి వాడి పుట్టినరోజు ఎంతో బాగా చెయ్యాలనుకున్నాం. ఎందుకంటే మీ బాబాయ్‌గార్కి అందాల్సిన ఎరియర్స్ ఈ నెల్లో తప్పకుండా అందుతాయనుకున్నాం. కానీ అది కాస్తా ముందుకు పోయింది. దాంతో వాడి పని కాస్తా హుళక్కి అయిపోయింది. కనీసం కొత్త గుడ్డలైనా కొనేలా లేదు పరిస్థితి”

బాణం వేసింది సౌభాగ్యలక్ష్మి.

ఆ మాటలు ఆమె నోటిగుండా వచ్చినైగానీ నిజానికి ఆమెతో అనిపించింది వరహాలరాజే! ఆయనే అలా అనమని చెప్పి పంపేడు.

సదరు బాణం గురి తప్పలేదు.

“ఏంటి పిన్నిగారూ! మన మురారి పుట్టినరోజా? ఎప్పుడూ?” అన్నాడు భాస్కర్రావ్.

“రేపు లేదు ఎల్లుండే బాచీ!” విషాదంగా నవ్వింది సౌభాగ్యలక్ష్మి.

అది గమనించి అన్నాడు భాస్కర్రావ్...

“మీరేం వర్రీకాకండి పిన్నిగారూ! వాడి పుట్టినరోజు బ్రహ్మాండంగా చేద్దాం... కొత్తబట్టల్లేముందీ? ఎప్పుడు కావాలంటే అప్పుడు రెడీమేడ్‌లో తీస్కోవచ్చు పోతే పిండివంటలూ గట్రా చెయ్యడానికి సరుకులు ఏమేం కావాలో రాసిస్తే నేను క్షణాల్లో వెళ్లి తెచ్చేస్తాను”

సౌభాగ్యలక్ష్మి మొహమాటంగా నవ్వింది... “ఎందుకులే బాచీ అనవసరంగా నీకు మళ్లీ ఖర్చు? నువ్వొచ్చి నిండా నెల కాలేదు... ఇప్పటికే నీకు చాలా రుణపడిపోయాం”

“అదేంమాట పిన్నిగారూ? నన్నలా పరాయివాడిని చేసి మాట్లాడితే నాకు బాగుండదు. పుట్టినరోజు రమ్మన్నప్పుడల్లా వస్తుందా? మీరింకేం చెప్పకండి. ఈసారి నా తమ్ముడి పుట్టినరోజు నా ఖర్చుతో నేను జరిపిస్తానంతే!”

సౌభాగ్యలక్ష్మి ముఖం మతాబులా వెలిగిపోయింది.

“ఏంటో నాయనా! నీ అభిమానం అదీ చూస్తుంటే బహుశా గత జన్మలో నువ్ మా కన్నకొడుకువేమో అనిపిస్తోంది” అంది ఆప్యాయంగా. అని... “చూశారా చూశారా బాచీ ఏమంటున్నాడో” అంటూ లోపలికి వెళ్లిపోయింది ఆ విషయం భర్తతో చెప్పడానికి.

భాస్కర్రావ్‌కి చాలా తృప్తిగా అనిపించింది ఆవిడ తన్నలా పొగిడినందుకు.

ఆ సాయంత్రం...

చిన్నాని వెంటబెట్టుకుని అమీర్‌పేట వెళ్లాడు భాస్కర్రావ్.

చిన్నా అంటే వేరెవరో కాదు. మురారే! ఇంట్లో వాడ్నంతా అలాగే పిలుస్తారు.

“బట్టలు కొనటానికి ఇంతదూరం దేనికన్నయ్యా? మన సనత్‌నగర్‌లో షాపులే లేనట్టు?” భాస్కర్రావ్ ఓ బట్టల షాపులోకి దారి తీస్తుంటే తన బోడి సందేహాన్ని వ్యక్తం చేశాడు చిన్నా.

“అక్కడికన్నా ఇక్కడైతే మంచిమంచి వెరైటీలుంటాయ్! బర్త్‌డే డ్రెస్సంటే అదిరిపోవాలికదా... అందుకన్నమాట!” వాడినెత్తిన చిన్నగా ఓ మొట్టు మొట్టి చెప్పేడు భాస్కర్రావ్.

“అదిరిపోవడమంటే?”

అదిరిపోయాడు భాస్కర్రావ్.

అయితే ఆ అదిరిపోవడం ఆ కుర్రకుంక వేసిన చొప్పదంటు ప్రశ్నకి కాదు... ఆ కుర్రకుంక ప్రక్కనుండి అదే షాపులోకి హంసగమనంతో ప్రవేశించిన ఓ అందమైన అమ్మాయిని చూసి!





పుట్టి బుద్ధెరిగినప్పట్నుంచి భాస్కర్రావె ప్పుడూ అంత అందమైన అమ్మాయిని చూసుండలేదు!

అబ్బ! ఏమందమేమందం? !

సృష్టిలోని అందమంతా ఈ అమ్మాయి లోనే ఉందా ఏమిటి కొంపదీసి? అను కున్నాడు ఆశ్చర్యంగా!

కళ్లు చెదరడంతో పాటు ఒళ్లు కూడా పుల కరించిపోయింది భాస్కర్రావ్‌కి.

ముఖ్యంగా పిరుదులు దాటిన ఆమె పొడ వాటి జడ అటూ ఇటూ ఊగుతుంటే ఒళ్లు తోపాటు మనసుకూడా పులకరించిపో యింది.

అబ్బ! ఏమిటిది? ఆమెను చూస్తుంటేనే తనువూ మనసూ ఇలా పులకరించిపోతు న్నాయ్‌కదా? అలాంటిది ఆమెను గనుక తాకితే, తాకగలిగితే ఇంకెలా ఉంటుందో? ! అనుకున్నాడు అబ్బురంగా.

ఇరవై నాలుగేళ్ల భాస్కర్రావ్ జీవితంలో అదే మొదటిసారి ఓ అమ్మాయిని చూసి అలా థ్రిల్లైపోవడం!

అబ్బ! ఎంత అందమైన సుకేశిని?

ఈ అందమైన సుకేశినిని ఎవడు చేస్కుం టాడోగాని నిజంగా వాడు ఈ ప్రపంచం లోని మగాళ్లందర్లోకెల్లా అదృష్టవంతుడు.

అలా అనిపించగానే వెంటనే ఇంకోలా కూడా అనిపించింది భాస్కర్రావ్‌కి... ఆ అదృష్టవంతుడు తానే ఎందుక్కాకూడదు అని.

ఆ ఊహకే అతని మనసులో పూలజల్లు కురిసింది!

"నీ మొహానికి అంత అదృష్టమా? చాల్లే ఊర్కో... అయినా నిదానమే ప్రధానమన్న సూక్తిని మర్చిపోయి ఈ లవ్ ఎట్ ఫస్ట్ సైట్ ఏంటి అసహ్యంగా? బుద్ధిలేదూ?" అని అంతరాత్మ సుద్దులు చెప్పబోతుంటే "ఛీ నోర్ముయ్!" అన్నాడు కోపంగా.

"ఇప్పుడు నేనేమన్నానని అలా తిడ్తు న్నావ్?" చిన్నా ఆశ్చర్యంగా చూశాడు భాస్కర్రావ్‌కేసి.

దాంతో భాస్కర్రావ్ ఈ లోకంలో కొచ్చేడు. "సారీ చిన్నా... నిన్నుకాదు. అంతరాత్మని..." అన్నాడు తడబడిపోతూ.

"అంతరాత్మా?"

"అవునంతరాత్మే! బుద్ధీ జ్ఞానం లేకుండా అసహ్యంగా ఏంటేంటో వాగుతోంది..."

భాస్కర్రావ్ మాటలు బొత్తిగా అర్థం కాలేదు చిన్నాకి. పైగా పిచ్చిపిచ్చిగా కూడా అన్పించినై.

"నువ్వేమంటున్నావో అర్థం కావట్లా..." అన్నాడు బుర్రగీరుకుంటూ.

"అర్థం కాకపోవటమే మంచిదిలే... పద పద..." వాడిని రెక్కపట్టి గుంజుకుంటూ తీస్కెళ్లి సుకేశిన్ని సమీపించి ఆమె పక్కగా నిలబడ్డాడు భాస్కర్రావ్.

"ఏం కావాలి సార్?" అడిగాడు సేల్స్ మేన్.

"మా మురారికి రెడీమేడ్ డ్రెస్ కావాలి..." సుకేశినికేసి చూస్తూ సేల్స్‌మే న్‌కి జవాబిచ్చాడు భాస్కర్రావ్.

"అంటే ఈ బాబుకా?"

"అవును..."

"అయితే అక్కడికెళ్లండి. ఇది చీరల సెక్షను" కుడిచేతి చూపుడు వేల్తో ఇంకోవై పుకు చూపుతూ అన్నాడు సేల్స్‌మేన్.

ఒళ్లుమండిపోయింది భాస్కర్రావ్‌కి.

తానిక్కడ నిల్చుంటే వీడి బాబుగాడి సొమ్మేదో పోయినట్టు అక్కడికెళ్లమంటా డేంటి? అనుకున్నాడర్థరహితంగా.

నో... ఆ సుకేశిన్ని విడిచి నేనెక్కడికీ వెళ్లను... అనుకున్నాడావేశంగా.

"ఇది చీరల సెక్షనా? అయినా ఫర్వా లేదు" అన్నాడు తాపీగా.

సేల్స్‌మేన్ వింత జంతువుకేసి చూసి నట్టు చూశాడు భాస్కర్రావ్‌కేసి.

"అదేంటి సార్! అలా అంటారు? ఇక్కడ చీర్లే ఉంటై. రెడీమేడ్ డ్రెస్‌లుండవ్"

"తెలుసులే బాబూ! ఇది చీర్ల సెక్షన్ అని చెప్పేక, ఇక్కడ చీర్లే ఉంటాయని మళ్లీ ప్రత్యేకంగా చెప్పాలా? నాకో చీర కూడా కావాలి. అర్థమైందా? చూపించు..." కించిత్ కోపంగా అన్నాడు భాస్కర్రావ్. అని సుకేశినికేసి అర్థ నిమీలిత నేత్రాలతో చూశాడు.

దాంతో సేల్స్మేన్కి విషయం అర్థమైపోయింది.

'ఛీ... వెధవ బుద్ధులు' అనుకున్నాడు మనసులో.

'నిజంగా కొనే బేరమేనా నాయనా?' అన్నట్టుగా ఓ చూపు చూసి "ఎంతలో కావాలి?" అన్నాడు రవంత క్రోధంగా. అతనికి ఆడపిల్లల్ని లైన్లో పెట్టే వాళ్లంటే ఒళ్లు మంట. ఏడాదిక్రితం అతని చెల్లెల్నెవడో లైన్లో పెట్టి తీరా పెళ్లిమాటెత్తేసరికి తోకఝూడించేశాడు. అఫ్కోర్స్... ఆ తర్వాత ఆమెకు అబార్షన్ చేయించి వేరే అతన్తో పెళ్లి చేసేశారనుకోండి. అది వేరే విషయం.

"మూడు నాలుగొందల్లో చూపించు..." భాస్కర్రావ్ సుకేశిని కేసిచూస్తూ సేల్స్మేన్తో అన్నాడు.

'జులాయి వెధవ' అనుకున్నాడు సేల్స్మేన్ మనసులో.

"ఇదిగో ఇది చూడండి" అంటూ అరలోంచి ఓ అరడజను చీరల్లాగి మడతలు విప్పి భాస్కర్రావ్ ముందు పరిచాడు, అది తన డ్యూటీ కాబట్టి.

"మనం డ్రెస్ కొంటానిక్కదా వచ్చాం. చీరెవరికన్నయ్యా?" అంతవరకూ మౌనంగా ఉన్న చిన్నా నోరు విప్పాడు.

భాస్కర్రావ్ గతుక్కుమన్నాడు గాని బైటికి మాత్రం తేలిపోలేదు. "మీ మమ్మీగార్కిరా" అన్నాడు నవ్వుతూ.

"మమ్మీకెందుకు? మమ్మీకిపుడు బర్త్డే లేదుగా?"

"కానీ నీకుందిగా? నీ బర్త్డే నాడు మీ మమ్మీకూడా కొత్త చీర కట్టుకుంటే బాగానే ఉంటుందిగా?"

'వెధవకి అధిక ప్రసంగాలెక్కువ!' అని మనసులో తిట్టుకుని పైకలా అన్నాడు భాస్కర్రావ్.

ఇదంతా ఓ కంట గమనిస్తూనే ఉన్న సుకేశిని భాస్కర్రావ్కేసి కాస్త సందేహంగా చూసింది.

ఆమె కూడా చీర కొనేందుకే వచ్చిందక్కడికి. సేల్స్మేన్ అప్పటికే ఆమె ముందు కూడా కొన్ని చీరల్ని పరిచాడు. ఆమె వాటిని చూడ్డం మొదలెట్టాకే భాస్కర్రావ్ వచ్చి ఆమె పక్కన నిలబడ్డాడు.

కుర్రాడికి డ్రెస్సంటూ వచ్చిన వాడు ఇప్పుడు చీరలు చూస్తున్నాడూ అంటే సందేహం లేదు. అతన్ని తన అందం ఆకర్షించిందన్నమాట!

అయినా సుకేశినికి కోపం రాలేదు. పైపెచ్చు గర్వంగా కూడా అనిపించింది.

తన అందం సూదంటురాయి లాంటిదని ఆమెకేనాడో తెల్సు. అయినాసరే అదోరకం తృప్తి.

"నా బర్త్డేకి మా మమ్మీ కొత్త చీరకట్టుకోవడం ఏంటి?" చిన్నా అలా అనేసరికి 'మీ నాన్ననిమించిన నసగాడివిరా నువ్వు' అనుకున్నాడు భాస్కర్రావ్ మనసులో.

"కట్టుకోవచ్చు తప్పులేదు" అన్నాడు పైకి. సరే నీ ఇష్టం అన్నట్టు తలెగరేసి ఊరుకున్నాడు చిన్నా.

"నాకు చీరల సెలక్షన్ అంతగా తెలీదు. మీ మమ్మీగార్కి ఏ చీర బావుంటుందో నువ్వే చూడు"

"ఏమో నాకూ తెలీదు" అడ్డంగా తలాడించాడు చిన్నా.

"ఆవిడ బ్లాకా వయిటా?" సేల్స్మేన్ అడిగాడు. అతనికి భాస్కర్రావ్ని చూస్తోంటే ఒళ్లుమండిపోతోంది. కానీ కష్టమర్లమీద అలా ఒళ్లు మండించుకోవడం తన వృత్తి ధర్మానికి విరుద్ధం కాబట్టి ముఖంలో అలాంటి భావాన్ని కన్పించనివ్వ




లేదు.

"వయితే..." అన్నాడు భాస్కర్రావ్.

"అయితే ఈ చీర తీస్కోండి బావుం టుంది..."

"ఆ చీరెంత?" భాస్కర్రావ్ కాదు ఈ ప్రశ్న అడిగింది సుకేశిని.

కోటి వీణలు మీటినట్టు ఎంత బావుందో కంఠం? అనుకున్నాడు భాస్కర్రావ్ తన్మ యంగా. కోటి వీణలు ఒకేసారి మీటితే చెవులు గింగుర్లెత్తిపోతాయన్న సంగతి అత నికా సమయంలో తోచలేదు.

"ఈ చీర మీకు నచ్చిందా? మీరు తీస్కుంటారా? అయితే తీస్కోండి ఫర్వా లేదు..." ని.ప్ర. సూత్రాన్ని తుంగలో తొక్కి 'ఆ. అ. వి' సూత్రాన్ని అర్జంటుగా పాటిం చేస్తూ ఆమెతో మాట కలిపాడు భాస్క ర్రావ్. వచ్చిన అవకాశాన్ని మిస్ చేసుకుంటే మళ్ళీ ఆమెతో మాట్లాడే అవకాశం వస్తుందో రాదోనన్న ఆత్రం అతన్నలా తొందరపడేలా చేసింది.

'ఓరి నీచుడా! పెద్ద త్యాగమూర్తిలా ఎంత పోజు కొడ్తున్నావ్‌రా?' అనుకున్నాడు సేల్స్ మేన్ మనసులో కోపంగా.

"నాకేం అవసరం లేదులెండి. డిజైన్ బాగుందికదాని ఊర్కే అడిగాను..."

పరవశించి పులకరించి చిలకరించి విలక రించి కులకరించి పోయాడు భాస్కర్రావ్ ఆ సుకేశిని తనతో అలా డైరెక్ట్‌గా మాట్లా డినందుకు. అంటే ఏమిటేమిటోగా అయిపో యాడన్నమాట.

"డిజైన్ బాగుంటే మీరే తీస్కోవచ్చుగా. తీస్కోండి ఫర్వాలేదు" అన్నాడు మెలికలు తిరిగిపోతూ.

తీస్కోమంటున్నావ్... బిల్లు నీ బాబు కడ్తాడా, అనుకున్నాడు సేల్స్‌మేన్ మన సులో కసిగా. సందు దొరికితే చాలు అంద మైన ఆడపిల్లల్ని మాయచేయటానికి ప్రయ త్నిస్తారీ మగవెధవలు! అని కూడా అనుకు న్నాడు. తానూ ఒక మగవెధవే అన్న సంగతి మర్చిపోయి.

"డిజైన్ బాగుందిగాని, బ్రాడ్ డిజైన్ కాబట్టి నాలా సన్నగా ఉన్నవాళ్లకి బావుం డదు. కొంచెం లావుగా ఉన్నవాళ్ళకి బావుం టుంది"

భాస్కర్రావ్ మళ్ళీ పులకరించి చిలకరించి విలకరించి కులకరించిపోయాడు.

'నిన్ను తెగ్గొయ్యా! ఎందుకురా అలా ఏమి టేమిటోగా అయిపోతావ్? నీకు అక్కాజెల్లెళ్ళ లేరా?' అనుకున్నాడు సేల్స్‌మేన్ మనసు లోనే మంటగా. కందకు లేని దురద కత్తి పీటకు రావడమంటే అదే.

"మమ్మీగారు అంటే మా పిన్నిగారు కూడా కొంచెం లావుగానే ఉంటార్లెండి. మీరు చెప్తున్నారు కాబట్టి ఈ చీరే తీసుకుం టానైతే" అన్నాడు భాస్కర్రావ్ ముఖమంతా నవ్వు పులిమేసుకుంటూ.

"ఇది మరీ బావుంది. నేను చెప్పడ మేంటి? మీ పిన్నిగారు... మీ ఇష్టం" అని ముఖం పక్కకు తిప్పేసుకుంది సుకేశిని.

భాస్కర్రావ్ మనసు పగిలిపోయి విగిలి పోయి చిగిలిపోయి తగిలిపోయినట్టుగా అనిపించింది, ఆమె సడన్‌గా అలా ముఖం పక్కకు తిప్పేసుకునేసరికి.

"మేడమ్... మీ సెలక్షన్ మీరు కాని వ్వండి. ఆయన సంగతి ఆయన చూసుకుం టార్లే..." అంటూ మరో అరడజను చీరెల్ని ఆమెముందు పడేశాడు సేల్స్‌మేన్.

అతనికి ఆమెలో తన చెల్లెలే కన్పిస్తోంది.

"కుళ్ళుజోకు చచ్చినోడా" అని పైకయితే తిట్టలేదుగాని తిట్టినట్టుగానే చూశాడు భాస్కర్రావ్, ఆ నీచనికృష్ట దరిద్రగొట్టు చండాలపు సేల్స్‌మేన్‌ని.

"ఊс... మీరు కానివ్వాల్సిర్! చెప్పండి దీన్ని ప్యాక్ చేయమంటారా?"

సేల్స్‌మేన్ అలా అడిగేసరికి 'ఏంచెయ్య మంటావ్ సుకేశీ?' అన్నట్టుగా సుకేశినివైపు చూశాడు భాస్కర్రావ్.

కానీ బ్యాడ్‌లక్. ఆమె ఇతనికేసి చూడ్డం లేదు. తన ముందున్న చీరల్ని పరిశీలిస్తూ ఉంది.

"లావుగా ఉండేవారికి ఆ డిజైన్ బావుంటుందని వారు చెప్పారుగా. దాన్నే ప్యాక్ చేయ్..." సుకేశిని వినాలని కాస్త గట్టిగానే అన్నాడు భాస్కర్రావ్.

అయినా ఆమె పట్టించుకోలేదు.

సేల్స్‌మేన్ అర్జంట్‌గా ఆ చీరని ప్యాక్ చేసి, బిల్ రాసి డూప్లికేట్ భాస్కర్రావ్‌కిచ్చి, "క్యాష్ కౌంటర్లో కట్టండి. చీర కౌంటర్లో కలెక్ట్ చేస్కోండి" అంటూ ఒరిజినల్ బిల్‌ని ఆ ప్యాకెట్‌కి స్టాపులర్‌తో పిన్ చేశాడు.

"అబ్బాయికేదో డ్రెస్ కావాలన్నారుగా... అది కూడా తీస్కోండి అక్కడికెళ్ళి..."

'ఎందుకురా అలా తరుముతావ్?' అనుకున్నాడు భాస్కర్రావ్ మనసులో ఆవేదనగా.

అంతలో మరో ముగ్గరాడాళ్ళు అక్కడికి రావడంతో, 'ఇక తమరు దయచేయొచ్చు' అన్నట్టు సేల్స్‌మేన్ వికారంగా చూడ్డంతో కదల్లేక కదల్లేక కదిలేడక్కణ్నుంచి.

'రెడీమేడ్' సెక్షన్‌లో చిన్నాకో డ్రెస్ సెలక్ట్ చేసి, క్యాష్ కవుంటర్ దగ్గరకొచ్చిన భాస్కర్రావ్‌కి చీరల సెక్షన్‌లో సుకేశిని కన్పించలేదు.

"ఏమైపోయావ్ సుకేశినీ? ఆడాళ్ళ సెలక్షన్ ఒకపట్టాన తెమల్దంటారే అలాంటిది అప్పుడే నువ్ చీర సెలక్ట్ చేసుకుని బిల్ కట్టేసి వెళ్ళిపోయావా? " అనుకున్నాడు ఆవేదనగా.

కవుంటర్లో బిల్లులు పేచేసేసి, ప్యాకెట్లు తీసుకుని, చిన్నాతో సహా ఆ షాపులోంచి బయటపడ్డ భాస్కర్రావ్ ఆత్రంగా అటూ ఇటూ చూశాడు సుకేశిని ఎక్కడన్నా కనిపిస్తుందేమోనని.





కానీ ఎక్కడా కన్పించలేదు.

'నా దేవి ఏ ఆటోలో వెళ్ళిపోయిందో?' అనుకున్నాడు బాధగా.

'నా దేవి దర్శనం మళ్ళీ ఎప్పుడో?' అనుకున్నాడు ఆవేదనగా.



చిన్నాకి డ్రెస్సే కాకుండా భాస్కర్రావ్ తనక్కూడా చీర తేవడం చూసి మురిసిపోయింది సౌభాగ్యలక్ష్మి.

ఆమెలో అతనిపట్ల మాతృప్రేమలాంటిది పొంగిపొర్లిపోయింది.

"ఇప్పుడు నాకెందుకయ్యా చీర అనవసరంగా ఖర్చు" అంది అతనికేసి ఆప్యాయంగా చూస్తూ.

"భలేవారే పిన్నిగారూ! తల్లికోసం బిడ్డ ఖర్చు చేయడం తప్పా? చిన్నా బర్త్‌డేనాడు మీరు కూడా కొత్తచీర కట్టుకుంటే బావుంటుందని నాకెందుకో అనిపించింది. అంతే కొనేశాను..." తేలిగ్గా అనేశాడు భాస్కర్రావ్ తన ఘనతను తానే తీసిపారేసుకుంటూ.

ఆ సమయంలో అక్కడ వరహాల్రాజు లేడుగాని, ఉండుంటే, "మరి నా మాటో? చిన్నాగాడి బర్త్‌డేనాడు నేను కూడా కొత్తబట్టలు తొడుక్కుంటే బాగానే ఉంటుందనుకుంటాకదా? పన్లోపనిగా ఇంటిల్లిపాది మీ కొత్తబట్టలు తొడుక్కుంటే ఇంకా బావుంటుందేమోకదా?" అని ఉండేవాడు.

ఆవిధంగా చూస్తే ఆ సమయంలో వరహాల్రాజక్కడ లేకపోవడం భాస్కర్రావ్ అదృష్టమనే అనుకోవాలి.

ఆ రాత్రి వరహాల్రాజు డ్యూటీనుండి రాగానే సౌభాగ్యలక్ష్మి అతనికి బాచీ కొన్న కొత్త చీరని చూపిస్తూ... నిజంగా రత్నంలాంటి కుర్రాడండీ! ఇంత మంచి కుర్రాడు అయినవాళ్ళందర్నీ కోల్పోయి అనాధగా మారిపోవడం..." అని ఇంకా ఏదో చెప్పబోతుంటే "మన అదృష్టం" అంటూ పూర్తి

చేశాడు వరహాల్రాజు.

"ఛ... ఊర్కోండి అవ్వేం మాటలు!!" అంది మందలింపుగా సౌభాగ్యలక్ష్మి

"చేదుగా ఉన్నా నిజం నిజమే సౌభాగ్యా! అతనికి అయినవాళ్ళంటూ ఎవరూ లేకపో బట్టేకదా... మనమీద ఇంత అభిమానాన్ని ప్రేమనీ చూపిస్తున్నాడు" అన్నాడు వరహా ల్రాజు.

'అవునంతే కదా?' అనుకొంది సౌభాగ్య

సరిగ్గా అదే సమయంలో అక్కడ భాస్క ర్రావ్...

అంటే తన రూమ్‌లో భాస్కర్రావ్...

"నూరు ఆరైనా ఆరు నూరైనాసరే... సిటీ అంతా గాలించైనాసరే... ఆ సుకేశిన్ని మళ్ళీ ఎలాగైనా కలుసుకోవాలి... ఆమె ఇల్లె క్కడో తెలుసుకోవాలి" అనుకున్నాడు మన సులో.

అప్పటికది నాలుగోసారో, అయిదోసారో- అతనలా ప్రతిజ్ఞ చేసుకోవటం.

అంటే ఇంకా సందేహమేముంది?

అతను ప్రేమలో పడిపోయాడన్న మాటేగా?

మర్నాడు పొద్దున్న భాస్కర్రావ్‌ని పలక రించడానికి అతని రూముకెళ్ళిన వరహా ల్రాజు...

భాస్కర్రావ్ ముఖంలోకి చూస్తూనే కంగారుపడిపోయాడు.

"ఏంటి బాచీ? ఏమైంది నీకు?" అన్నా డాందోళనగా.

"నాకా? నాకేమైందీ? నేను బాగానే ఉన్నానుగా?"

భాస్కర్రావ్ రవంత అయోమయంగా ముఖం పెట్టి అలా అంటుంటే "చాల్లే ఊర్కో" అంటూ కసిరాడు వరహాల్రాజు. "కళ్ళు చూడు జ్యోతుల్లా ఎలా ఎర్రగా ఉన్నాయో? ముఖం చూడు పద్నాలుగు లంఖణాలు చేసిన వాడిలా పీక్కుపో యింది..."

"నిజమా?" అంటూ గభాల్న వెళ్ళి అద్దంలో ముఖం చూసుకున్న భాస్కర్రావ్ 'నిజమే' అనుకున్నాడు మనసులో.

"ఏమైంది నీకు? జ్వరంగానొచ్చిందా! రాత్రంతా తలనొప్పితో నిద్రలేకుండా బాధప డ్డావా? అసలే సీజన్ బాగాలేదు, అదేదో వైరస్ ఫీవరట! సిటీ అంతా బాగా ప్రబలి పోయింది. నల్లకుంట ఫీవరాస్పటల్లో కూడా అలాంటి కేసులేనట. నిన్న పేపర్లో కూడా వేశారు. అంతెందుకూ... మా జీడిమెట్ల డిపోలోనే ప్రస్తుతం ఆరుగురు కండక్టర్లు వైరస్ ఫీవర్‌తో బాధపడుతున్నారు. ఎన్ని మందులు వాడినా తగ్గటం లేదట. ఏమైనా సరే నెగ్లెక్ట్ చేయటం మంచిదికాదు. పద వెంటనే హాస్పటల్‌కి వెళ్దాం..."

వరహాల్రాజు ఇదైపోతుంటే, "అబ్బ! ఆపండి బాబాయ్‌గారూ మీ నస!" అని అర వాలనిపించింది భాస్కర్రావ్‌కి. కానీ నిగ్ర హించుకున్నాడు.

'ఇదెక్కడి చిత్రమైన మనిషో! ఒక్కోసారి బాగానే ఉంటాడు ఒక్కోసారి నసవాగుడు వాగుతుంటాడు?' అనుకున్నాడు మన సులో.

ఆ మాట నిజమే! వరహాల్రాజు సర్వకాల సకలావస్థల యందూ నసవాగుడు వాగడు- ఒక్కోసారి మామూలుగానే ఉంటాడు.

నసెలర్జీకొద్దీ ముందలా చిరాగ్గా ఫీలైనా అంతలోనే మురిసిపోయాడు భాస్కర్రావ్, బాబాయ్‌గారు తన ఆరోగ్యంపట్ల చూపి స్తున్న శ్రద్ధకి.

"అనవసరంగా కంగారు పడకండి. బాబా యిగారూ! నా ఆరోగ్యం బాగానే ఉంది. నాకేమీ కాలేదు. ముఖ్యంగా వైరస్ ఫీవరూ గట్రా ఏమీ రాలేదు..." అన్నాడు నవ్వేస్తూ.

"మరి మొహం ఎందుకలా పీక్కుపో యింది? కళ్ళెందుకలా ఎర్రబడ్డాయ్?"

"అదా... అదీ అదీ..." నీళ్ళు నమిలాడు





భాస్కర్రావ్. అవును మరి నీళ్లు నమలక పోతే అసలు నిజం ఎలా చెప్పగలడు?

రాత్రంతా ముక్కూ మొహం తెలీని... కాదు కాదు పేరూ అడ్రస్సూ తెలీని ఓ 'సుకేశిని' గురించి ఆలోచిస్తూ తాను నిద్రకు దూరమయ్యాడనీ, అందుకే తన వాలకం అలా తయారయ్యిందనీ ఎలా చెప్పగలడు?

చెబితే బాబాయ్‌గారు నవ్విపోడూ?

అందుకే "ఏంలేదు బాబాయ్‌గారూ!" అనేశాడు నీళ్లు నమలడం అయ్యాక.

కానీ వరహాల్రాజు వదల్లేదు.

"ఏమీ లేకపోవడవేంటి? ఏదో ఉంది... చెప్పు..." రెట్టించి అడిగాడు.

"ఏం లేదు. బాబాయ్‌గారూ! ఎందుకో గాని రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదు. నిద్రలేమి వల్ల ముఖం అలా అయ్యిందంతే!"

భాస్కర్రావ్ చెప్పిన ఆ సింపుల్జవాబుకి శాటిస్‌ఫై కాలేదు వరహాల్రాజు. "రోజూ బాగానే నిద్రపోతున్నావ్‌గా? మరి రాత్రెందుకు నిద్రపట్టలేదు? " అన్నాడదోలా చూస్తూ.

"ఏమో బాబాయ్‌గారూ! నాకు మాత్రం ఏం తెల్సు? " అని తప్పించుకోబోయాడు భాస్కర్రావ్.

కానీ వరహాల్రాజు జిడ్డులా వదల్లేదు.

"నో... అకారణంగా నిద్రపట్టకపోవడం జరగదెవ్వరికీ. ఏదన్నా మనోవేదన గానీ, లేదా ఒంట్లో నలతగా ఉండటంగానీ జరిగితేనే నిద్రకు దూరమౌతారెవరైనా! ఎందుకన్నా మంచిది డాక్టర్ దగ్గరికెళ్దాం పద...' ' అంటూ భాస్కర్రావ్‌ని జబ్బ పట్టి లేవదియ్యబోయాడు.

భాస్కర్రావ్ అడ్డంగా తలాడించాడు. "లేదు బాబాయ్‌గారూ నాకేం కాలేదు. నామాట నమ్మండి. నన్ను వొదిలేయండి" అన్నాడు దీనంగా.

అంతలో ఏదో పనిబడి వరండా మీదకొచ్చిన సౌభాగ్యలక్ష్మి వీళ్ళిద్దర్నీ చూసి అక్కడికొచ్చింది.

"ఏంటి బాచీ? ఏమైంది? " అంది పలకరింపుగా.

భాస్కర్రావింకా నోరు విప్పకముందే వరహాల్రాజందుకున్నాడు. "చూడు సౌభాగ్యా! డాక్టర్ దగ్గరికెళ్దాం అంటే రానని బాచీ ఎలా మొండికేస్తున్నాడో..." అన్నాడు తలా తోకా లేకుండా.

"ఏంటి బాచీకి జ్వరంగానొచ్చిందా? " అంటూనే భాస్కర్రావ్‌కేసి తేరిపార జూసిన సౌభాగ్యలక్ష్మి గాభరా పడిపోయింది. "అరెరె ఏంటయ్యా అలా అయిపోయావ్? రాత్రిదాకా బాగానే ఉన్నావ్‌గా!"

"ఇప్పుడూ బాగానే ఉన్నాను పిన్నిగారూ! నాకేం కాలేదు. బాబాయ్‌గారు ఊరికినే రాద్ధాంతం చేస్తున్నారు" అన్నాడు భాస్కర్రావ్ నవ్వేస్తూ.

"ఎందుకయ్యా అలా బొంకుతావ్? ముఖమంతా ఎలా పీక్కుపోయిందో చూడు. రాత్రి ఎన్ని గంటలప్పుడొచ్చింది జ్వరం? మమ్మల్నెందుకు లేపలేదు? " మందలింపుగా అంది సౌభాగ్యలక్ష్మి భాస్కర్రావ్‌కి జ్వరం రావటం నిజమేననుకుని.

'చచ్చాంపో. ఒకరికి ఇద్దరయ్యారన్న మాట' అనుకున్నాడు భాస్కర్రావ్.

"నిజం చెప్తుంటే నమ్మరేంటి పిన్నిగారూ? నాకు జ్వరమూ రాలేదు. నీరసమూ రాలేదు. కాకపోతే రాత్రి నిద్రపట్టనందువల్ల ముఖం కాస్త వాడిందంతే" అన్నాడు మళ్ళీ నవ్వేస్తూ.

"నిద్ర ఎందుకు పట్టలేదు? ఆరోగ్యం బాగుంటే నిద్ర ఎందుకు పట్టదు? " నిగ్గదీస్తున్నట్టుగా అన్న వరహాల్రాజు... 'ఎలా ఉంది లాజిక్కు? ' అన్నట్టుగా చూశాడు భార్యకేసి.

"మరే" అంది సౌభాగ్యలక్ష్మి.

భాస్కర్రావ్‌కి మతిపోయినట్లయింది వాళ్ళ అభిమానానికి.

కొంపదీసి వీళ్లిద్దరూ తనని కాళ్లూ చేతులూ కట్టి బలవంతంగా డాక్టర్ దగ్గరికీ

డ్చుకుపోరుగదా? అన్న సందేహం కూడా తలెత్తింది అతనిలో.

నిజంగా తానెంత అదృష్టవంతుడు?

తన ముఖం కొద్దిగా వాడినందుకే వీళ్లిద్దరూ ఇంతగా ఇదైపోతున్నారూ అంటే... నిజంగా ఇది ఏ జన్మలోని రుణానుబంధమో? అని కూడా అనిపించింది అతనికి.

ఆ తర్వాత తనకేమీ కాలేదనీ, తన ఆరోగ్యం బాగానే ఉందనీ ఆ దంపతుల్ని నమ్మించడానికి అతనికి తల ప్రాణం తోక్కొచ్చినంతపనైంది.

అన్నట్టు ఒక్కోసారి దిష్టితగలడంవల్ల కూడా ఇలా జరుగుతుంటుంది బాబీ! నిన్న నీ మీద ఏ పాపిష్టిముండ కళ్లుపడ్డాయో? త్వరగా స్నానం చేసిరా... నాలుగు ఎండు మిరపకాయలు దిగదుడిచి పారేస్తాను" అంది సౌభాగ్యలక్ష్మి చివర్లో.

ఆ మాటలకి మాత్రం భాస్కర్రావ్ చాలా బాధపడ్డాడు.

"హుం... ఎంత మాటన్నారు పిన్నిగారూ! నా దేవిని నా సుకేశిని- పాపిష్టి ముండంటారా? " అనుకున్నాడు మనసులో ఆవేదనగా.

కానీ పైకి మాత్రం ఓ జీవంలేని నవ్వు నవ్వేసి ఊరుకున్నాడు.

ఓ అరగంట తర్వాత సౌభాగ్యలక్ష్మి అన్నట్టుగానే అతనికి ఎండు మిరపకాయలతో దిష్టితీసిపారేసింది.

ఆమెతో అలా దిష్టితీయించుకుంటున్నప్పుడు తన హృదయేశ్వరికి తానేదో ద్రోహం చేస్తున్న ఫీలింగ్ కలిగింది భాస్కర్రావ్‌కి.

"నన్ను మన్నించు సుకేశ్! ఈ పిన్నిగారి పోరు పళ్ళేక ఇలా దిష్టి తియ్యించుకుంటున్నానే తప్ప, నీవి దిష్టికళ్లు కావనీ, నీవు పాపిష్టిదానివి కావనీ నాకు తెలీదా ఏంటి?'' అనుకున్నాడు మనసులో బాధగా.

అతన్లో ప్రేమపిచ్చి ముదిరిపోయిందనటా, నికి ఆ మాత్రం చాలు!

మొత్తానికి అలా ప్రారంభమైన ఆరోజు- చిన్నాగాడి బర్త్‌డే సందడివల్ల బాగానే గడిచిపోయింది.

ఆ సందట్లో పడి సమయాభావంవల్ల భాస్కర్రావ్ ఆరోజు తన ప్రియ సుకేశినిని నూట అరవైనాలుగు సార్లకన్నా ఎక్కువ సార్లు తల్చుకోలేకపోయాడు. అందుకతను చాలా గిల్టీగా కూడా ఫీలయ్యాడు.

★ ★ ★

అర్ధరాత్రి పన్నెండు గంటల సమయం.

గోడకున్న క్వార్జ్ వాల్‌క్లాక్ చేస్తున్న టికిక్... టికిక్...' శబ్దం తప్ప ఇంట్లో మరే ధ్వనీ రావడంలేదు.

భాస్కర్రావ్ రూంలో మాత్రం ఇంకో ధ్వని కూడా వస్తోంది. అది భాస్కర్రావ్ గుండె కొట్టుకుంటున్న చప్పుడు.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో...

బెడ్‌లైట్ వెలుతుర్లో... చాపమీద బాసింపట్లు వేసుక్కూర్చున్న భాస్కర్రావ్ మనోఫలకంమీద సుకేశిని అందంగా నవ్వుతూ ఉంది.

పది గంటలప్పుడు రూమ్‌లోజేరి తలుపేసుకున్న భాస్కర్రావ్ అప్పట్నించి ఇప్పటిదాకా తన మనోఫలకంపై ఆమెనలా చూస్తూనే ఉన్నాడు...

అతని ఫోజు ధ్యానముద్రలో ఉన్న యోగిలా ఉన్నప్పటికీ మనసు మాత్రం యోగి మనసులా నిశ్చలంగా ఏంలేదు.

పైపెచ్చు చిక్కిరిబిక్కిరి ఆలోచనలతో కల్లు తాగిన కోతిలా గంతులేస్తూ ఉంది.

ఎంత అందమైన సుకేశిని?!

ఈ అందాల రాశి నామధేయం ఏమై ఉండవచ్చు?!

పువ్వులాంటి అమ్మాయి కాబట్టి పుష్ప అయి ఉండవచ్చు లేదా చందమామలాంటి అమ్మాయి కాబట్టి చంద్రిక అయి ఉండవచ్చు కాదంటే కోమలమైన శరీరం కలిగిన యువతి కాబట్టి కోమలి కూడా అయి ఉండవచ్చు అదీకాదంటే నిర్మలమైన





మనసుగలది కాబట్టి నిర్మల కూడా అయి ఉండవచ్చు.

సుకేశిని పేరు గురించి భాస్కర్రావ్ మనసు ఇలా పరిపరివిధాల ఊహాగానాలు చేస్తుంటే...

"నీ బొంద కూడా అయి ఉండవచ్చు నీ పిండాకూడు కూడా అయి ఉండవచ్చు నీ శ్రార్ధం కూడా అయి ఉండవచ్చు" అంటూ నోరు విప్పింది అతని అంతరాత్మ.

"వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్?" అంది భాస్కర్రావ్ మనసు కోపంగా.

"లేకపోతే ఏంటి? ఆమె పువ్వులాంటి దన్నావ్ ఓకే. ఆమె చందమామలాంటి దన్నావ్ ఓకే. ఆమె కోమలమైన శరీరం కలిగిన యువతన్నావ్ ఓకే. ఆమె బాహ్యా సౌందర్యం గురించి నీకు తెలుసు కాబట్టి ఆమెను నువ్ దేనితో పోల్చినా తప్పులేదు. కానీ... ఆమె మనసు గురించి నీకేం తెలుసని ఆమెది నిర్మలమైన మనసంటున్నావ్"

"జస్ట్ అవుటాఫ్ కామన్‌సెన్స్. అంత అందమైన యువతికి తప్పకుండా నిర్మలమైన మనసే ఉంటుంది కాబట్టి..."

"షటప్! అందమైన యువతులకు కంపల్సరీగా నిర్మలమైన మనసుంటుందని ఎక్కడన్నా రూలుందా? ఏం... ఆమెది కల్మషమైన మనసు ఎందుక్కాకూడదు?"

"వాగకు! చంపుతా! అంత అందమైన యువతికి అసహ్యంగా కల్మషమైన మనసెందుకుంటుంది? కచ్చితంగా నిర్మలమైన మనసే ఉంటుంది..."

"ఏడిశావ్... ఆమె అందాన్ని చూసి కళ్ళు తిరిగిపోయి తెగులు రేగి ఏంటేంటో ఊహించేసుకుంటున్నావ్ అసహ్యంగా. అయినా నీకిదేం పొయ్యేకాలం? ఒకే ఒక్కసారి చూసిన ఆ అమ్మాయిని బుర్రా బుద్ధీ లేకుండా అప్పుడే ఇంతగాఢంగా ప్రేమించేయడమేంటి? ముందు వెనకా ఆలోచించే పన్లేదా? 'ని.ప్ర' సూత్రాన్ని పాటించాలన్న ఇంగితం లేదా?"

"గో టు హెల్ విత్ యువర్ బ్లడీ ని.ప్ర. సూత్రం! చూసింది ఒక్కసారే అయితేనేం? ఆ ఒక్క చూపులోనే మా ఇద్దరిదీ వేయిజన్మల బంధమని అర్థమైపోయింది! ఆమె లేకుండా నేను జీవించలేను... ఆమెను ఎలాగైనా వెతికి పట్టుకుని, ఎలాగైనా ఆమె హృదయాన్ని జయించి, ఎలాగైనా సరే ఆమెను నా సొంతం చేస్కుంటాను..."

"... ..."

"... ..."

"... ..."

మనసూ అంతరాత్మల సంవివాదం తెల్లవార్లూ అలా కొనసాగుతూనే ఉంది.

తెల్లతెల్లవార్తుండగా ఇంక నిద్రనాపుకోలేకపోయిన భాస్కర్రావ్ వెనక్కి విరుచుకు పడిపోయాడు.



రెండో రాత్రి కూడా నిద్రలేకపోవటంవల్ల భాస్కర్రావ్ కళ్ళు అగ్నిగోళాల్లా అయిపోవడమే కాకుండా, ముఖం మరింతగా పీక్కుపోయి నిజంగానే జ్వరమొచ్చేసిందీసారి.

ఆషామాషీ జ్వరంకాదు. నూటైదు డిగ్రీల జ్వరం.

ఉదయం ఎనిమిదవుతున్నా భాస్కర్రావ్ రూమ్‌లోంచి బైటికి రాకపోవడం చూసి తలుపుమీద దబదబా బాత్తూ "బాచీ బాచీ' అంటూ పిలిచాడు వరహాల్రాజు.

నాలుగైదు పిలుపుల తర్వాత... తలుపులు తెరుచుకున్నై.

కానీ తలుపుల్ని తెరిచిన భాస్కర్రావ్ మాత్రం గడపదగ్గరే కుప్పగా కూలబడిపోయాడు.

"అరెఁ ఏంటి బాచీ? ఏమైందీ?" అంటూ అతన్ని పట్టుకున్న వరహాల్రాజు హడిలిపోయాడు ఆ వేడికి.

"నిన్న నేను చెప్తే విన్నావా? ఇప్పుడు చూడు ఒళ్ళెలా మండిపోతోందో..." అంటూ నస ప్రారంభించపోయాడు గాని, అంతలోనే మనసు మార్చేసుకుని "సౌభాగ్యా సౌభాగ్యా" అంటూ ఇంట్లోకి పరుగుతీశాడు.

విషయం తెలుసుకున్న సౌభాగ్యలక్ష్మి పరుగుపరుగున వచ్చి భాస్కర్రావ్‌ని చూసింది. అతని నుదుటిమీద చేయివేసి కెవ్వుమని అరిచింది.

ఆ తర్వాత వరహాల్రాజుని తరిమినంత పన్జేసి బైటికి పంపించింది డాక్టర్ని పిల్చుకు రమ్మని.

ఓ అరగంటలో డాక్టర్‌తోసహా తిరిగొచ్చాడు వరహాల్రాజు.

డాక్టర్ భాస్కర్రావ్‌ని పరీక్షించి, ఓ రెండు ఇంజక్షన్లిచ్చి, "టెంపరే..్ చాలా హెవీగా వుంది... తడి గుడ్డతో మాటిమాటికీ ఒళ్ళు తుడుస్తూండ(ండి... సాయంత్రానికల్లా టెంపరేచర్ తగ్గొచ్చు బహుశా. నేను మళ్ళీ సాయంత్రం వచ్చి చూస్తాను" అంటూ ఇంకేవో మాత్రలు కూడా రాసి... "ఈ మాత్రలు కూడా మింగించండి..." అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత...

తడిగుడ్డతో ఒళ్ళు తుడిచే కార్యక్రమాన్ని వరహాల్రాజు చేపట్టగా... సౌభాగ్యలక్ష్మి భాస్కర్రావ్ తలదగ్గరే కూర్చుని మూలిగినప్పుడల్లా చేత్తో నుదుటిమీద రుద్దసాగింది.

ఆ సమయంలో భాస్కర్రావ్ దాదాపు స్పృహలో లేడనే చెప్పాలి.

మధ్యాహ్నం పన్నెండు దాటుతుండగా టెంపరేచర్ కాస్త తగ్గి స్పృహలోకొచ్చిన భాస్కర్రావ్ తనకు సేవలు చేస్తున్న వరహాల్రాజు దంపతుల్ని చూసి సిగ్గుపడిపోయాడు.

"నాకు కొంచెం జ్వరమొచ్చినట్టుంది కదూ?" అన్నాడు లేవటానికి ప్రయత్నిస్తూ.

"అరెఁ... ఏంటి బాబాయ్‌గారూ ఇదంతా..." అన్నాడు తడిగుడ్డతో తన ఒళ్ళు తుడుస్తున్న వరహాల్రాజుని వారించడానికి ప్రయత్నిస్తూ.

సౌభాగ్యలక్ష్మి అతన్ని మళ్ళీ వెనక్కి గుంజి పడుకోబెడ్తూ ... "పడుకో బాచీ లేవొద్దు..." అంది అతని తలమీద చేయి వేసి నిముర్తూ.

వాళ్ళు తన పట్ల చూపుతున్న ఆదరాభిమానాలకు భాస్కర్రావ్ కళ్ళు చెమ్మగిల్లినై.

★ ★ ★

ఆ తర్వాత మూడ్రోజులకుగాని మళ్ళీ మామూలు మనిషి కాలేకపోయాడు భాస్కర్రావ్.

జ్వరం మర్నాటికల్లా తగ్గిపోయినా నీరసం తగ్గడానికి నిండా మూడ్రోజులు పట్టింది.

ఆ మూడ్రోజులూ వరహాల్రాజు దంపతులే కాకుండా వాళ్ళ ముగ్గురు పిల్లలు కూడా తన ఆరోగ్యంపట్ల ప్రదర్శించిన శ్రద్ధని, తనకు చేసిన సేవల్నీ చూసి ఆశ్చర్యపోయాడు భాస్కర్రావ్.

వాళ్ళు తనని పరాయివాడిగా చూడ్డం లేదన్న నిజం అప్పుడే అర్థమైందతనికి.

డబ్బులు తీసుకుంటే మాత్రం ఈ రోజుల్లో అంత అభిమానంగా చూసేవాళ్ళు ఎవరుంటారు?

అతని మనసు ఆ కుటుంబ సభ్యులపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది.

నాలుగోనాడు ఒంట్లో కాస్త సుమారుగా అనిపించి అతను బయటకి వెళ్ళడానికి సిద్ధ





పడుతుంటే... "ఎక్కడికీ?" అంటూ కళ్లెర్రజేసింది సౌభాగ్యలక్ష్మి.

'నా సుకేశిన్ని వెతుక్కోవడానికి' అని ఆమెతో ఎలా చెప్పగలడు?

అందుకే చటుక్కున అబద్ధమాడేశాడు "జ్వరం తగ్గిపోయిందిగా పిన్నిగారూ! ఇవ్వాళ పేపర్లో ఓ వాకిన్ ఇంటర్వ్యూ గురించి పడింది... అలా పోయి దాని సంగతేమిటో చూసొద్దామని" అంటూ.

"చాల్లే ఊర్కో... మొన్నటిదాకా మూసిన కన్ను తెరవలేదుగాని అప్పుడే ఊరిమీదకి బయల్దేరావా? ఎంత నీరసంగా ఉన్నావో ఒకసారి అద్దంలో చూసుకో. తిరుగుడువల్ల మళ్ళీ జ్వరం గాని తిరగబెడితే ఇంకేవన్నా ఉందా? అదేం కుదర్దు బోడి ఇంటర్వ్యూ పోతే పోనీ... నువ్వింకో నాల్రోజులు రెస్ట్ తీస్కోవాల్సిందే" మందలింపుగా అంది సౌభాగ్యలక్ష్మి.

ఆ మందలింపు వెనక ఉన్న అభిమానం అర్థమవుతూనే ఉన్నా ఒళ్ళు మండిపోయింది భాస్కర్రావ్‌కి.

ప్రేమ మైకంలో ఉన్నవాడికి యుక్తాయుక్తజ్ఞానం నశించిపోవడం సహజమే కదా?

"హు ఎందుకు పిన్నిగారూ నన్నిలా కాల్చుకుతింటారు? నేను నా సుకేశిన్ని వెతుక్కోవాలి... నన్ను వెళ్ళనివ్వండి..." అనుకున్నాడు మనసులో. పైకే అనాలన్నంతగా ప్రేమమైకం పేట్రేగి పోయింది గాని, ఎలాగో అతిబలవంతాన్న నిగ్రహించుకున్నాడు.

"అబ్బే జ్వరం మళ్ళీ ఎందుకు తిరగబెట్టుంది పిన్నిగారూ? నా కెప్పుడూ అలా తిరగబెట్టదు" అన్నాడు అర్థరహితంగా.

"తిరగబెట్టదని గ్యారంటీ ఏముంది? పెద్దదాన్ని నేనెందుకు చెప్తున్నానో కాస్త ఆలోచించుకో..." నువ్ వెళ్ళడానికి వీల్లేదు గాక వీల్లేదన్నట్టుగా చూస్తూ అంది సౌభాగ్యలక్ష్మి.

"నథింగ్ డూయింగ్! నేను వెళ్ళే తీర్తాను. వెళ్ళి నా దేవిని అన్వేషించుకుంటాను" అని గట్టిగా అరవాలనిపించింది భాస్కర్రావ్‌కి.

కానీ నిగ్రహించుకున్నాడు.

అవును- కాదులకు మధ్యస్తంగా తలూపి ఊరుకున్నాడు అప్పుడు.

అప్పుడు పేల్చింది సౌభాగ్యలక్ష్మి బాంబు.

"సరేగాని బాచీ... సుకేశిని ఎవరు?"

అదిరి పోయాడు భాస్కర్రావ్...

ఏమిటీ వింత? సుకేశిని గురించి ఈవిడకెలా తెల్సిపోయింది? కొంపదీసి ఈవిడగ్గాని ఏమైనా అతీంద్రియ శక్తులున్నాయా? !! అనుకున్నాడాశ్చర్యంగా.

ఆ మాటే పైక్కూడా అన్నాడు.

"సుకేశిని గురించి నేను చెప్పకుండానే మీకెలా తెలిసింది పిన్నిగారూ? మీకేవన్నా మంత్రాలుగాని వచ్చా?"

"నీ మొహం? సుకేశినీ సుకేశినీ అంటూ నిన్నామొన్నా జ్వరంతో నువ్ వందసార్లు కలవరించేవ్..."

సౌభాగ్యలక్ష్మి అసలు విషయం చెప్పడంతో 'అదన్నమాట సంగతి'అనుకున్నాడు భాస్కర్రావ్. "నిజంగానా పిన్నిగారూ?" అన్నాడు ముఖంలోకి ఆశ్చర్యాన్ని తెచ్చిపెట్టుకుంటూ.

"కాదబద్ధం" వెటకరించింది సౌభాగ్యలక్ష్మి. "చెప్పు బాచీ! ఎవరామె?"

ఏం చెప్పాలో తోచలేదు భాస్కర్రావ్‌కి.

నిజం చెప్పలేదు కదా!?

ఏదన్నా అబద్ధమే చెప్పాలి. తప్పదు.

క్షణకాలంపాటాలోచించి బుర్రలోకి ఓ అమోఘమైన ఐడియా వచ్చేయగా "ఆవిడా? ఆవిడ కూరగాయలమ్మే మనిషి లెండి... మా పెడనలో కూరగాయలమ్ముద్ది" అన్నాడు తన తెలివికి తానే మురిసిపోతూ.

"అయితే?" అంది సౌభాగ్యలక్ష్మి.



"మరేంలేదు పిన్నిగారూ..." మనసులో మాటల్ని కూడగట్టుకుంటూ అన్నాడు భాస్కర్రావ్. "నేను పెడనలో ఉన్నప్పుడు రోజూ ఆవిడ దగ్గర కూరగాయలు కొనేవాడ్ని, ఎప్పుడన్నా చిల్లర్లేనప్పుడు తప్పకుండా తీసుకునేవాడ్ని..."

"అయితే" అనుమానంగా చూసింది సౌభాగ్యలక్ష్మి.

"నేనిక్కడికి బయల్దేరే సమయానికి నేనావిడకి పది హేన్రూపాయలు బాకీ ఉన్నాను. ప్రయాణం హడావుడిలో ఆ సంగతే మర్చిపోయి ఇక్కడికొచ్చేశాను. తీరా ఇక్కడికొచ్చేక గుర్తొచ్చింది. ఆవిడకు బాకీ ఉన్నానన్న సంగతి. అప్పట్నుంచి నా మనసు మనసులో ఉండటంలేదు. నన్ను మోసగాడిగా ఎంచి, ఆవిడ నన్నెన్ని బూతులు తిట్టుకునుంటుందోనన్న ఆలోచన నన్ను నిలవనీయడంలేదు..." ఎందుకన్నా మంచిదని ముఖాన్ని వీలయినంత అమాయకంగా పెట్టేడు.

దాంతో ఫక్కున నవ్వింది సౌభాగ్యలక్ష్మి. పర్వతాలు కూడా ఫక్కున నవ్వుతాయన్న మాట? ! అనుకున్నాడు మనసులో.

"భలేవాడివయ్యా! దానికే ఇంత బేజారైపోవాలా? కొంపదీసి జ్వరం కూడా అందుకే వచ్చిందా ఏంటి? "

"ఏమో పిన్నిగారూ! జ్వరం తీవ్రతలో నేనావిడ్ని అన్నిసార్లు కలవరించానూ అంటే... మీరన్నట్టు బహుశా జ్వరం కూడా అందుకే వచ్చుండొచ్చు..." ముఖంలోని అమాయకత్వాన్ని చెదరనీయకుండా జాగ్రత్త పడ్తూ అన్నాడు. "ఎవ్వరికీ రుణపడి ఉండకూడదన్నది నా సిద్ధాంతం పిన్నిగారూ! అలాంటిది నా మతిమరుపువల్ల ఆమెకు రుణపడిపోయాను... తెలియక చేసినా పాపం పాపమే కదా! అందుకే ప్రశాంతంగా





ఉండలేకపోతున్నాను..."

సౌభాగ్యలక్ష్మికి అతని అమాయకత్వానికి తెగ జాలేసింది!

"ఆ కూరగాయలమ్మి మరీ అంత రాకాసి ముండా ఏంటి నాయనా? దాన్ని తల్చుకుని అంతగా భయపడిపోతున్నావు? అద్సరే గాని కూరగాయలమ్మికి అంతమంచి పేరేంటి? కొంపదీసి చదువుకున్నదా ఏంటీ? " అంది అనుమానంగా.

"నా సుకేశిన్ని రాకాసిముండంటారా? హుఁ... ఎన్ని గుండెలు మీకు? " అని అరవాలనిపించినా నిగ్రహించుకున్నాడు భాస్కర్రావ్. "అవును పిన్నిగారూ! చదువుకున్న మనిషే! పాపం ఒకప్పుడు బాగానే బతికేదట. కానీ పాపం ఏవో కారణాలవల్ల కుటుంబం చితికిపోయి ప్రస్తుతం గత్యంతరంలేక కూరగాయలమ్ముకుంటోంది" అన్నాడు ఆడిన అబద్ధాన్ని మరింత పటిష్టంగావిస్తూ.

"వయసెంత? పెళ్ళయిన మనిషేనా? "

భాస్కర్రావ్ బుర్ర చురుగ్గా పన్జేసింది.

"వయసు పెద్ద ఎక్కువేం కాదు పిన్నిగారూ! చిన్నదే... మీయంతుంటుందేమో అంతే! పెళ్ళయిన మనిషే. కాని పాపం భర్తపోయాడట..." అన్నాడు పిన్నిగారిలో వేరే విధమైన అనుమానం కలగకుండా జాగ్రత్తపడ్తూ.

సౌభాగ్యలక్ష్మి ముఖం సహజంగానే వికసించింది. "చిన్నదే.. మీయంతుంటుందేమో అంతే" అన్నమాటలు ఆమెకు చాలా శ్రవణానందకరంగా అన్పించినై. 'మంచి కుర్రాడు... బుద్ధిమంతుడు...' అనుకుంది నిండు మనసుతో.

"పోన్లే బాచీ! చదువుకున్న మనిషే అంటున్నావ్ కాబట్టి తొందరపడి అపార్థం చేస్కోదులే, నువ్ భయపడ్తున్నట్టు నిన్ను బూతులేం తిట్టుకోదులే..."

"కానీ రుణభారం...?"

"దాన్దేముందీ! అక్కడ మీ ఫ్రెండ్ గోకారో పీకారో ఎవరో ఉన్నారన్నావ్‌గా? అతనికో ఉత్తరం రాసి పడేస్తే సరి! నీ తరపున ఆవిడకి క్షమాపణ చెప్పి ఆ పదిహేను రూపాయలిచ్చేయ్ మని..."

"భలే ఉపాయం చెప్పేరు పిన్నిగారూ! నా మట్టిబుర్రకి ఈ అయిడియా రానే రాలేదు సుమండీ"

భాస్కర్రావ్ అలా అంటుంటే చాలా ముచ్చటగా అనిపించింది సౌభాగ్యలక్ష్మికి.

'మరేంటనుకున్నావ్ నేనంటే?' అన్నట్టు కించిత్ గర్వంగా తలెగరేసింది.

★ ★ ★

ఆ సాయంత్రం భార్య ద్వారా విషయం తెలుసుకున్న వరహాల్రాజు పడిపడి నవ్వేడు భాస్కర్రావ్ అమాయకత్వానికి.

"ఏడీ... ఆ బాచీ నిలా పిలువ్..." అంటూ తనే వెళ్ళేడు అతని రూమ్‌కి.

"ఏంటయ్యా బాచీ ఇది?" అన్నాడు రూమ్‌లో కాలుపెడ్తూనే.

"ఏది బాబాయ్‌గారూ?" అన్నాడు భాస్కర్రావ్ ఓ స్టూల్ని ఆయనకేసి జరుపుతూ.

"అదేనోయ్... అదెవత్తో కూరగాయల ముండ నిన్ను హడలగొట్టేస్తోందటగా? నీకు జ్వరం ఆ 'రాకాసిముండ' వల్లే వచ్చిందటగా?"

'నేరకపోయి అబద్ధమాడేన్రా భగవంతుడా? ఇప్పుడీయన ఎంత నసపెడతాడో ఏం పాడో' అనుకున్నాడు భాస్కర్రావ్ మనసులో భయంగా.

"ఇహిహి" అన్నాడు పైకి. అంతకన్నా ఇంకేమనాలో తోచలేదు మరి!

"ఆ సుకేశినో సుహాసినో అదెవత్తోగాని... దాన్నేం చేసినా పాపం లేదయ్యా!"

"అంత మాటనకండి బాబాయ్‌గారు! నా ప్రియ సుకేశిన్ని అంతలేసి మాటలని నా హృదయాన్ని తూట్లు పొడవకండి బాబాయ్ గారు!" అని బావురుమని ఏడ్వాలనిపించింది భాస్కర్రావ్‌కి. అయినా తననితాను కంట్రోల్ చేసుకున్నాడు.

ఛఛ... అదేం మాట బాబాయ్‌గారూ... పొరపాటు నాది. నా మతి మరుపుకి ఆవిడ్ని నిందించటం ఏం భావ్యం చెప్పండి? అదీగాక ఆవిడ నా జ్వరానికి పరోక్ష కారకురాలే తప్ప ప్రత్యక్ష కారకురాలు కాదుగా... కాబట్టి ఈ విషయాన్నింతటితో పోనియ్యండి" దీనంగా చూస్తూ అన్నాడు.

వరహాల్రాజు ఏ కళనున్నాడో ఏమోగాని ఇంకేమీ నసవాగుడు వాగలేదు.

"మొత్తానికి భలేవాడివయ్యా!" అని నవ్వేసి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళిపోయాక భాస్కర్రావ్ మనో ఫలకం మీద సుకేశిని సుందర రూపం మెరిసింది.

"అప్రాచ్యుడా! లేనిపోని అబద్ధాలు చెప్పి అందరితోనూ నా గురించి అన్నన్ని మాటలనిపిస్తావా? నీ సంగతి ఇప్పుడు కాదు... మన పెళ్లయ్యాక చెప్తానాగు" అని ఆమె తనని బెదిరిస్తున్నట్టుగా అనిపించి బేజారెత్తిపోయాడు.

"సారీ సుకేశ్! అయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ! నేనిలా జరుగుతుందనుకోలేదు. వాళ్లు నిన్ను రాకాసిముండా అదీ ఇదని తిడ్తారనుకోలేదు. అయినా వాళ్లు తిడ్తున్నది నిన్ను కాదుగా? పెడనలో ఉన్న ఓ కూరగాయలమ్మిని. ఎనీహౌ.. అయామ్ రియల్లీ వెరీవెరీ సారీ! ఈ విషయాన్ని నువ్ మనసులో ఉంచుకుని మన పెళ్లయ్యాక నన్ను సాధిస్తే నేనూరుకునేదిలేదు" అని మనసులో ఆమెకు క్షమాపణలు చెప్పుకుని మనసులోనే బుంగమూతి పెట్టేడు భాస్కర్రావ్.

★ ★ ★

జ్వరం తాలూకు, నీరసం తాలూకు అవశేషాలు కూడా మిగలకుండా పోయాక అంటే పూర్తిగా నయమైపోయాక...

డార్విన్ డిటర్జెంట్స్ కంపెనీలో సేల్స్





రిప్రజంటేటివ్ పోస్ట్‌కి ఇంటర్వ్యూకి వెళ్లేడు భాస్కర్రావ్.

"నీ పేరేంటి? "

"ఎంతవరకు చదువుకున్నావ్"

"మీ ఇల్లెక్కడ? " అనే మూడు ప్రశ్నలు మాత్రమే అడిగి యస్. యువ్ఆర్ సెలెక్టెడ్... రేపే వచ్చి జాయినైపో" అన్నారు వాళ్లు.

ఇదేంటింత సులభంగా సెలక్ట్ చేసేశారు? అనుకున్న భాస్కర్రావ్ "ఇంతకీ నా విధులేంటి సార్? " అన్నాడు అయోమయంగానూ అనుమానంగానూ.

"ఏముందీ మా కంపెనీ కొత్తగా మార్కెట్లోకి ఇంట్రడ్యూస్ చేస్తున్న మండీ బ్రాండ్ డిటర్జెంట్ కేకుల్ని ఫిఫ్టీ పర్సెంట్ డిస్కవుంట్‌తో ఇంటింటికీ తిరిగి అమ్మాలంతే"

'ఏంటీ? ఇంటింటికీ తిరిగి సబ్బులమ్ముకునే ఉద్యోగమా? ఛీఛీ' అనుకున్నాడు భాస్కర్రావ్.

పేరుగొప్ప ఊరు దిబ్బ అన్నట్టుగా ఉందిది. చెయ్యాల్సింది సబ్బులమ్మడమే అయినప్పుడు సేల్స్‌మేన్ అని ప్రకటించవచ్చుగా? సేల్స్ రిప్రజంటేటివ్ అని డాబుగా ప్రకటించడం దేనికి?

పెడన్నుండి తానింత దూరం వచ్చింది సబ్బులమ్ముకోవడానికా? ఛీ ఇదీ ఒక ఉద్యోగమేనా!

'మీ బోడి ఉద్యోగం నాకక్కర్లేదులే సార్' అంటూ లేచిపోదామనిపించింది. కానీ మనసులో 'ని.ప్ర' సూత్రం మెదల్టంతో "జీతం ఎంత సార్? " అన్నాడు బుద్ధిమంతుడిలా ముఖం పెట్టి.

"ప్రకటనలో ఇచ్చాంగా... వెయ్యినుండి మూడువేలదాకా ఉంటుంది"

"అంటే మీ ఇష్టానుసారంగా ఇస్తారా? " కించిత్ అయోమయంగా చూశాడు.

"ఇష్టానుసారంగా ఎందుకిస్తాం. నీ పనిని బట్టిఇస్తాం. అంటే నెలకి రెండువేల సబ్బులమ్మితే వెయ్యి రూపాయలు... నాలుగు వేలమ్మితే రెండు వేలు... అలా అన్నమాట! నువ్ బాగా అమ్ముకోగలగాలేగాని మూడు వేలేం ఖర్మ... నెలకి అయిదువేలు కూడా సంపాదించుకోవచ్చు..." ప్రలోభ పెడ్తూ అన్నాడు ఇంటర్వ్యూ చేసిన ఇద్దర్లో ఓ బట్ట తలాయన.

"మరి ప్రమోషన్లు గట్రా ఏం ఉండవా?''

"ఎందుకుండవ్? లక్ష సబ్బులమ్మటం పూర్తయ్యాక ఏరియా సేల్స్‌మేనేజర్‌గా చేస్తాం. నీ క్రింద ఓ ఇరవైమంది సేల్స్ రిప్రజెంటేటివ్స్‌ని వేస్తాం. వాళ్లందరి ద్వారా నువ్‌గాని కోటి సబ్బులు అమ్మించగలిగావ్ అనుకో... అప్పుడు నువ్ రీజినల్ సేల్స్ మేనేజర్ వైపోతావ్... అంటే వీరిలా అన్న మాట..." బట్ట తలాయన తన ప్రక్కనున్న జండా కొయ్యలాంటి వ్యక్తికేసి చూపుతూ అన్నాడు,

"అంటే ఈయన కోటి సబ్బులమ్మించేరా సార్? " కళ్లని విప్పారుస్తూ ఆశ్చర్యంగా చూశాడు భాస్కర్రావ్.

"ఎందుకలా ఆశ్చర్యపోతావ్? దేనికన్నా కృషి వుండాలి. కృషి వుండాలేగాని కోటి సబ్బులేం ఖర్మ కోటానుకోట్ల సబ్బులమ్మొచ్చు"

ఆ బట్టతల మీద ఓ గుద్దుగుద్దితే సరి అనిపించింది భాస్కర్రావ్‌కి ఆయనంత సులభంగా చెప్పేస్తుంటే. లేకపోతే ఏంటి? జన్మంతా సబ్బులమ్ముకుంటూ కూర్చోవాలా!

"మంచిదిసార్! కానీ మీ ఉద్యోగం నాకవసరం లేదు" అనబోయి ఆగిపోయాడు.

అందుక్కారణం... "తొందరపడకు నిదానమే ప్రధానం..." అని అంతరాత్మ హెచ్చరించటం.

"నీకేవమ్మా నువ్వెన్నయినా చెప్తావ్! ఇంటింటికీ తిరిగి సబ్బులమ్ముకోవటం ఎంత చండాలంగా ఉంటుందో నీకేం తెల్సు? " అన్నాడు భాస్కర్రావ్ అంతరాత్మతో

కోపంగా. అంటే పైక్కాదు. మనసులో అన్నమాట.

"అదుగో ఆ తొందరపాటే పనికిరాదు" అంటూ అంతరాత్మ అతనిమీద ఓ తిరుగు లేని బాణాన్ని ప్రయోగించింది. "ప్రస్తుతం నువ్వు సుకేశినిని అదేనోయ్ నీదేవిని అన్వే షించే ప్రయత్నంలో ఉన్నావ్. అవునా? ఈ ఉద్యోగం నీ ప్రయత్నానికి ఎంతగానో తోడ్ప డుద్ది. ఎందుకంటే నీ దేవి ఉందో లేదో చూడ్డానికి నువ్వు ప్రతి ఇంట్లోకీ కారణం లేకుండా దూరిపోలేవుగా? నీ చేతిలో ఈ ఉద్యోగం గనుక ఉంటే సబ్బులమ్మే నెపంతో ప్రతి ఇంట్లోకీ దూరొచ్చు నీ దేవి ఉందో లేదో చూస్కోవచ్చు ఎలా ఉంది నా ఐడియా? "

అంతరాత్మ తెలివితేటలకి అబ్బురపడి పోతూ "బ్రహ్మాండంగా ఉంది" అన్నాడు భాస్కర్రావ్.

"మరైతే ఇహనేం... రేపే వచ్చి జాయి నైపో" అన్నాడు బట్టతలాయన.

దాంతో అప్పుడర్థమైంది భాస్కర్రావ్‌కి... పొరపాట్న తాను బ్రహ్మాండంగా ఉంది అనే మాటల్ని పైకే అనేశాడని.

"అలాగే సార్! విత్‌ప్లెజర్.." అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా చేతులు జోడిస్తూ.

"కానీ ఓ చిన్న కండిషను. మేం నీకు రోజూ బ్రీఫ్‌కేసూ, కొన్ని సబ్బులూ ఇస్తాం కదా! అందుకని నువ్ జాయినయ్యేటప్పుడు సెక్యూరిటీ డిపాజిట్‌గా ముందో వెయ్యి రూపాయలు కట్టాల్సుంటుంది. అది నువ్ జాబ్ మానేసేటప్పుడు తిరిగి ఇచ్చేస్తాం అన్నమాట!"

"మీ బోడి ఉద్యోగానికి సెక్యూరిటీ డిపా జిట్టొకటా? " అనిపించినా ఆ మాట పైక న్లేదు భాస్కర్రావ్.

తన ప్రియ సుకేశిని అన్వేషించడానికి మార్గాన్ని సుగమం చేస్తున్న ఉద్యోగమాయె! అలాంటప్పుడు వెధవ వెయ్యిరూపాయలు ఓలెక్కా? !

"అలాగేసార్! రేపే వచ్చి డబ్బు కట్టి జాయినైపోతాను" అనేశాడు ఆనందంగా.

★ ★ ★

భాస్కర్రావ్ తనకుద్యోగం దొరికిందని చెప్పగానే మొదట సంతోషాన్ని వ్యక్తం చేసిన వరహాల్రాజు దంపతులు, అతను పూర్తి వివరాలు చెప్పగానే ఛీ అదేం ఉద్యోగం? అంటూ పెదవి విరిచేశారు.

ముఖ్యంగా వరహాల్రాజు బాగా అప్సెట్ చేశాడు... "మార్కెట్లో పేరున్న డిటర్జెంట్లు ఎన్నో ఉన్నై. అలాంటప్పుడు ఆ మండీ బ్రాండ్ సబ్బు నెవరుకొంటారయ్యా? ముష్టాడిలా నువ్ ఇంటింటికీ తిరిగి నానా యాతన్లూ పడ్డా నెలకో వెయ్యి సబ్బులన్నా అమ్ముడవుతాయని నేననుకోను. చివరకు నీకు మిగిలేది తిప్పలే తప్ప ఇంకేమీ ఉండదు. ఇన్నాళ్లాగేవ్... ఇంకొంత కాలం ఓపికపట్టు... మంచి జాబ్ దొరికినప్పుడే జాయినైదువుగాని" అంటూ చాలా తీవ్రంగా ఖండించాడు భాస్కర్రావ్ నిర్ణయాన్ని.

అయినా భాస్కర్రావ్ వినలేదు.

"నాకు ఇంటింటికీ ముష్టాడిలా తిరిగే ఉద్యోగమే కావాలి బాబాయ్‌గారూ! అదయి తేనే నా దేవిని అన్వేషించుకోవడానికి నాకు అనుకూలంగా ఉంటుంది" అని డైరెక్ట్‌గా చెప్పలేక... "పోనీలెండి బాబాయ్‌గారూ! ప్రయత్నించి చూడ్డంలో తప్పేముంది? ఓ నెల్రోజులు చేసి చూస్తాను. ఫర్వాలేదనిపిస్తే కంటిన్యూ అవుతాను. లేదంటే మానేస్తాను. ఒకవేళ ఈలోగా వేరే మంచి జాబేదైనా దొరికితే ఎలాగూ మానేస్తాననుకోండి. అది వేరేసంగతి" అంటూ ఏమేమో చెప్పుకొ చ్చాడు.

చివరికి ప్రాణం విసుగెత్తి "సరే నీకంత ఉబలాటంగా ఉంటే అలాగే కానివ్వయితే" అనేశాడు వరహాల్రాజు.

★ ★ ★

ఆ రాత్రి తనకి ఉద్యోగం దొరికిందనీ, రేపట్నించి సబ్బులమ్ముకోబోతున్నాననీ





గోకారికో ఉత్తరం రాసి జేబులో పెట్టుకుని ఈ కొత్త అధ్యాయం ప్రారంభమైంది లగాయతు అప్పటివరకూ జరిగిన సంఘటనలన్నిట్నీ ఓసారి మనసులో మననం చేసుకున్నాడు.

అలా మననం చేస్కోవడంవల్ల అతనికి తాతయ్యగారి గొప్పదనం బోధపడింది. కాదు... తాతయ్యగారు చెప్పిన 'ని.ప్ర' సూత్రంలోని గొప్పదనం బోధపడింది.

నిజంగా 'ని.ప్ర' సూత్రం ఎంత గొప్పది!

ఆ సూత్రాన్ని పాటించటంవల్లేకదా తనకి సమీరా స్టీల్స్‌లో ఉద్యోగం మిస్సైపోయింది.

తనేగనక ఆ ఉద్యోగంలో చేరుంటే మురారిగాడికి బర్త్‌డే డ్రెస్ కొంటానికి తానారోజు అమీర్‌పేట వెళ్లటం జరక్కపోయి ఉండేది.

అలాగనక జరక్కపోయి ఉంటే తనకి సుకేశిని లాంటి అద్భుత సౌందర్యరాశి కనబడకపోయి ఉండేది.

ఆమే గనక తనకు కనబడకపోయి ఉంటే ఇంక ఈ జీవితానికి అర్థమేముంది? ఆమె తనకు కనబడింది గనక, ఓ మూడ్రోజులు జ్వరమొచ్చినా తానిపుడింత హ్యాపీగా ఉండగలుగుతున్నాడు.

తన భావి సతీమణిని తనకు పరిచయం గావించిన 'ని.ప్ర' సూత్రం నిజంగా ఎంత గొప్పది.

అదేవిధంగా... ఈరోజు కూడా 'ని.ప్ర' సూత్రాన్ని పాటించటం.

"థాంక్యూ తాతయ్యా! నాకు నిజంగా చాలాగొప్ప సూత్రాన్ని ఉపదేశించి పోయావు. నామీద నీగ్గల ప్రేమకు నా జోహార్లు. నీ అమూల్య సూత్రాన్ని నా కంఠంలో ఊపిరున్నంతవరకూ పాటిస్తూనే ఉంటాను. సో యూ నీడ్ నాట్‌వర్రీ! బీ హ్యాపీ? "

ని.ప్ర. సూత్రం యొక్క గొప్పతనం తెలిసొచ్చిన శుభ సందర్భంలో తాతయ్యకు మనసులో కృతజ్ఞతలు తెల్పుకుని మరోసారి పునః ప్రమాణం లాంటిది చేశాడు భాస్కరావ్. దరిమిలా ఊహల్లో సుకేశినితో డ్యూయెట్లు పాడుకుంటూ ఓ రెండు మూడు గంటలు గడిపి ఆ మీదట సుఖ నిద్రలోకి జారుకున్నాడు.

ప్రేమలో పడ్డవారికి ఎల్లప్పుడూ సుఖ నిద్రేపడ్తుంది. ఎందుకంటే నిద్రలో రంగు రంగుల కలలొస్తాయ్ కదామరి?

★ ★ ★

"విష్యూ ఆల్ ది బెస్ట్..." భాస్కర్రావ్ చేతికి సూట్‌కేసందిస్తూ చెప్పాడు డార్విన్ డిటర్జెంట్స్ కంపెనీ రీజినల్ సేల్స్‌మానేజర్ పావనమూర్తి.

"థాంక్యూ సార్" అన్నాడు భాస్కర్రావ్ వినయంగా. "వెధవ సూట్‌కేస్ ఇంత బరువుగా చచ్చిందేంటి? " అనుకున్నాడు మనసులో.

"మంచిది వెళ్లిరా... సాయంత్రం ఆరింటికల్లా తిరిగొచ్చిడైలీ ప్రోగ్రెస్ రిపోర్ట్ సబ్‌మిట్ చేసి వెళ్లాలిసుమా!"

"ష్యూర్ సార్" అని వినయంగా తలాడించి అక్కణ్ణుంచి బయటపడ్డ భాస్కర్రావ్‌కి ఓ వంద గజాలదూరం నడిచేసరికి జబ్బ గుంజుతున్నట్టుగా అనిపించింది.

"ఛీఛీ... వెధవ ఉద్యోగం!! నేరకపోయి చేరాను" అనుకోబోయి మానేశాడు ని.ప్ర. సూత్రం గుర్తుకు రావటంవల్ల.

"ఏరా బడుద్ధాయ్! రాత్రేకదరా మీ తాతయ్యకి పునః ప్రమాణం లాంటిది కూడా చేశావ్! అప్పుడే..."

"చాల్లే నోర్ముయ్..." నస మొదలుపెట్టబోతున్న అంతరాత్మని కసిరి పారేశాడు. "తేరగా దొరికేను కదాన్చెప్పి నువ్ నన్ను మాటిమాటికీ ఈటెల్లాంటి మాటల్తో తూట్లు పొడవాల్సిన అవసరంలేదు. రాత్రే తాతయ్యకు పునః ప్రమాణం లాంటిది చేశానన్న సంగతి గుర్తుకు రాబట్టేకదా ఛీఛీ వెధవ ఉద్యోగం అనుకోబోయి మానేశాను..."

"అవుననుకో.. కానీ ఎందుకయినా మంచిదని... మరోసారి గుర్తు చేద్దామని..." నసిగింది అంతరాత్మ.

"సంతోషం" అన్నాడు భాస్కర్రావ్ వ్యంగ్యంగా.

దాంతో అంతరాత్మ అలిగి నోరు మూసేసుకుంది.

అభ్యాసము కూసువిద్య అన్నారు పెద్దలు. కొత్తకాబట్టి ఇప్పుడిలా మొయ్యలేని భారంలా అనిపిస్తోందే తప్ప, నాల్రోజులు పోతే అదే అలవాటైపోద్ది. అనుకుంటూ ముందుకు సాగిపోయిన భాస్కర్రావ్ దగ్గర్లో ఉన్న బస్టాప్‌కి చేరుకున్నాడు.

ఏరోజు ఎవరు ఏ ఏరియాకి వెళ్లాలో కంపెనీవాళ్లు డిసైడ్ చేసిచెప్తారు.

ఆరోజు భాస్కర్రావ్‌కి దిల్‌సుఖ్‌నగర్ ఏరియా ఎలాట్ చేయబడింది. భాస్కర్రావ్ తోపాటు అదేరోజు మరో అరడజనుమంది అభాగ్యులు కూడా అప్పాయింట్ అయ్యారు. వాళ్లకింకేవేవో ఏరియాలు ఎలాట్ అయ్యాయి.

ఓ అరగంట వెయిట్ చేశాగ్గాని భాస్కర్రావ్‌కి దిల్‌సుఖ్‌నగర్ వెళ్లే బస్ దొరకలేదు.

దిల్‌సుఖ్‌నగర్ చేరుకున్నాక ఓం ప్రథమంగా తన కంటికి మంగళప్రదంగా కనిపించిన ఓ ఇంట్లోకి దూరాడు భాస్కర్రావ్.

ఆ ఇల్లు అతని కంటికి మంగళప్రదంగా ఎందుక్కనిపించిందంటే కాంపౌండ్ వాల్ మీద 'మంగళానిలయం' అని ఓ పాలరాతి ఫలకం ఉండటంవల్ల.

"సార్... సార్ అయ్యా అమ్మా... ఎవరండీ లోపల?" ఎలుగెత్తి అరిచాడు గేటు తీసుకుని లోనికివెళ్లాక.

"ఎవరూ?" అంటూ లోపల్నుంచి ఓ అవ్వగారు బైటకొచ్చింది.

అవ్వల గన్న అవ్వలా ఉన్న ఆ కడు వృద్ధురాల్ని చూసి భాస్కర్రావ్ నీరుగారిపోయాడు.

బోణీబేరం ఇలాంటి ఓల్డ్‌కేస్ దొరికిందేమిటి చెప్మా?

మండీ బ్రాండ్ బట్టల సబ్బుయొక్క విశిష్టతని గురించి ఈవిడకు చెప్పినా వ్యర్థమే.

రేపోమాపో పోయేలా ఉన్న ఈ వృద్ధురాలికి బట్టల సబ్బుతో పనేంటి? "కృష్ణా రామా" అనుకోవడానికే ఓపిక లేనట్టుగా ఉంది. అలాంటిదింక బట్టలుతికే ఓపిక ఈవిడలో ఏం ఉండి చచ్చుద్ది?

"నేను డార్విన్ డిటర్జెంట్స్ కంపెనీనుండి వచ్చానండి. ఇంట్లోమీరు కాక ఇంకెవరూ లేరాండీ?"

భాస్కర్రావ్ అలా అడిగేసరికి అవ్వల గన్న అవ్వ ముక్కుమీదకు జారిపోతున్న కళ్లజోడును పైకెగదోసుకుంటూ అతనికేసి అదోలా చూసింది... ఏం నాయనా, నేను మనిషినికానా? అన్నట్టుగా.

"ఈ ఇంటికి నేను పెద్దదిక్కుని కాబట్టి నువ్వొచ్చిన పనేంటో నాతో చెప్పు ఫర్వాలేదు" అంది అదోలా చూడ్డం అయ్యాక.

"మీరు పెద్దదిక్కు అయితే కావచ్చుగాని ఇది చిన్న వాళ్లతో చెప్పాల్సిన విషయమండీ.. మీ ఇంట్లో చిన్నవాళ్లెవరూ లేరా? '

'

★ ★ ★

"లేకేం? ... చాలామందున్నారు. నీకెవరు కావాలి?"

"వయసులో ఉన్న ఆడవాళ్లు..." అనుభవరాహిత్యం వల్ల ఎలా మాట్లాడాలో తెలీక అలా అనేశాడు భాస్కర్రావ్.

అంతే! అవ్వలగన్న అవ్వ కాళికాదేవిలా మారిపోయింది. "ఏం కూశావ్‌రా! ఎంత ధైర్యంరా నీకు!! వయసులో ఉన్న ఆడాళ్లు కావాలా? ఇదేవన్నా సానికొంప అనుకున్నావ్రా!" ఆమె బోసి నోటిగుండా బాంబుల వర్షం కురిసింది.

అప్పుడు తెలిసొచ్చింది భాస్కర్రావ్‌కి తన తప్పేమిటో.

"బామ్మగారూ!" అంటూ గభాల్న ఆమె కాళ్లమీదపడి పోయాడు.





అంటే నిజంగా పడిపోయాడనికాదు. పడి నంత పన్జేశాడు. "నన్ను మీరు అపార్థం చేసుకున్నారు బామ్మగారు! వయసులో ఉన్న ఆడవాళ్లంటే నా ఉద్దేశం అదికాదు. బట్టలూ అవీ ఉతికే వయసున్న స్త్రీలన్న మాట!" అన్నాడు చేతులు నలుపుకుంటూ.

"ఏం... నాకు బట్టలూ అవీ ఉతికే వయ సులేదా? " బల్లగుద్ది అడిగిన టైప్‌లో చేతి లోని ఊతకర్రతో నేలమీద రకీమని పొడుస్తూ అడిగింది బామ్మగారు.

ఉందనుకోండి.. కాని కొంచెం ఎక్కువై పోయిందికదా! అంచేత ప్రస్తుతం మీ ఇంట్లో బట్టలెవరు ఉతుకుతారో వాళ్లని పిల వండి. అంటే బట్టలుతికే మాతృసమానురా లైన ఆ స్త్రీమూర్తిని పిలవండి" మాటల్ని చాలా జాగ్రత్తగా ఆలోచించి ఉపయోగిం చాడు భాస్కర్రావ్.

"మాతృ సమానురాలైన ఆ స్త్రీమూర్తిని నేనే నాయనా"

మతిపోయినట్టనిపించింది భాస్కర్రావ్‌కి బామ్మగారలా అనేసరికి. "జోకులెయ్యకండి బామ్మగారూ!" అని అనాలని కూడా అనిపిం చింది. కాని బావుండదని మానేశాడు.

"నిజం నాయనా! మా ఇంట్లో బట్టలుతి కేది నేనే!" గుడ్లు మిటకరించి చూస్తున్న భాస్కర్రావ్‌తో నొక్కి వక్కాణిస్తున్నట్టుగా అంది బామ్మగారు !

దాంతో భాస్కర్రావ్ కొద్దిగా తేరుకుని "అదేంటి బామ్మగారూ! ఈ వయసులో మీరు బట్టలుతకడం ఏంటి? "

కృష్ణా రామా అనుకుంటూ హాయిగా కూర్చోవాలిగాని? ... మీ ఇంట్లో వేరే ఆడా వరూ లేరా? లేక ఉన్నా కూడా వాళ్లకి ఒళ్లొంగదా? " అన్నాడు సానుభూతిగా.

అనేశాక తన పొరపాటు తెలిసొచ్చింది భాస్కర్రావ్‌కి.

తొందరపాటుతనంకొద్దీ మళ్ళీ నోరు జారేశాడు తను. 'మీ ఇంట్లో మిగతా ఆడా ళ్ళకి ఒళ్లొంగదా? ' అని అడగటం ఎంత తప్పు?

"భగవాన్! నన్ను నువ్వే కాపాడాలి! నేన మాయకుడ్ని! నన్ను నువ్వే రక్షించాలి" అను కున్నాడు మనసులో కనిపించని ఆ భగవం తుడికి దండం కూడా పెట్టుకుంటూ.

బామ్మగారి బోసినోటినుండి మళ్ళీ కురవ బోయే బాంబుల వర్షానికి అతను భయం భయంగా ఎదురుచూస్తుంటే బామ్మగారు అతని భయాన్ని పటాపంచలు చేస్తూ ప్రస న్నంగా నవ్వింది పైగా...

"మా బాగా అన్నావు నాయనా! నువ్వ న్నట్లు నిజంగానే ఆ దొంగముండలకి ఒళ్ళొంగదు..." అంటూ అతన్ని ప్రశంసిం చింది.

'ఏ దొంగముండలకి? ' అనడుగబోయి, తెలివి తెచ్చుకుని, "ఎవరికి బామ్మగారూ? " అన్నాడు భాస్కర్రావ్.

"ఇంకెవరికీ? ఉన్నారుగా. ఈ ఇంట్లో ఇద్దరు కంత్రీముండలు వాళ్ళకీ..."

"అంటే మీ కోడళ్ళకా బామ్మగారూ? "

"నాకింకా కొడుకులూ కోడళ్ళూ ఎక్కడ మిగిలారు నాయనా... అందరూ నా కళ్ళ ముందే పోయారు..."

"మరి ఈ ఇంట్లో..."

భాస్కర్రావింకా మాట పూర్తి చేయక ముందే అందుకుంటూ చెప్పింది బామ్మ గారు. "నా మనవళ్ళిద్దరూ ఉంటున్నారు నాయనా! ఆ ఇద్దరు ముండలూ అంటే నా మనవళ్ల భార్యలు ఉద్యోగాలు వెలిగిస్తున్నా రులే. ఊపుకుంటూ పొద్దున్నపోయి మళ్ళీ పొద్దుపోయాక వస్తారు. ఒక్క బట్టలుతక డమే కాదు, ఇంట్లో ఉండే బండెడు పనీ నేనే చేయాలి..."

"అలాగా బామ్మగారూ! ఈ వయసులో వాళ్ళిద్దరూ మిమ్మల్నిలా కష్టపెట్టడం నాక్కూడా ఏం నచ్చలేదు. పోనీ మీ ముని మనమరాళ్ళైనా మీకు సాయం చెయ్యరా? "



సానుభూతిని కురిపిస్తూ తెలివిగా ప్రశ్నించాడు భాస్కర్రావ్.

"నా మునిమనవరాళ్ళకి ఇంకా అంత వయసెక్కడిది నాయనా! ఒకదానికి రెండో ఏడు. ఒకదానికి మూడో ఏడు. వాళ్ళిద్దర్ని పిల్లల్నాడించే క్రష్షో క్రెష్షో అదేదో సెంటరం టార్చూడూ... అందులో పడేసిపోతారు ముండలిద్దరూ. మళ్ళీ సాయంత్రం కొంపకొచ్చేటప్పుడు తెచ్చుకుంటారు..." అంది బామ్మగారు.

'సో... నా సుకేశిని ఈ ముసలామె మునిమనవరాలిగా ఈ ఇంట్లో లేదన్నమాట. వేరే ఏ ఇంట్లోనో ఉందన్నమాట! ఈ సంగతి తెలీక నిష్కారణంగా బోలెడంత టైమ్ వేస్ట్ చేసేస్కున్నాను' అనుకున్న భాస్కర్రావ్- "సరే బామ్మగారూ! నేనింక వెళ్ళొస్తానైతే" అంటూ తన సూట్‌కేస్‌ని చేతిలోకి తీసుకున్నాడు.

"అదేంటి నాయనా? నువ్వొచ్చిన పనేంటో చెప్పకుండానే వెళ్ళిపోతున్నావ్?"

"అవసరం లేదులే బామ్మగారూ... వస్తా!"

అనేసి గేటుదాటి బైటపడ్డాడు. 'నా సుకేశ్ లేని ఈ ఇంటితో నాకేం పని?' అనుకున్నాడు మనసులో.

అవ్వాలగన్న అవ్వ అతను వెళ్ళిన దిక్కు ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుండిపోయింది.

భాస్కర్రావ్ ఆ ఇంట్లోనుండి బైటపడి నాలుగడుగులు వేశాక...

"నీకసలు బుద్ధుందా?" అంటూ అతని అంతరాత్మ మళ్ళీ రొద ప్రారంభించింది.

"నా బుద్ధికేమైందిప్పుడు?" ఎదురుప్రశ్న వేశాడు భాస్కర్రావ్.

"మతి లేకుండా వాక్కు... సబ్బులమ్మడానికి వెళ్ళినోడివి అసలా ప్రయత్నమేనా చేయకుండా బైటకొచ్చేయడవేంటి?"

"చాల్లే ఊర్కో. సబ్బులమ్ముకోవడానిక్కాదు నేనీ ఉద్యోగంలో చేర్త! నా దేవిని అన్వేషించుకోవటం కోసం చేరానంతే"

"మర్నువ్ ప్రోగ్రెస్ చూపించకపోతే నిన్నుద్యోగంలోంచి పీకేస్తేనో?"

"ఎందుకు పీకుతారు?"

"ఎందుకు పీకరు?"

అంతరాత్మ అలా అడిగేసరికి 'అవున్నిజమే... పీకుతారు...' అనిపించింది భాస్కర్రావ్‌కి.

పోనీ అంతగా అమ్మలేకపోతే ఆ సబ్బులన్నీ తనే కొనేస్కుంటేనో అని కూడా అనిపించిందిగాని అంతలోనే అది తప్పుడాలోచన అని కూడా అనిపించింది.

ఏదో ఒక్కరోజంటే కొనగలడుగాని రోజూ సూట్‌కేసుడు సబ్బులు కొనడం తన వశమా? ... ఆరిపోడూ?

దాంతో తనకి సుకేశిన్ని వెదకటం ఎంత ముఖ్యమో సబ్బులమ్మటం కూడా అంతే ముఖ్యమని గ్రహించి 'ఇకనుంచి సిన్సియర్‌గా అమ్మాలి' అని నిర్ణయించుకుని ఎదురుగా కనిపించిన మరో ఇంట్లోకి దూరాడు భాస్కర్రావ్.

"నమస్తే మేడమ్! నేను డార్విన్ డిటర్జెంట్స్ కంపెనీ నుండి వచ్చాను..."

"ఏంటి సంగతి?" అన్నట్టుగా కళ్ళెగరేసింది తలతాటిస్తూ భాస్కర్రావ్ నమస్కారాన్ని స్వీకరించిన ఆ ఇంటి ఇల్లాలు. భాస్కర్రావ్ ఆమెకేసి పరిశీలనగా చూశాడు.

నడివయస్కురాలు. లక్ష్మీదేవిలా ఉంది. పైగా అందంగా కూడా ఉంది.

కాబట్టీవిడ సుకేశిని తల్లిగారయ్యుండడానికి బోలెడంత ఆస్కారముందనుకున్న భాస్కర్రావ్ ఆనందంగా ఓ నవ్వు నవ్వి అడిగాడామెని... "మీరే సబ్బు వాడ్తారు మేడమ్?"

"రెక్సోనా..." చెప్పిందామె.

"అబ్బే ఒంటి సబ్బు గురించి కాదు మేడమ్ నేనడుగుతూంది... బట్టల సబ్బు..." తన పొరపాటుని సరిదిద్దుకుంటూ అన్నాడు భాస్కర్రావ్.

"ఫన్"





"ఫన్నా? అదెప్పుడొచ్చింది మార్కెట్ లోకి? "

"చాలా కాలమయ్యింది... రోజూ టీవీలో కూడా చూపెడుతున్నారుగా- మీరు చూళ్ళేదా? "

"చూసే ఉంటానులేగాని గుర్తులేదు మేడమ్! సరేగాని ఎలా ఉతుకుతోందా సబ్బు? "

"బాగానే ఉతుకుతోంది"

"బాగానే అంటున్నారంటే సదరు సబ్బు మీకు పరిపూర్ణమైన తృప్తి నివ్వటం లేదన్న మాట..." పాయింటు దొరికినందుకు సంతోషపడిపోతూ చటుక్కున తన సూట్ కేస్ ఓపెన్ చేశాడు భాస్కర్రావ్.

"బట్టలుతికేవారికి పరిపూర్ణమైన తృప్తి నిచ్చే ఏకైక సబ్బు..." సూట్ కేస్‌లోంచి ఓ సబ్బుని బైటికి తీసి, ఏదో అపురూపమైన వస్తువుని ప్రదర్శిస్తున్నరీతిలో దాన్నామెకు చూపుతూ చెప్పాడు... "మా మండీ బ్రాండ్ డిటెర్జంట్ కేక్ అద్వితీయమైన శక్తిగలది. ఒక్కసారి గనక మీరు దీన్ని వాడి చూశారంటే ఆపైన నిస్సందేహంగా దీనికి మీరు బానిసైపోతారు. పన్నూ డిన్నూలాంటి సబ్బుల్ని కన్నెత్తి చూడ్డం కూడా మానేస్తారు..."

"అంత బాగా ఉతుకుద్దా? "

"ఆ...అదిరిపోయేలా ఉతుకుద్ది... మురికి చెదిరి పారిపోయేలా ఉతుకుద్ది..." తన జవాబుకి తానే మురిసిపోతూ అన్నాడు భాస్కర్రావ్.

"అలా కూర్చోండైతే" అంటూ భాస్కర్రావ్‌కి కుర్చీ చూపించి ఆ ఇల్లాలు లోనికి వెళ్లింది. అంటే మరో గదిలోకి అన్నమాట!

ఈవిడ చాలా మంచి ఇల్లాల్లా ఉంది. డబ్బును తీసుకురావడానికి లోనికెళ్ళిందిలా ఉంది. అన్నట్టు ధర తెల్సుకోకుండానే డబ్బులకోసం వెళ్ళిందేంటీ చెప్మా? ఎంత తెచ్చుద్దో ఏంపాడో... ఎన్ని సబ్బులు కొనుద్దో ఏంపాడో అనుకున్నాడు భాస్కర్రావ్.

'ముఖంలో లక్ష్మీ కళ తాండవిస్తోంది కాబట్టి ఈవిడ బోణీ తప్పకుండా బాగానే ఉంటుంది...' అని కూడా అనుకున్నాడు.

నరుల్లోనే నరరూపదేవతలు కూడా ఉండటం ఎంత విచిత్రం? అని కూడా అనుకోబోయాడు. కానీ అంతలోనే ఆ ఇల్లాలు చేతిలో ఓ మసిగుడ్డతో తిరిగొచ్చింది దక్కడికి.

భాస్కర్రావ్ అసహ్యంగా చూశాడు- ఆమె కేసి కాదు. ఆ మసిగుడ్డకేసి.

"మురికి బెదిరి పారిపోయేలా ఉతుకుద్దన్నారుగా... తళతళా మెరిసిపోయేలా ఉతకండి చూద్దాం..."

ఆమె చేతిలోని మసిగుడ్డని అటూ ఇటూ ఊపుతూ అలా అడుగుతుంటే తన సూట్ కేస్‌తో ఆమెను నెత్తిమీద బాది చంపేయాలన్నంతగా కోపమొచ్చింది భాస్కర్రావ్‌కి. తన అసహనాన్ని ఎలాగో నిగ్రహించుకుంటూ వీలయినంత సౌమ్యంగానే అన్నాడు. "సారీ మేడమ్! ఫిఫ్టీ పర్సెంట్ డిస్కౌంట్‌తో మా కంపెనీ సబ్బుల్ని అమ్మటంవరకే నా డ్యూటీ! అంతేగాని డిమాన్‌స్ట్రేషన్ ఇవ్వాల్సిన అవసరం మాకు లేదు"

"అంటే ఉతికి చూపించనంటారు? " భాస్కర్రావ్‌కేసి అదోలా చూస్తూ అందామె. అదోలా అంటే- "అలాగైతే నీ బోడి సబ్బుల్ని ఎవడు కొంటాడోయ్? " అన్నట్టుగా అన్నమాట.

"మీరు కొనే ఒక ట్రెండు సబ్బులకోసం నన్నిక్కడ చాకిరేవు పెట్టమంటే ఎలా మేడమ్? " దీనంగా అన్నాడు భాస్కర్రావ్.

"అదీగాక నాకు బట్టలుతకడం అంతగా రాదు..."

"అలా అంటే ఎలాగండీ? నాణ్యత తెలుసుకోకుండా మీ సబ్బుల్ని నన్నెలా కొనమంటారు? "

'అలాగైతే కొనొద్దులెండి. మీరు కొనకపో

యినా మరేం కొంప మునిగిపోదు' అనే ధ్ధామా అనుకున్నాడుగానీ, ఇకనుంచి సిన్సియర్‌గా అమ్మాలని తానంతకుముందే తీసుకున్న నిర్ణయం గుర్తుకొచ్చి ఆగిపోయాడు. "పోనీ ఒకపని చెయ్యండి మేడమ్! నేనిక్కడే కూర్చుంటాను. ఆ ఉతికేదేదో మీరే ఉతకండి..." అంటూ చేతిలోని సబ్బుని ఆమె కందించాడు.

దాన్నందుకుంటూ అడిగిందామె "ఎంత? '

"మార్కెట్ ప్రైసైతే రెండున్నర మేడమ్! కానీ నేను కంపెనీ తరఫున వచ్చాను కాబట్టి ఫిఫ్టీ పర్సెంట్ డిస్కౌంట్. అంటే వందగ్రాముల సబ్బు కేవలం రూపాయి పావలా మాత్రమే అన్నమాట. జస్ట్ ఒన్‌రూపీ ట్వెంటీఫైవ్ పైసా..."

"మురికి వదలకపోతే డబ్బులిచ్చేది లేదు సుమా..." బెదిరిస్తున్నట్టుగా అందామె.

"అలాగే కానీండి మేడమ్. మురికి వదలకపోయినప్పుడుగా" ధీమాగా అన్నాడు భాస్కర్రావ్.

"సరే అయితే" అంటూ లోనికి వెళ్ళిన ఆ ఇల్లాలు ఓ అయిదు నిముషాల తర్వాత తిరిగొచ్చి "ఛీ!" అంటూ చేతిలోని సబ్బుని భాస్కర్రావ్ కాళ్ల దగ్గర పడేలా విసిరిగొట్టింది.

"ఏం మేడమ్? బాగా ఉతకలేదా? " భయం భయంగా అడిగాడు భాస్కర్రావ్.

"బాగా ఉతకటానికది సబ్బయితేకదా? చెక్కముక్క. ఓ నురుగూ లేదు, పాడూ లేదు" ఈసడింపుగా అందామె.

"మీవి ఉప్పునీళ్లేమో మేడమ్..." 'సో- ఈ సబ్బులు బాగా పన్జేయవన్నమాట' అని మనసులో అనుకుంటూ పైకి మాత్రం ఓ వంక వెతికాడు భాస్కర్రావ్.

"మావి ఉప్పునీళ్లే కాదు. నల్లా నీళ్లే" 'నేరం నాది కాదు. నీ సబ్బుదే' అన్నట్టుగా చూస్తూ అందామె.





"కానీ మీరుతికింది మసిగుడ్డని కదా! దానికి నూనెలాంటిది అంటడంవల్ల నురగ రాకపోవటం జరిగుండొచ్చు. పోనీ మురికైనా వదిలిందా? "

"వదల్లేదు" కాస్త కటువుగా అందామె.

"పోనీలెండి. నో ప్రాబ్లెమ్! మీకు నచ్చినప్పుడు మీరీ చెత్తసబ్బుని బలవంతంగా కొనాల్సిన అవసరంలేదు. వస్తా మేడమ్... సారీ ఫర్ ది ట్రబుల్" వెర్రి నవ్వు నవ్వుతూ లేచి నిలబడ్డాడు భాస్కర్రావ్.

"అంటే అది చెత్త సబ్బని మీకు ముందే తెలుసన్నమాట? "

"అబ్బే... అహc... అహం అహc..." ఆమె అలా అడిగేసరికి కంగారు పడిపోయాడు. "నేనీ ఉద్యోగంలో ఈరోజే చేరాను మేడమ్! ఏదో వాళ్లమ్మమన్నారు. నేనమ్ముతున్నాను. అది చెత్తసబ్బని మీరు చెప్పేదాకా నాకూ తెలీదు..." అంటూ కంగార్లో అసలు విషయం చెప్పేశాడు.

"భలే బావుందిది" అంటూ ఫకాల్న నవ్విందామె.

"సారీ మేడమ్... అయామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ" భాస్కర్రావ్ సూట్‌కేస్ చేతిలోకి తీసుకుని గడప దాటుతుంటే "మీ సబ్బు" అంటూ వెనుకనుంచి అరిచిందామె.

"ఫర్వాలేదు ఉంచండి మేడమ్! చెక్కలా ఉందన్నారుగా, గోడకు మేకులు కొట్టుకోడానికైనా పనికొచ్చుద్ది" అనేసి గడపదాటేసి ముందుకు సాగిపోయాడు భాస్కర్రావ్.

ఆ ఇంట్లోంచి బైటికొచ్చేశాక అప్పుడు గుర్తొచ్చింది భాస్కర్రావ్‌కి... ఆ ఇంట్లో తన సుకేశిని ఉందో లేదో తేల్చుకోకుండానే తానొచ్చేడన్న సంగతి.

'అరెరెc... ఎంత పొరపాటైపోయిందీ? ' అన్నట్టుగా అతను నాలుక్కరుచుకుంటుంటే, అతని అంతరాత్మ ఎగతాళిగా నవ్వింది...

"ఎలా తెలుసుకుంటావోయ్? నీ అదృష్టం బాగుండి ఏ ఇంట్లోనైనా నీ సుకేశిని మళ్లా ఏక్సిడెంటల్‌గా నీకు తారసపడితే పడాలే తప్ప 'ఏమండీ మీ ఇంట్లో నా సుకేశిని

ఉందా?' అని నువ్వెవ్వర్నీ అడగలేవుకదా?

అంతరాత్మ అలా అంటుంటే 'నిజమే కదా?' అనిపించి నీరసించిపోయాడు భాస్కర్రావ్. డ్రిల్లింగ్ మిషన్‌తో శరీరానికి కన్నంచేసి తనలోని ఉత్సాహాన్నంతా ఎవరో స్ట్రాతో పీల్చేస్తున్నట్టుగా అనిపించిందతగాడికి.

ఈ దిక్కుమాలిన చెక్కముక్కల్ని అమ్మే ఉద్యోగంవల్ల తన సుకేశిని తనకి కనిపించి తీర్తుందన్న గ్యారంటీ ఏమీ లేనప్పుడు మరెందుకొచ్చిన పాట్లివి? వెళ్ళి చెక్కముక్కల సూట్‌కేస్‌ని పావనమూర్తి ముఖాన్న కొట్టేసి వెధవ ఉద్యోగానికి రాజీనామా చేసేస్తే పోలా?

భాస్కర్రావ్ అలా అనుకుంటుంటే, 'తొందరపడకు నిదానమే ప్రధానం... తొందరపడకు నిదా...' అంటూ అంతరాత్మ అతన్ని హెచ్చరించింది.

"ఏమి నిదానమో నా బొంద నిదానం" భాస్కర్రావ్ అంతరాత్మతో అన్నాడు. "నా ప్రియ సుకేశిన్ని నాకు మళ్ళీ కన్పించేలా చెయ్యని ఈ బోడి ఉద్యోగం నాకెందుకు?"

"కన్పించేలా చెయ్యదని నేనేం ఖచ్చితంగా చెప్పలేదుగా? కన్పించవచ్చు... బట్ ఇట్ డిపెండ్స్ అపాన్ యువర్ లక్"

"నా కంత లక్కుందంటావా?"

"లేదని ఎందుకనుకోవాలి?"

"అంతేనంటావా?"

"అంతే"

అంతరాత్మ అలా ధైర్యం చెప్పటంతో కోల్పోయిన ఉత్సాహాన్ని తిరిగి తెచ్చుకుని మరో కొంపలో దూరాడు భాస్కర్రావ్. దూరి గతుక్కుమన్నాడు.

ఎందుకంటే... అతను వెళ్ళిన సమయానికి ఆ కొంపలో మొగుడూ పెళ్ళాల మధ్య దేనికోగాని భీకరసంగ్రామం జరుగుతూ ఉంది.

ఏంటేంటో గట్టిగట్టిగా అరుచుకుంటూ ఉన్నారు.

వెళ్ళకూడని సమయంలో వెళ్లానని గ్రహించి భాస్కర్రావ్ చటుక్కున వెనుదిరగబోతుంటే ఆ ఇంటాయన కటువుగా అడిగాడు.

"ఎవరయ్యా నువ్వు? ఏం కావాలి!!"

"ఏం లేదండీ... ఏం లేదండీ..." భయపడిపోయాడు భాస్కర్రావ్.

"ఏమీ లేకపోతే ఎందుకొచ్చినట్టు?"

"సారీ అండీ! నేను డార్విన్ డిటర్జెంట్ సేల్స్‌రిప్రజెంటేటివ్‌ని! మండీ బ్రాండ్ వాషింగ్ సబ్బుల్ని మేం కొత్తగా మార్కెట్‌లో ప్రవేశపెడ్తున్నాం... ఇంట్రడక్టరీ ఆఫర్ కింద ఫిఫ్టీ పర్సెంట్ డిస్కౌంట్ ఇస్తున్నాం... చూస్తారా..."

"అవసరం లేదు వెళ్లు..." గాండ్రించినట్టే అన్నాడా ఇంటాయన.

"సరేనండీ" అని భాస్కర్రావ్ వెళ్ళిపోబోతుంటే... "ఆగు" అంటూ సివంగిలా గర్జించింది ఇంటావిడ.

"అవసరం లేదని చెప్పడానికి ఆయనెవరు? ఈ ఇంట్లో బట్టలుతికేది నేను. ఈ ఇంటి ఇల్లాల్ని నేను... చూపెట్టు ఆ సబ్బులేంటో..."

భాస్కర్రావ్ పరిస్థితి కుడితిలోపడ్డ ఎలుకలా అయ్యింది.

'చూపెట్టమంటారా?' అన్నట్టుగా చూశాడు ఇంటాయనకేసి.

"నో... నేనీ ఇంటికి యజమాన్ని. ఈ ఇంట్లో నా మాటే చెల్లాలి. నేనొకసారి అవసరం లేదని చెప్పాక చూపించమనడానికి అదెవత్తె? వెళ్ళిక్కణ్ణించి..." అరిచాడు ఇంటాయన.

"అదేం కుదర్దు... నువ్ చూపించాల్సిందే..." నేనేనా తక్కువ తిన్నది? అన్నట్టుగా తనూ అరిచింది ఇంటావిడ.

"సారీ మేడమ్... వారు చూపించొద్దంటున్నారు... అంతగా కావాలంటే రేపొచ్చి చూపిస్తాలెండి..." భయం భయంగా

అన్నాడు భాస్కర్రావ్.

"ఆయన్తో నీకేంటయ్యా! ఈ ఇంటి ఇల్లాలిగా నేచెబుతున్నాను. నేనిప్పుడే చూస్తాను. చూపించు ఫర్వాలేదు" మొండిగా అంది ఇంటావిడ.

"కాని... వారు..."

"వారూ లేదు, చారూ లేదు. నీకెందుకు నువ్ చూపించు"

"సరే మేడమ్..." అంటూ భాస్కర్రావ్ సూట్ కేస్ తెరవబోతుంటే చటుక్కున అతని మీదకు దూకి చేతుల్రెండూ గట్టిగా పట్టేసుకున్నాడు ఇంటాయన. "నువ్ చూపించటానికి వీల్లేదు"

ఇదెక్కడి చావురా భగవంతుడా! అనుకున్నాడు భాస్కర్రావ్.

కరవమంటే కప్పక్కోపం, విడవమంటే పాముక్కోపం అన్నట్టుగా ఉందిది. ఇప్పుడెలా?

"పోనీ లెండి సార్! ఒక్కసారి చూపించినంత మాత్రాన్న మీకొచ్చే నష్టమేముంది? కొనమని నేనేం బలవంతం చెయ్యన్లెండి. ఒక్కసారి చూపించి వెళ్ళిపోతానంతే..." అన్నాడు అనునయిస్తున్న ధోరణిలో.

అంతే! ఇంటాయన తోకతొక్కిన తాచులా సర్రున లేచాడు. "ఏంటోయ్ నువ్ చూపించేది, ఆవిడ చూసేదీ? నోర్మూసుకుని మర్యాదగా పోతావా లేదా? ..." అంటూ దాదాపుగా కాలరు పుచ్చుకున్నంత పనిచేశాడు.

బతికుంటే బలుసాకన్నా తినొచ్చనుకున్న భాస్కర్రావ్-

"లేస్సార్ చూపించను... చచ్చినా చూపించను..." అంటూ ఇంచుమించు పరుగు లంకించుకున్నాడక్కణ్ణించి.

"ఏయ్ అబ్బాయ్... ఏయ్ సబ్బుల బ్బాయ్..."

వెనుకనుంచి ఇంటావిడ అరుస్తూ పిలవడం వినిపిస్తూనే ఉన్నా- ఒత్తంటించి వదిలిన తారాజువ్వలా సర్రున ముందుకు దూసుకుపోయాడే తప్ప కనీసం వెనక్కి తలైనా తిప్పి చూడలేదు భాస్కర్రావ్.



"లాహిరి లాహిరి లాహిరిలో... ఓహో జగమే ఊగెనుగా..." సన్నగా కూనిరాగం తీస్తూ మరో ఇంటిముందాగిన భాస్కర్రావ్, యధాలాపంగా కాంపౌండ్ వాల్ కేసి చూసి 'హుర్రే' అనుకున్నాడు సంతోషంగా.

'భగవంతుడెంత దయామయుడు?' అనుకున్నాడు సంతోషంగా.

'ఒరే బాచీ అదృష్టమంటే నీదేరా' అనుకున్నాడు సంబరంగా.

'వెతకబోయిన తీగ కాలికే తగలటం అంటే ఇదేరా! నీ పంట పండింది రియల్లీ యు ఆర్ ఎ లక్కీ బాయ్' అనుకున్నాడు సంబరంగా.

సుకేశినీ సదనం...

తెలుగులోనూ ఇంగ్లీష్‌లోనూ రాసున్నప్పుడు ఇంకా సందేహం దేనికి?

తన దేవి ఇల్లు ఇదేనన్న మాట!

తన దేవి కోటి దివ్వెల కాంతులీనుతూ నివసిస్తున్న పవిత్ర దేవాలయం ఇదేనన్నమాట!!

"దేవీ! ఇంత త్వరగా నువ్ నన్నదృష్టవంతుడ్ని చేస్తావని నేను కల్లోకూడా అనుకోలేదు! నీ ఇల్లు... సారీ నువ్వుంటున్న కోవెల ఇంత త్వరగా నాకు దొరికిపోద్దని నేను ఊహామాత్రంగానైనా అనుకోలేదు..." మనసు పులకరించి పోతుండగా ఆ పులక

రింతని తట్టుకోవడానికి క్షణకాలం పాటు కళ్ళు మూసుకున్నాడు భాస్కర్రావ్.

అప్పుడు నోరు తెరిచింది అతని అంతరాత్మ.

"చాల్లే నీ బోడి పులకరింతా నువ్వూను. ప్రేమోన్మాదంలో పడి నువ్ జ్ఞానశూన్యుడివై పోతున్నావు. సుకేశినీ సదనం అని రాసున్నంతమాత్రాన్న ఇది నీ ప్రేయసి ఇల్లెలా అవ్వుద్ది? "

"ఏం- ఎందుకవ్వదు? " అంతరాత్మని ఉక్రోషంగా ప్రశ్నించాడు భాస్కర్రావ్.

"ఒరే శుంఠా! నీ ప్రేయసి పేరు నిజంగా సుకేశిని కాదు కదా? ఆమెకు పొడవాటి జడుంది కాబట్టి, నీకామె నిజనామధేయం తెలియక ప్రస్తుతానికి అలా పిల్చుకుంటున్నావే తప్ప ఆమెకు వాళ్ళ అమ్మా నాన్నలు పెట్టిన పేరు వేరే ఉంటుంది కదా? అందువల్ల ఈ సుకేశినీ సదనంలో నీ సుకేశిని ఉండి తీరాలని రూలేముంది? "

అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు అంతరాత్మ అంత స్పష్టంగా చెప్పాక భాస్కర్రావ్‌కి అప్పుడర్థమైంది తన పొరపాటేంటో. నిజమే స్మా! అనుకుని నీరు కారిపోయాడు.

ఎంత పొరపాటెంత పొరపాటు? ! హేభగవాన్... నువ్వెంత విచిత్ర నిర్దయుడివి? కొద్దిక్షణాల క్రితమే నా గుండెలో కొండంత ఆశను రేపి నన్ను ప్రఫుల్ల మనస్కుడ్ని గావించిన నువ్వు -ఇంతలోనే సైకిల్ ట్యూబ్‌లోంచి గాలి తీసేసినట్టు నాలోని ఆశనంతా గుంజేసి నన్ను శూన్యమనస్కుడిగా చేసేశావూ అంటే... నిజంగా నువ్వెంత విచిత్రమైన మనిషివయ్యా... సారీ దేవుడివయ్యా!" అనుకున్నాడు ఆవేదనగా.

"అదుగో ఆ నిరాశా వాదమే పనికి రాదు..." అంటూ అప్పుడు మళ్ళీ నోరు విప్పింది అతని అంతరాత్మ.

"నిరాశకాక నాకింకేం మిగిలిందని? " ఆవేదనగా శుష్కహాసం చేశాడు భాస్కర్రావ్.

"కేన్సరొచ్చిన వెండితెర హీరోలా ఏంటా నవ్వు? ! మనిషెప్పుడూ ఆశావాదంతో జీవించాలి! నీ ప్రేయసి నిజ నామధేయం సుకేశిని కాకపోయినా ఇది ఆమె ఇల్లే ఎందుకయ్యుండకూడదూ? " అంతరాత్మ అతనిలో ఆశను ఇంజెక్ట్ చేస్తూ అంది. జీవితం చాలా చిత్రవిచిత్రమైంది. కాబట్టి జీవితంలో ఏదీ అసంభవం కాదు. అందువల్ల నీ దేవి ఈ ఇంట్లో ఉండటం కూడా సంభవమే! కనుక వెళ్ళు... వెళ్ళి ప్రయత్నించు..."

దాంతో భాస్కర్రావ్ మళ్లీ ఉత్సాహం లాంటిది కొనితెచ్చుకొని, గేటు తీసుకుని ఆ ఇంటి ఆవరణలోకి ప్రవేశించాడు.

"ఎవరు కావాలి బాబయ్యా!"

వరండా మీద ఓ స్తంభానికానుక్కూర్చుని గుప్పుగుప్పుమని చుట్టపొగ గాల్లోకి వదుల్తోన్న ఓ నౌకరులాంటి మనిషి భాస్కర్రావ్‌ని చూస్తూనే లేచి నిలబడి అతనికి ఎదురొస్తూ అడిగాడు.

"ఇంట్లో ఎవరున్నారు? " అడిగాడు భాస్కర్రావ్.

"అమ్మగారొక్కరే ఉన్నారు..."

"ఏ అమ్మగారూ? "

"ఇంకేయమ్మగారు? సుకేశినమ్మగారు"

నౌకరు జవాబు విని నోట్లో లడ్డూ పెట్టినంతగా సంబరపడిపోయాడు భాస్కర్రావ్.

"అమ్మగారివ్వాళ కాలేజికి వెళ్ళలేదా? " అడిగాడు ఆనందంగా.

"లేదు... ఒంట్లో నలతగా ఉందని సెలవు పెట్టారు..."

ఆ జవాబు విని తల్లడిల్లిపోయాడు భాస్కర్రావ్ "ఏంటి నా దేవికి నలతగా ఉందా? హే భగవాన్ నువ్వెంత నిర్దయుడివయ్యా! ఈ ప్రపంచంలో కోటాను కోట్ల మంది మనుషులుండగా నీకింకెవ్వరూ దొరకనట్టు నా దేవికే నలతగా ఉండేలా చెయ్యాలా? " అనుకున్నాడు మనసులో ఆవేదనగా.

"ఏంటి సుస్తీ? జ్వరమా? " నౌకర్ని అడి

గాడు ఆందోళనగా.

నౌకరు ముసిముసిగా నవ్వి చెప్పాడు.

"సుస్తీ అంటే సుస్తీ కాదండయ్యా! మూడో నెల కదా... వేవిళ్లు... బాగా నీరసించిపోయారమ్మగారు... టానిక్కులూ అవీ వాడ్తూనే ఉన్నారుగాని అయినా కూడా..."

మూడోనెల... వేవిళ్లు...

మెదళ్లో భూకంపం వచ్చినట్టుగా అనిపించింది భాస్కర్రావ్‌కి. "హే భగవాన్! ఏమిటీ వైపరీత్యం? నా దేవికి మూడో నెలేమిటి? వేవిళ్లేమిటి? అయినా ఇదెలా సంభవం? ! కలల్లో నేనామెతో కొంచెం శృతిమించి ప్రవర్తించిన మాట నిజమే అయినా అంతమాత్రానికే నువ్విలా చేయడవేంటి? కన్నెపిల్లకు గర్భం రప్పించడవేంటి? " అనుకున్నాడావేదనగా.

"నన్ను క్షమించు దేవీ! నీకిలాంటి దుర్గతి ప్రాప్తిస్తుందని తెలీక కలల్లో నీతో కొంచెం శృతిమించి ప్రవర్తించాను" అనుకున్నాడు బాధగా.

"అయినా మరేం ఫర్వాలేదు! నేన్నీక న్యాయం చేయను. నిన్నే పెళ్ళి చేసుకుంటాను" అనుకున్నాడు అయోమయంగా.

అప్పుడు అతని అంతరాత్మ నోరు విప్పింది.

"ఒరే పిచ్చివెధవా! ప్రేమోన్మాదం నీకు బాగా తలకెక్కేసింది. నిజంగానే నువ్ పిచ్చివాడివైపోయావు..."

"అబ్బ ఆపు! నీ గోల నీది... నా బాధ నాది" భాస్కర్రావ్ విసుక్కున్నాడు అంతరాత్మమీద.

"గోల కాదురా శుంఠా... వ్యధ!! ఎలాఉండేవాడివి ఎలాగైపోయావన్న బాధ!!" అంతరాత్మ లబ్బున నెత్తిబాదుకుంటూ అంది. లేకపోతే ఏంట్రా వెర్రిపీనుగా? కలలకీ కడుపు రావటానికీ సంబంధంవేంటి... మతీ సుతీ లేకుండా గర్భవతైనా ఫర్వాలేదు నేను చేసేస్కుంటాను" అని నువ్వనేస్కోడవేంటి? నువ్ చేస్కుంటావు సరే... కాని అందుకామె మొగుడు ఒప్పుకోవద్దూ? "

"ఆమెకింకా పెళ్ళేకాన్దే మొగుడెలా ఉంటాడు? "

"నీబొందా! ఇంకా పెళ్ళి కాన్ది నీ ప్రేయసికి. అంతేగాని ఈ ఇంట్లో ఉంటున్న సుకేశిని అనే పేరుగల ఇల్లాలిక్కాదు... అర్థమైందా? ఈ ఇంట్లో నీ ప్రేయసీ లేదు, పాడు లేదు. నువ్వుత్తినే కంగారుపడిపోతున్నావంతే!"

అంతరాత్మ మాటలు భాస్కర్రావ్‌ని అయోమయంలో పడేశాయి.

అంతే అయ్యుంటుందా.

మూడోనెల వచ్చిన ఈ సుకేశిని తన సుకేశిని కాదా?

కాకపోయుండటానికే అవకాశాలెక్కువగా కన్పిస్తున్నాయ్... కాని ఈవిడ నిజంగా పెళ్ళయిన పరస్త్రీనే అయితే ఇవ్వాళ కాలేజీకి వెళ్ళకపోవటం ఏంటి? ! అంటే పెళ్ళయ్యాక్కూడా చదువుకుంటున్న బాపతా?

"ఏంటండయ్యా మాటాపలుకూ లేకుండా నించుండిపోయారు" నౌకరు మాటలు భాస్కర్రావ్‌ని ఆలోచనల్లోంచి ఇవతలికిలాక్కొచ్చాయ్.

"ఏంలేదు... ఏంలేదు..." అని నవ్వేసి "అయితే మీ అమ్మగారు పెళ్ళయ్యాక్కూడ చదువుకుంటున్నారన్నమాట? " అన్నాడు సమాధానం కోసం చెవులు రిక్కిస్తూ.

నౌకరుకి భాస్కర్రావ్ మాటలు అర్థరహితంగా అన్పించినై.

"అమ్మగారు చదువుకోవడం ఏంటండయ్యా? లెచ్చరరైతేనూ? " అంటూ బుర్ర గీరుకున్నాడు.

దాంతో భాస్కర్రావ్‌లోని సందేహం తీరిపోయింది.

"అమ్మగారు లెక్చరరా- నాకు తెలీదులే! అన్నట్టు మీ అయ్యగారేం చేస్తారు? "





అన్నాడు సూట్‌కేస్‌ని కుడిచేతిలోంచి ఎడమచేతిలోకి మార్చుకుంటూ.

"అయ్యగారు బ్యాంకాఫీసరు కదా? " చెప్పి... మరో మారు బుర్రగీక్కుంటూ అడిగాడు నౌకరు "ఇంతకీ తమరెవరు? "

"నేను డార్విన్ డిటర్జెంట్స్ కంపెనీ నుండి వచ్చాను..."

"ఏంటి పని? "

"మండీబ్రాండ్ వాషింగ్ కేకుల్ని మేం కొత్తగా మార్కెట్‌లోకి ప్రవేశపెట్టాం... అమ్మగారికా సబ్బులు చూపిద్దామని..."

భాస్కర్రావ్ మాట పూర్తిచేశాడో లేదో నౌకరు ముఖం అదోలా అయిపోయింది. అదోలా అంటే "ఓర్నీయప్వా... నువ్ సబ్బులమ్ముకునే వోడివా? !" అన్నట్టుగా అన్న మాట!

అమ్మగారు మీలాంటోళ్ళని చూడ్రు. మాట్లాడ్రు... మిమ్మల్ని గాని లోపలికొదిలానంటే నా ఉజ్జోగం కాస్తా ఊడిపోద్ది, అమ్ముకునే వాళ్లెవరొచ్చినా ఇట్నుండిటే పంపించేయమని స్టిక్ట్ ఆడ్రు. వెళ్ళండి..." పోరా కుయ్యా అన్నట్టుగా గేటువైపు చెయ్యి చూపుతూ అన్నాడు నౌకరు.

అతన్ని బతిమాలి బామాలి భంగపడాల్సిన అవసరం భాస్కర్రావ్‌కేముంది?

అమ్ముడయితే అవుతై- లేకపోతే లేదు. సబ్బులమ్ముకోవడం ఒక్కటే అతని ఏకైక జీవిత ధ్యేయం కాదుగదా?

అంచేత "ఇట్సాల్‌రైట్" అనేసి అక్కణ్ణించి వెనుదిరిగాడు భాస్కర్రావ్.

★ ★ ★

ముచ్చటగా మూడో ఇంట్లో కూడా 'బోణీ బేరం' బాల్చీ తన్నేశాక... చాలా నిరుత్సాహం వచ్చేసింది భాస్కర్రావ్‌కి.

సబ్బులమ్ముకోవడం ఒక్కటే అతని ఏకైక జీవితధ్యేయం కాకపోయినప్పటికీ ఆ ఉద్యోగంలో వేరొకందుకు చేరినప్పటికీ మొత్తానికైతే సబ్బులమ్మాల్సిన బాధ్యత తనమీద ఉంది కదా?

అలాంటప్పుడు మూడు కొంపల్లోను చుక్కే ఎదురైతే చివుక్కు మనిపించదూ మరి?

'ఛి ఛీ... వెధవ ఉద్యోగం' అనుకున్నాడు గాని, 'ని.ప్ర' సూత్రాన్ని మనసులోకి తెచ్చుకుని గుండెని చెక్కముక్కలాంటి వాషింగ్ కేక్‌గా మార్చుకుని మరో ఇంట్లోకి దూరాడు.

మనిషిని సర్వకాల సకలావస్థలయందూ దురదృష్టమే వెన్నాడదు కదా!

నాలుగో ఇల్లు భాస్కర్రావ్‌కి కలిసొచ్చింది.

అక్కడ తనకి సుకేశినైతే కన్పించలేదు గాని, సబ్బులు మాత్రం అమ్ముడుపోయాయి.

ఒకటీ రెండూ కాదు, ఫిఫ్టీ పర్సెంట్ డిస్కౌంట్ అనగానే ఎగబడి ఏకంగా డజను సబ్బులు కొనేసిందా ఇంటి ఇల్లాలు.

'దొడ్డఇల్లాలు' అనుకున్నాడు భాస్కర్రావ్ ఆనందంగా. ఆమెలో అతని కళ్ళకి ఓ 'కొనుగోలు' దేవత కనిపించింది.

"థాంక్యూ మేడమ్! నేనీ ఉద్యోగంలో ఇవ్వాళే చేరాను. మీదే బోణి!" అంటూ నిండు మనసుతో ఆమెకు కృతజ్ఞతలు తెల్పుకుని మరో ఇంటికేసి సాగిపోయాడు భాస్కర్రావ్.

కాస్సేపటితర్వాత.

"దొడ్డ ఇల్లాలి బోణీ బహుదొడ్డది" అనుకున్నాడు భాస్కర్రావ్ బహుసంతోషంగా.

ఎందుకంటే ఈ అయిదో ఇంట్లో కూడా అతనికి ఓ అరడజను సబ్బులమ్ముడుపోయాయి. కానైతే సుకేశిని మాత్రం కన్పించలేదిక్కడ కూడా!

'ఈమె కూడా దొడ్డఇల్లాలే' అనుకుని ఆ ఇంట్లోంచి బైటపడ్డ భాస్కర్రావ్ మరో ఇంట్లో దూరాడు.

ఆపైన మరో ఇంట్లో... ఆపైన వేరొక ఇంట్లో... ఆపైన ఇంకో ఇంట్లో... అలా

అలా సాయంత్రం నాలుగున్నర వరకూ కని పించిన ప్రతి కొంపలో దూర్తూ, సూట్‌కేస్ బరువుని సగానికి పైగా తగ్గించుకోగలిగాడు భాస్కర్రావ్.

లెక్కయితే పెట్టుకోలేదుగాని మొత్తానికి నూటేభయ్ పైచిలుకే ఉంటాయ్ ఆరోజు అతను దూరిన కొంపలు.

సబ్బులమ్మడంలో పడి భోజనం మాట కూడా మర్చిపోయాడేమో, నాలుగున్నర ప్పుడు బాగా ఆకలిగా అనిపించి ఓ హోటల్లో టిఫిన్ చేసి ఆ తర్వాత డార్విన్ డిటర్జెంట్స్ ఆఫీసుకి చేరుకున్నాడు భాస్క ర్రావ్.

"ఎలా ఉందోయ్ ప్రోగ్రెస్?" రీజినల్ సేల్స్ మేనేజర్ పావనమూర్తి అడిగాడు.

"ఫర్వాలేదు సార్... సూట్‌కేస్ బరువు సగం తగ్గిపోయింది" ముఖానికి నవ్వుపులు ముకుంటూ చెప్పాడు భాస్కర్రావ్.

"గుడ్! అంటే వందకు పైగానే అమ్మేవన్న మాట! కీపిటప్" ప్రశంసిస్తూ అన్నాడు పావనమూర్తి. సర్లే... ఎగ్జాక్ట్ ఫిగరేంటో లెక్క చూసి 'డైలీ ప్రోగ్రెస్ ఫామ్' పొద్దున్న నీకిచ్చేను కదా- అందులో నింపివెళ్లు.

"అలాగేసార్" అంటూ సూట్‌కేస్ని బల్ల మీద బోర్లించి, మిగిలిన సబ్బుల్ని లెక్క పెట్టి, తద్వారా అమ్ముడుపోయిన సబ్బు లెన్నో లెక్కతేల్చి "మొత్తం నూటముప్పై సార్!" అన్నాడు భాస్కర్రావ్ ఆనందంగా.

"గుడ్! నువ్విదే స్పీడు గనక మెయిన్‌టేన్ చేస్తే నీకు నెలకి పదిహేనొందలకు పైగానే వస్తాయి! ఇంకా ఇంప్రూవ్ చేయగలిగితే ఇంకా మంచిది నీకూ, మాక్కూడా..."

"అలాగే సార్! ఐవిల్ ట్రై మై లెవెల్ బెస్ట్ టు ఇంప్రూవ్ అవర్ సేల్స్! కానీ..."

"ఊc కానీ?"

మన సబ్బుల క్వాలిటీ ఏమంత బావుండ లేదని ఓ ఇల్లాలు కంప్లైంట్ చేసింది. నురగ రావటం లేదట. మురికిపోవటంలే దట. చెక్కముక్కలా ఉందట! అంచేత క్వాలిటీ పరంగా మన ప్రొడక్ట్‌ని ఇంకాస్త ఇంప్రూవ్ చేస్తే బావుంటుందేమో సార్..." అమ్మినుత్సాహంలో ఓ బోడి సలహా ఇచ్చాడు భాస్కర్రావ్.

"నురుగు రావాలి, మురికిపోవాలి, చెక్క ముక్కలా ఉండకూడదూ అంటే నాల్రూపా యలు పెట్టి ఏ ఫన్నో గిన్నో కొనుక్కోవాలి. పిండి కొద్దీ రొట్టి కదా!? అధ్సరే మన సబ్బు యొక్క క్వాలిటీ గురించి అప్పుడే ఆ ఇల్లాలికెలా తెలిసింది? ఆ ఏరియాకి ఇంత కుముందు నేనెవర్నీ పంపలేదే?" ముక్కు పిండుకుంటూ అనుమానంగా అడిగాడు పావనమూర్తి.

"మన సబ్బులు మురికి బెదిరి పారిపో యేలా ఉతుకుతాయని నేన్చెప్తే ఆవిడ నమ్మకుండా ఉతికి చూపించమంటూ ఓ మసిగుడ్డని తీస్కొచ్చి నా మొహాన్న పారే సిందండీ... అప్పుడు" అంటూ ప్రారంభించి ఆ ఇంట్లో జరిగిన విషయం వివరించి చెప్పాడు భాస్కర్రావ్.

"చంపావ్‌పో" అంటూ నుదుటిమీద చిన్నగా బాదుకున్నాడు పావనమూర్తి. మనవి నిజంగా చెక్క సబ్బులే మురికీ పోదు, పాడూపోదు. అంచేత ఇంకెప్పుడూ ఇంకెవ్వరికీ అలా మన సబ్బుల్ని టెస్ట్ చేసే అవకాశం ఇవ్వబాకు"

భాస్కర్రావ్ ఆశ్చర్యంగా చూశాడు. "అంటే మనది నిజంగానే నాసిరకం ప్రొడక్ట న్నమాట! మరలాంటప్పుడు ఒకసారి వాడి చూసిన వాళ్ళు మళ్ళీ వాడ్రు కదా? ఇంక మన ప్రొడక్ట్ మార్కెట్లో ఎలా సక్సెస్ అవ్వుద్ది సార్?" దవడలు నొక్కుకుంటూ అడిగాడు.

"అదే మన బిజినెస్సీక్రెట్టు! మనం ఏ బ్రాండ్ నైనా ఒక్క సారే ఉత్పత్తి చేస్తాం. ఒక్కసారే అమ్ముతాం! అంటే ఈ మండీ బ్రాండ్ సబ్బులు స్టాకైపోయాక, ఈసారి ఏ డాంకీ బ్రాండ్ సబ్బులో ఉత్పత్తి చేస్తాం








ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

అక్టోబర్ చతుర నవల బాచీ ..........

సమీక్షకుని పేరు : ..........

చిరునామా : ..........

..........

..........

..........

# ఏరిన ముత్యాలు

☆ మనస్సులో సంఘర్షణ ఆరంభమైతేగాని మనిషిలో విలువ ఏర్పడదు.

-బ్రౌనింగ్

☆ నీవు సంపాదించేదానికన్నా తక్కువ ఖర్చు చేయగలిగితే నిన్ను మించిన ఆర్థికనిపుణుడు వుండడు.

-ఫ్రాంక్లిన్

☆ అందరిచేత మెప్పులు సంపాదించుకునేవాళ్లు సర్వనాశనమైపోతారు. సర్వనాశనమైపోయినవారినే ప్రపంచం మెచ్చుకుంటుంది.

-అరిలియస్

☆ ఈ జీవిత సముద్రాన్ని దాటడానికి స్నేహాన్ని మించిన నావలేదు.

-ఫోర్ట్స్

☆ ఉన్నత మనస్కుడు ఒకరిని అవమానించడు- అవమానాన్ని సహించడు.

-హెూమ్

☆ నిన్నెవరూ ప్రేమించకపోతే నిశ్చయంగా అది నీ తప్పే అని తెలుసుకో.

-డాడ్రిడ్జ్

☆ విమర్శవల్ల సాహిత్యంలో అభిరుచులు వ్యక్తమవుతాయి.

-టి.యస్. ఇలియట్

☆ నీవు అధికారివైతే అప్పుడప్పుడూ చూచీ చూడనట్లు ఉండు. సేవకుడవైతే వినీవిననట్లుండు.

-మన్నన్

☆ వీరుడికంటే శాంత స్వభావుడు శ్రేష్ఠుడు. విజేతకంటే మనోవికారాలను జయించినవాడు ఘనుడు.

-బైబిల్

☆ ఒక జీవితకాలపు సంతోషాన్ని ఏ మనిషీ భరించలేడు. అది భూతలనరకం.

-బెర్నాడ్‌షా

☆ ఓర్పులేని మనిషి నూనెలేని దీపం వంటివాడు.

-సెగోనియా

☆ భగవంతుణ్ణి కూడా తప్పించుకుని తిరుగగలవాడే రాజకీయనాయకుడు.

-షేక్స్‌పియర్

☆ మనిషి విజయం, ఆర్జించిన డబ్బును బట్టిగాక సాధించిన మనశ్శాంతిని బట్టి తెలుస్తుంది.

-అరిస్టాటిల్

☆ జీవితమనే విందు తరువాత మృత్యువనే పానీయం సేవించక తప్పదు.

-గాలిబ్

సేకరణ: పట్నాం శేషంశెట్టి

అన్నమాట!" పావన మూర్తి చిత్రవిచిత్రంగా నవ్వుతూ నిజం కక్కేశాడు.

భాస్కర్రావ్‌కి మతిపోయింది.

"ఎందుకు సార్ ప్రజల్ని అలా మోసం చేయటం? ఆ ఉత్పత్తి చేసేదేదో మంచి సబ్బుల్నే ఉత్పత్తి చేయొచ్చుగా?"

"అలా చేస్తే మనకి రూపాయకు రూపా యెలా మిగులుద్ది? అయినా అవన్నీ నీకెం దుకు? నీ డ్యూటీ ఏదో నువ్ చెయ్ చాలు" అనేశాడు పావనమూర్తి రవంత చిరాగ్గా చూస్తూ.

'అవున్నాకెందుకూ?' అనుకున్న భాస్క ర్రావ్ "అలాగే సార్!" అంటూ బుద్ధిగా తలాడించాడు.

"ఎలా ఉంది బాబీ నీ ఉద్యోగం? ఎన్ని సబ్బులమ్మేవ్ ఇవ్వాళ? మనింటికేవన్నా తెచ్చావా?"

అలసిపోయి ఇంటికొచ్చిన భాస్కర్రావ్‌కి మంచినీళ్లందిస్తూ అడిగింది సౌభాగ్యలక్ష్మి.

"బాగానే ఉంది పిన్నిగారూ మొత్తం నూట ముప్పై సబ్బులమ్మేను"

"అయితే ఫర్వాలేదన్నమాట..." ఆ రోజుకు అతనికి కమీషన్ ఎంతొస్తుందో మనసులో లెక్కగడుతూ అంది సౌభాగ్య లక్ష్మి.

మరే అన్నట్టుగా తలెగరేశాడు భాస్క ర్రావ్.

"ఏవీ మనింటి వాడకానికి నాలుగు సబ్బు లైనా తెచ్చావా?" చేతులు ఖాళీగా ఉన్నాయ్ కాబట్టి బహుశా ఫ్యాంటు జేబులో పెట్టుకొ చ్చుంటాడనుకుంటూ అడిగింది సౌభాగ్య లక్ష్మి.

"అబ్బే అవి మనింట్లో వాడ్డానికి పనికి రావు పిన్నిగారూ! ఉత్తచెత్త సబ్బులు, చెక్క ముక్కలు" అంటూ విషయం యావత్తూ ఆమెకు వివరించాడు భాస్కర్రావ్.

"భలే ఉద్యోగమయ్యా మొత్తానికి" అంటూ సౌభాగ్యలక్ష్మి పడిపడి నవ్వింది.

మరో రెండు గంటల తర్వాత డ్యూటీ నుండి ఇంటికొచ్చిన వరహాలరాజు కూడా భాస్కర్రావ్‌ని ఉద్యోగ విశేషాలడిగి తెలుసు కుని ఆ పనే చేశాడు.

అంటే ఆయన కూడా పడిపడే నవ్వేడన్న మాట.

"సో... జనాన్ని మాయమాటల్తో మభ్య పెట్టి సబ్బులంటూ చెక్కముక్కలంటగడ్తు న్నావన్నమాట. జాగ్రత్త... ఒకసారి వెళ్లిన ఇంటికి మళ్లీ వెళ్లబాకు. వీపు చీరేయగల్రు" అన్నాడు నవ్వటం అయ్యాక.

"అలాంటి ప్రమాదమేమీ లేదులే బాబా య్‌గారూ! ఒకసారి వెళ్లిన ఇంటికేకాదు, అసలా ఏరియాకే మళ్లీ పంపరు మా కంపెనీ వాళ్లు.." బిడియంగా నవ్వేడు భాస్కర్రావ్.

"అవున్లే పంపితే వీపు చీరేస్తారని వాళ్లకు మాత్రం తెలీదా ఏంటి?" అంటూ తనూ నవ్వేశాడు వరహాలరాజు.

★ ★ ★

రోజులు చకచకా దొర్లిపోసాగినై...

రోజూ గాడిద మోత మోస్తూ సిటీలోని అనేకానేక ఏరియాల్లోని అనేకానేక ఇళ్లల్లో దూర్తూ చెక్క సబ్బుల్నైతే బాగానే అమ్మగ లుగుతున్నాడుగాని... పాపం భాస్కర్రావ్‌కి ఏ ఒక్క ఇంట్లోనూ తన దేవి దర్శనం మాత్రం కాలేదు.

కనీసం రోడ్డుమీద కూడా మళ్లీ ఎప్పుడూ ఎక్కడా ఆమె తారసపడలేదు.

అయినా సహనాన్ని కోల్పోకుండా, ఆశను చంపుకోకుండా 'ని.ప్ర' సూత్రాన్ని అను నిత్యం మనసులో మననం చేసుకుంటూ, వేరే ఉద్యోగం కోసం ప్రయత్నించటం దాదా పుగా మానేసి అలాగే చాలా సిన్సియర్‌గా కష్టపడసాగాడు.

'కష్టేఫలి!' అన్నారుకదా పెద్దలు? దాదాపు ఓ నెల్రోజులు గడిచేక... ఒక రోజు... ఒక ఇంట్లో...

అతనికి సుకేశిని కనిపించిందికానీ ఈమె



ఆమెకాదు. వేరొక సుకేశిని. ఈమెకూడా అందంగానే ఉంది. కానైతే ఆ సుకేశినంత అందంగా కాదు. ఈమెక్కూడా పొడవాటి జడే ఉంది. అది ఇంచుమించు ఆ సుకేశిని కున్నంతే ఉంది.

అందం కొంచెం తక్కువైనా జడలు సేమే కదా? ఆ సుకేశిని సిటీ అంతా గాలిస్తున్నా కనిపించి చావట్లేదు. అసలు మళ్లీ కనిపిస్తుందో లేదో కూడా తెలీదు. ఎండమావి వెంట పరుగులీసినట్టు కనిపించని ఆ సుకేశిని కోసం వెంపర్లాడటం కన్నా కనిపించిన ఈ కొత్త సుకేశిన్ని ప్రేమిస్తే ఎలా ఉంటుంది? అన్న ఆలోచన భాస్కర్రావ్‌కి రావడమైతే వచ్చిందికాని... తన మనో దౌర్బల్యానికి సిగ్గుపడ్తూ దాన్ని మొగ్గలోనే తుంచేశాడతను.

"శ్రీరామచంద్రమూర్తి జన్మించిన ఈ పవిత్ర భూమిలో పుట్టిన నీవు అలాంటి ఆలోచన్ను మనసులోకి రానివ్వటానికి సిగ్గు లేదూ? భారత పురుషుడెప్పుడూ తన హృదయంలో ఒక్క స్త్రీకే చోటిస్తాడు. ఇరవై రోజుల అన్వేషణకే నువ్విలా ఇదైపోతే ఎలా? ప్రేయసి కోసం తన సర్వస్వాన్నీ త్యాగం చేసిన పవిత్ర ప్రేమ పురుషులు న్నారీ దేశంలో. కావాలంటే ఒక్కసారి దేశ చరిత్రను తిరగేసి చూడు... అలాంటి ఈ పవిత్ర గడ్డపై పుట్టిన నువ్వు నీ ప్రేయసి కోసం కనీసం ఓ ఏడాదైనా అన్వేషించ లేవా? ఇంతేనా నీ ప్రేమ? ఇదేనా నీ మనో నిబ్బరం? ఇలా పొడవాటి జడున్న కొత్త అమ్మాయి కన్పించినప్పుడల్లా మనసు మార్చేసుకుంటూ పోతే ఇంక నీ ప్రేమకి అర్థమేముంది? నిజమైన ప్రేమంటే ఓ పెట్టిన గోడలాంటిది. ఎన్ని అగ్ని పరీక్షలెదురైనా అది చెక్కుచెదరదు! అయినా కాకపోయినా ఆ సుకేశిని అందంతో పోలిస్తే ఈ సుకేశిని అందం ఏపాటిది? " అంటూ అంతరాత్మ చాలా సుదీర్ఘంగా హితబోధచేయడం వల్ల ఆ రోజు రాత్రి ఒంటరిగా ఉన్నప్పుడు అలాంటి దుష్టాలోచన్ని తన మనసులోకి రానిచ్చినందుకు వంద గుంజీళ్లు కూడా తీసి తన పాపానికి తానే ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు.

తద్వార 'ఆ' సుకేశిని పట్ల తనగ్గల సిన్సియర్ ప్రేమను తనకు తానే సిన్సియర్‌గా చాటి చెప్పుకున్నాడు.

అలా ఇంకొన్ని రోజులు జరిగిపోయాక.. ఒకరోజు ఒక ఇంట్లో... భాస్కర్రావ్ పంట పండిపోయింది. అతని గుండె ఆనందంతో నిండిపోయింది.

'ఆ' సుకేశిని, అంటే అసలు సుకేశిని, అంటే తొలిచూపులోనే అతని హృదయాన్ని కొల్లగొట్టేసిన సుకేశిని, ఏ సుకేశిని కోసమైతే అతనిన్నాళ్లూ చెక్క సబ్బుల సూట్‌కేస్‌ని గాడిదలా మోస్తూ నగరమంతా గాలించాడో ఆ సుకేశిని, అతని ప్రాణేశ్వరి అతనికా ఇంట్లో కనిపించేసింది.

ఆ ఇంట్లో ఆమెను చూస్తూనే ముందసలు తన కళ్లని తానే నమ్మలేకపోయాడు భాస్కర్రావ్.

తనుగాని భ్రమపడుతున్నాడా? అన్న కుశంకకు లోనై ఓ మారు కళ్లు నలుముకుని మరీ చూశాక... ఎదురుగా ఉన్నది నిస్సందేహంగా తన ప్రియ సుకేశినేనని నిర్ధారణైపోయాక... గుండె ఆనందంతో నిండిపోయి ఆ బరువును తట్టుకోలేక ముందుకు తూలి పడ్డాడు భాస్కర్రావ్.

"అరెరె... ఏంటలా పడిపోయారు? " అంటూ అతనికి ఎదురొచ్చింది సుకేశిని.

అప్పటికతనింకా ఆ ఇంట్లో పూర్తిగా ప్రవేశించనే లేదు. గేటు తోస్కుని అలా లోపల కాలు పెట్టాడో లేదో అతనికి ఆ ఇంటి వరండాలో అతని ప్రియ సుకేశిని కనిపించింది. ఆ ఇంటి గేటుదగ్గరే అతనలా తూలి పడిపోయాడు.

సుకేశిని అలా అడుగుతూ తనని సమీపి




స్తుంటే పరవశించి పులకరించిపోయాడు భాస్కర్రావ్.

కొంపదీసి మూర్ఛరోగా? అని కంగారు పడిపోతూ వడివడిగా అతన్ని చేరుకున్న సుకేసిని "ఎవరండీ మీరు? ఎవరు కావాలి మీకు?" అంది అతనికేసి జాలిగా చూస్తూ.

'ఎంత అన్యాయంగా మాట్లాడుతున్నావు సుకేశినీ? నన్నేడిపించటానికి కాకపోతే ఏంటా మాటలు? నేనెవర్నో నీకు తెలీదా? నాకెవరు కావాలో నీకు తెలీదా?' అనుకున్నాడు భాస్కర్రావ్ ఆవేదనగా.

అయినా కూడా ఆనందం...

ఆవేదనలోనే ఆనందం!

కనిపించదేమో ననుకున్న తన ప్రేయసి ఎట్టకేలకు కనిపించిందన్న ఆనందం!

కనిపించి కళ్లెదుట నిలబడి తనకేసి జాలిగా చూస్తూ ఉందన్న ఆనందం...

అతన్ని మరోసారి పులకరించి కులకరించి పోయేలా చేసింది.

దాంతో "ఆమె నీకు మూర్ఛరోగమేమో అనుకుంటున్నట్టుందిరా... లే.. లేచి సరిగ్గా నిలబడు" అని అంతరాత్మ హెచ్చరించిన మీదట లేచి నిలబడి ఒంటికంటిన మట్టిని దులుపుకున్నాడు.

"మిమ్మల్నెక్కడో చూసినట్టుందే..."

సుకేశిని తనకేసి ఎగాదిగా చూస్తూ అలా అంటుంటే గుండెని రంపంతో కోస్తున్నట్టుగా అనిపించింది భాస్కర్రావ్‌కి.

అంతే! అతను ఆవేదనతో ఏమిటేమిటోగా అయిపోయాడు.

'ఎంత మాటన్నావ్ సుకేశ్! నన్నెక్కడో చూసినట్టుందా? అంటే నేన్నిన్ను నా గుండెల్లో ప్రతిష్ఠించుకున్నట్టు నువ్వు నన్ను నీ గుండెల్లో ప్రతిష్ఠించుకోలేదా? రోజూ నువ్వు నా కలల్లోకొచ్చి నన్ను కవ్వించటం లేదా? ఏమిటీ తిరకాసు? ఎక్కడుంది లోపం?' అనుకున్నాడు మనసులో మంటలు చెలరేగిపోతుండగా.

"లోపం నీ ముఖంలోనే ఉందిరా" అంటూ నోరు విప్పింది అతని అంతరాత్మ.

"నా ముఖంలోనా?" భాస్కర్రావ్ ఆశ్చర్యంగా అడిగాడు అంతరాత్మని.

"అవును నీ ముఖాన్ని నువ్ రోజూ అద్దంలో చూసుకుంటూనే ఉన్నావుగా? నీదేపాటి అందమో నీకు తెలీదా?"

"అంటే ఏంటి నీ ఉద్దేశం? నేను కురూపిననా?"

"కురూపివి కాకపోవచ్చు ఓ మోస్తరు అందగాడివేకావచ్చు కాని అపర మన్మధుడివి కావుకదా? నీకన్నా అందగాళ్లు ఈ ఆంధ్ర దేశంలో అనేకానేక మందుంటారు. అవునా?"

"అవును అయితే ఏంటంట?"

"అక్కడే వచ్చింది తంటా. నువ్వేమో సాధారణమైన అందగాడివి. ఆమేమో అపురూప సౌందర్యరాశి. అంచేత ఆమె అందం నిన్నాకర్షించినట్టు నీ అందం ఆమె నాకర్షించలేదన్న మాట! అర్థమైందా బుజ్జికన్నా?"

అంతరాత్మ మాటల్లోని ఎగతాళిని అంతగా పట్టించుకోలేదు భాస్కర్రావ్. "అయితే నా దేవి నన్ను ప్రేమించటం లేదంటావ్. మరిప్పుడెలా?" అన్నాడు ఆందోళనగా.

"ఎందుకోయ్ అంత కంగారు? నువ్వామెను తొలిచూపులో ప్రేమించేసినట్టు నిన్నామె కూడా తొలి చూపులోనే ప్రేమించేసేయాలని రూలేముంది? నిదానంగా ప్రేమిస్తుందిలే! తొందరపడకు..."

అంతరాత్మ అలా అనేసరికి భాస్కర్రావ్‌కి 'ని. ప్ర' సూత్రం గుర్తుకొచ్చింది.

'అవును నిదానమే ప్రధానం. ఆమె నిదానంగా నన్ను తప్పకుండా ప్రేమించుద్ది' అనుకున్నాడు ఆనందంగా.

దాంతో అతని మనసు కొద్దిగా కుదుటపడింది.

కుదుటపడిన మనసుతో సుకేశినికేసి తన్మయంగా చూస్తూ, "నన్ను గుర్తుపట్టలే



దాండీ? " అన్నాడు ఊహల్లోంచి పూర్తిగా వర్తమానంలోకొచ్చేస్తూ.

లేదన్నట్టు అడ్డంగా తలాడించింది సుకేశిని.

"ఒకరోజు అమీర్‌పేటలో నేను మా చిన్నాకి డ్రెస్ కొంటున్నప్పుడు మీరు అక్కడ కనిపించి నాకో చీర సెలక్ట్ చేసిపెట్టారు... నా కంటే మా పిన్నిగారికన్నమాట! గుర్తొచ్చిందా? " అన్నాడు భాస్కర్రావ్, మనసులో అబ్బ! ఎంతందంగా తలాడించావ్ దేవీ అనుకుంటూ.

"నేనా? మీకు చీర సెలక్ట్ చేసి పెట్టానా? ఎప్పుడూ? " అంది సుకేశిని రవంత ఆశ్చర్యంగా.

అబ్బ! ఎంతందంగా ఆశ్చర్యపోతున్నావ్ దేవీ? అని మనసులో అనుకుని,

" సెలక్ట్ చేసి పెట్టటం కాదులెండి. నాకు సేల్స్‌మేన్ చీరలు చూపిస్తుంటే ఒక చీరని చూపి అదెంత? అనడిగారు మీరు. మీకు నచ్చిందా? నచ్చితే మీరే తీస్కోండి పోనీ అని నేనంటే ఈ డిజైన్ నాలా సన్నగా నాజూగ్గా ఉన్నవాళ్లకి బాగుండదు లావుగా ఉన్నవాళ్లకే బాగుంటుంది అన్నారు మీరు. మీరలా అన్నారుకదాని చెప్పి మీ మాటని మన్నిస్తూ ఆరోజు నేను మా పిన్నిగారికి ఆ చీరనే తీసుకెళ్లాను..." అంటూ బాగా గుర్తొచ్చేలా వివరంగా గుర్తుచేశాడు భాస్కర్రావ్.

"అవునవును గుర్తొచ్చింది" అంటూ నిలువుగా తలాడించింది సుకేశిని.

"అబ్బ! ఎంతందంగా నిలువుగా తలాడిస్తున్నావు దేవీ!" అనుకున్నాడు భాస్కర్రావ్ పరవశంగా. "హమ్మయ్య! గుర్తొచ్చానన్నమాట!" అన్నాడానందంగా.

తానతని ప్రాణేశ్వరిననీ, తన్నతను అతని గుండెగుడిలో ఓ దేవతగా ప్రతిష్టించుకుని ఆరాధిస్తున్నాడనీ, తనకోసం ఎన్నాళ్లుగానో చెక్కసబ్బుల సూట్‌కేస్‌ని గాడిదలా మోస్తూ నగరమంతా గాలిస్తున్నాడనీ సుకేశినికేం తెలుసు?

తెలిసేందుకు అసలు ఆస్కారమే లేదు కదా?

అంచేత "అద్సరే... మీరు మా ఇంటికెందుకొచ్చినట్టు? ఎవరికోసమొచ్చారు? మానాన్నగారి కోసమా? " అనడిగింది కళ్లు చికిలిస్తూ.

"అబ్బ! ఎంతందంగా కళ్లు చికిలిస్తున్నావ్ దేవీ అని భాస్కర్రావ్ అనుకోబోతుంటే "ఛీ నోర్మయ్యరా ఏబ్రాసి వెధవా మాటిమాటికి అలా అనుకోకూడదు. అందంగా ఉన్నవాళ్లు ఏం చేసినా అందంగానే చేస్తారు. అదీగాక నువ్ మాటిమాటికీ అలా అనుకోవటం వల్ల నీ దేవికి నీ దిష్టే తగిలి, తన్మూలంగా దుష్ఫలితాలెదురవ్వచ్చు కూడా" అంటూ అతని అంతరాత్మ అతన్ని మందలించింది. దాంతో అలా అనుకోవటం మానేసి, "నేను డార్విన్..." అంటూ అసలు సంగతి చెప్పబోతూ మధ్యలో ఆగిపోయాడు.

అందుక్కారణం, "ఒరేయ్ నువ్ గుడ్డలు, సబ్బులమ్ముకునే సన్నాసి వెధవ్వని తెలిస్తే నిన్ను గుడ్డిగవ్వక్కూడా కొరగాని వాడిగా జమకట్టేసుద్దిరా నీ ప్రేయసి. సో చెప్పబాకు చెప్పబాకు" అంటూ అతని అంతరాత్మ అతన్ని హెచ్చరించటమే.

కాని ఓ అయిదక్షరాలు అప్పటికే నోటి నుండి బైటికొచ్చేసినై కాబట్టి, బైటికొచ్చిన అక్షరాల్ని తిరిగి నోట్లోకి లాగేస్కోవటం సాధ్యం కాదుకాబట్టి, మళ్లీ మొదలెట్టి 'నేను డార్విన్ టెంజొప్పాగారి కోసం వచ్చానండీ!" అంటూ అతి తెలివిగా ఆ వాక్యాన్ని పూర్తి చేశాడు భాస్కర్రావ్.

సుకేశిని ఆశ్చర్యంగా చూసింది.

"డార్విన్ టెంజొప్పాగారా? ఆయనెవరూ? "

'అబ్బ! ఎంతందంగా ఆశ్చర్యపోతున్నావ్ దేవీ? ' అనుకోబోయి మానేశాడు భాస్కర్రావ్. ఎందుకంటే అంతకుముందేకదా




అతని అంతరాత్మ అలా అనుకుంటే నీదేవికి నీదిష్టి తగులుద్ధి అనిచెప్పింది. అది గుర్తొచ్చి మానేశాడన్నమాట.

"డార్విన్ టెంజొప్పా గారండీ! అదేనండీ కె.సి.కె.సిమెంట్స్ కంపెనీలో ప్రొడక్షన్ మానేజర్‌గా పన్జేస్తారే ఆయన"

అలా అన్నాక తన శక్తికి అంటే తనలో ఉన్న అబద్ధాలాడే శక్తికి తానే ఆశ్చర్యపోయాడు భాస్కర్రావ్.

సారీ దేవీ! నా భావి సతీమణివైన నీతో అబద్ధాలాడక తప్పటంలేదు! నన్ను మన్నించు అనుకున్నాడు మనసులో బాధగా.

"ఇక్కడలాంటి వాళ్లెవ్వరూ లేరు. ఇది సోమసుందరం గారిల్లు మా నాన్నగారి పేరు సోమసుందరం..." అంటూ అతని కేసి అదోలా చూసింది సుకేశిని.

"అలాగాండీ! అయితే సారీ అండీ! ఇది డార్విన్ టెంజొప్పాగారిల్లేమో అనుకున్నాను..." మనసులో కొంచెం భయం లాంటిది కలిగినా దాన్ని పైకి కనిపించనీయలేదు భాస్కర్రావ్.

"ఇది డార్విన్ టెంజొప్పాగారిల్లని మీరెలా అనుకున్నారు?" నిగ్గదీస్తున్నట్టుగా అడిగింది సుకేసిని.

'ఎలాగోలా అనుకున్నాను. అది నీకు చెప్పాలా? ఇలాంటి ఇబ్బందికరమైన ప్రశ్న లేసి నన్ను ఇరకాటంలో పెట్టడం నీకు భావ్యమా దేవీ?' అనుకున్నాడు భాస్కర్రావ్ ఆవేదనగా.

"మరేం లేదండీ! డార్విన్ టెంజొప్పాగారు కూడా ఇదే ఏరియాలో ఉంటారు. ఏరియా ఇదేనని స్పష్టంగా గుర్తుందిగాని ఇంటి నంబరు గుర్తులేదు. మొన్నవార్ని వారి ఆఫీసులో కలిసినప్పుడు ఇంటడ్రస్ ఓ స్లిప్‌మీద రాసిచ్చారు. కాని నా అజాగ్రత్తవల్ల ఆ స్లిప్పెక్కడో పడిపోయింది. నేనొక అత్యవసర పనిమీద వార్ని ఇవ్వాళ తప్పకుండా ఇంటి దగ్గర కలుసుకోవాలి. అంచేత గత్యంతరం లేక ఇలా ప్రతి ఇంట్లోకీ వెళ్లి ఇది డార్విన్ టెంజొప్పాగారిల్లేనా? అనడుక్కుంటూ వస్తున్నానన్నమాట!"

అలా అన్నాక తన అబద్ధశక్తికి అతగాడీ సారి మరింతగా ఆశ్చర్యపోయాడు.

సుకేశిని అదోలా నవ్వింది. అదోలా అంటే 'ఒరే పిచ్చి సన్నాసీ! అంత అత్యవసరమైన పనున్నవాడివి అంత అజాగ్రత్తగా అడ్రస్ పారేస్కుని ఇలా అడుక్కుంటూ తిరగడమేంటి?' అన్నట్టుగా.

మీరు చాలా అందంగా నవ్వుతారండీ అనాలనిపించిందిగాని బావుండదని నిగ్రహించుకున్నాడు భాస్కర్రావ్.

"ఇంటి నెంబర్ తెలీకుండా ఆ టెంజొప్పాగారిల్లు కనుక్కోడం మీకు సాధ్యపడుతుందని నేననుకోనండీ!" అంది సుకేశిని అదోలా నవ్వటం అయ్యాక.

"అయ్యయ్యో అలా శపించకండి..." కంగారు నభినయిస్తూ అన్నాడు భాస్కర్రావ్. "నాకు టెంజొప్పాగారితో చాలా అర్జంటు పనుంది"

"నేనేం శపించటంలేదు. నా అభిప్రాయం చెప్తున్నానంతే"

"కానీ అందమైన వాళ్లకి ఆటోమాటిగ్గా వాక్శుద్ధికూడా ఉంటుందని మా తాతయ్య చెప్తుండేవాడండీ. అంచేత మీరలా అనొద్దు. నాకు టెంజొప్పాగారిల్లు దొరుకుతుందని అనండి. ఆటోమాటిగ్గా మీ వాక్శుద్ధివల్ల అది తప్పకుండా దొరుకుతుందంతే! అన్నట్టు నాపేరు భాస్కర్రావండీ! బాచీ అంటారంతా. మీ పేరు?"

భాస్కర్రావ్ పరోక్షంగా తన అందాన్నంతా పొగడ్డం సుకేశినికి చాలా ఆనందాన్ని కలిగించింది.

ఆ ఆనందం ఆమెలో అతనిపట్ల ఓ మోస్తరు సదభిప్రాయం లాంటిదాన్ని కూడా కలిగించింది.

దాంతో ఓ కోన్‌కిస్కాగాడికి తాను తన

పేరెందుకు చెప్పాలి? అన్న చెడ్డ ఆలోచన ఆమెలో కలగలేదు. అందువల్ల "నా పేరు నవ్య" అంటూ ప్రసన్నంగా ఓ నవ్వు నవ్వి- "వస్తానండీ నాకు లోపల పనుంది" అంటూ చటుక్కున వెనుదిరిగి చకచకా నడుచుకుంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది సుకేశిని... కాదు నవ్య!

"అబ్బ! ఎంతందంగా నడుస్తున్నావ్ దేవీ?" అనుకోబోయి మానేశాడు భాస్కర్రావ్.

ఆమె నడుస్తున్నప్పుడు నల్లత్రాచులాంటి ఆమె పొడవాటి జడ ఆమె పిరుదులపై అటూ ఇటూ వయ్యారంగా ఊగుతుంటే అతనికి తన మనసుపై పూలజల్లు కురుస్తున్నట్టుగా అనిపించింది.

ఆమె ఇంట్లోకి వెళ్ళి తలుపేసుకునేవరకూ అక్కడే నిలబడి ఆ తర్వాత కదల్లేక కదల్లేక అక్కడ్నించి కదిలి గేటుదాటి బైటికొచ్చాడతను. చెక్క సబ్బుల సూట్‌కేస్‌ని మోసుకుంటూ.

అంతే. ఆ తర్వాత అతను మరే ఇంట్లోనూ దూరలేదు.



"అదేంటోయ్? లక్షణంగా అమ్ముతున్నావ్‌గా? మరి ఉద్యోగం మానేస్తానంటున్నావేంటి? ఏం ఇంకేదన్నా మంచుద్యోగం దొరికిందా?" పావనమూర్తి ఆందోళనగా అడిగాడు.

మెరికలాంటి కుర్రాడు చేజారిపోతుంటే పావనమూర్తిలాంటి ఆరెస్సెమ్‌కి అలా ఆందోళన కలగటం సహజమేకదా?

మెరికలాంటి కుర్రాడంటే 'చెక్కసబ్బుల్ని బాగా అమ్మే కుర్రాడు' అని ఆయన అర్థం.

భాస్కర్రావ్ అవును- కాదులకు మధ్యస్తంగా తలూపి అన్నాడు-

"ప్రస్తుతానికింకా ఏమీ దొరకలేదుగాన్సార్... వెతుక్కుంటే దొరక్కపోదు"





"అంటే ఇది మానేసి ఇంకో ఉద్యోగం వెతుక్కుంటానంటావ్? నువ్ వెతుక్కుంటావ్ సరే. కానీ దీనికన్నా మంచి ఉద్యోగం నీకు దొరుకుద్దని గ్యారంటీ ఏంటి? "

"దీనికన్నా చండాలమైన ఉద్యోగం ఇంకేదీ ఉండదు. కాబట్టి, మీరడిగింది మీనింగ్‌లెస్ ప్రశ్నన్నమాట!"

భాస్కర్రావ్ మాటల్లోని వెటకారానికి ఒళ్లు మండిపోయింది పావనమూర్తికి "మరింత చండాలమైన ఉద్యోగాన్ని తమరు సిగ్గు లేకుండా రమారమి రెండు నెలల పాటు ఎందుకు వెలిగించినట్టో? " అన్నాడు రోషంగా.

"బుద్ధిలేక" అంటూ లేచి నిలబడ్డాడు భాస్కర్రావ్.

"అయితే రేపట్నుంచి నువ్ నిజంగానే డ్యూటీకి రావా? " కాస్త మెత్తబడ్డాడు పావనమూర్తి. "ఇలా అర్ధాంతరంగా మానేస్తే ఎలాగయ్యా? మాక్కష్టం కాదూ? "

"ఇందులో మీకొచ్చే కష్టమేముందండీ? నేను కాకపోతే నా ప్లేస్‌లో ఇంకో పుల్లయ్య మ్ముతాడు మీ చెక్కసబ్బుల్ని అంతేకదా? " భాస్కర్రావ్ తేలిగ్గా అన్నాడు.

"అవుననుకో. కాని ఇప్పటికిప్పుడు ఇంకో పుల్లయ్య దొరకాలిగా? "

"ఎందుకు దొరకడూ? ఈ దేశం ఏమన్నా నిరుద్యోగులకు గొడ్డుపోయిందా? పేపర్లో చిన్న యాడ్ ఇస్తే చాలు, పొలోమని వచ్చిపడిపోతారు మీక్కావలసినంత మంది పుల్లయ్యలూ, ఎల్లయ్యలూ"

పావనమూర్తికి దొరికింది భాస్కర్రావ్ పిలక.

"పేపర్లో యాడ్ అంటే ఊరికే వేస్తారనుకుంటున్నావా? డబ్బు తీసుకుంటారు" అన్నాడు అదోలా చూస్తూ.

"తెలుసు..." అన్నాడు భాస్కర్రావ్.

"తెలుసుకదా? అయితే మంచిదే!"

అంటూ ఓ వంకర నవ్వు నవ్వాడు పావన మూర్తి. "పేపరువాళ్లు తీసుకునే ఆ డబ్బు నీ సెక్యూరిటీ డిపాజిట్‌నుండి మినహాయించుకుంటాం"

'పోతే పోయింది వెధవ డబ్బు' అనుకున్నాడు భాస్కర్రావ్.

"మీ ఇష్టం" అన్నాడు దృఢంగా.

"అయితే నీ నిర్ణయాన్ని మార్చుకోవన్న మాట!"

"కోను" అన్నాడు భాస్కర్రావ్ చిలిపిగా ఎలాగూ ఉద్యోగం మానేస్తున్నప్పుడు ఇంకా పావనమూర్తికి భయపడాల్సిన అవసరం తనేకేముంది.

"సరే నీ ఖర్మ. మళ్ళీ ఫిఫ్త్‌నొచ్చి కనబడు. నీకు రావాల్సిన అమౌంట్ సెటిల్ చేస్తాను"

ముఖాన్ని గంటు పెట్టుకుంటూ అన్నాడు పావనమూర్తి.

"సరే" అంటూ ఆనందంగా తలాడించిన భాస్కర్రావ్ "జగమే మారినదీ మధురముగా ఈవేళ..." అని కూనిరాగం తీస్తూ ఆ దిక్కుమాలిన చెక్క సబ్బుల ఆఫీసు నుండి మహదానందంగా బైటికొచ్చేశాడు.

"హమ్మయ్య! పీడ విరగడైంది" అనుకున్నాడు బైటికొచ్చేశాక తృప్తిగా ఊపిరి పీల్చుకుంటూ.



"మరైతే నీ నెక్స్ట్ ప్రోగ్రాం ఏంటి?" భాస్కర్రావ్ ఉద్యోగం మానేసినందుకు ముందుగా సంతోషాన్ని వ్యక్తం చేసి, ఆ తర్వాత అడిగాడు వరహాల్రాజు.

"ఏముందీ? ఇంకేదన్నా మంచి జాబ్ చూస్కోవాలి" అన్నాడు భాస్కర్రావ్.

"ఆ ముక్క నేను ముందే చెప్తే నామాట విన్నావా? పోనీలే ఇప్పటికైనా జ్ఞానోదయమైంది. ఇంకెప్పుడూ తొందరపడి ఇలాంటి చెత్త ఉద్యోగాల్లో చేరబాకు"

వరహాల్రాజు అంటుంటే భాస్కర్రావ్‌కి నవ్వొచ్చింది. రాదామరి? తనేమీ నిజంగా జ్ఞానం లేక కాదుగదా ఆ ఉద్యోగంలో చేర్త? తన దేవిని వెతుక్కోవడం కోసం చేరాడు. తన దేవి తనకిప్పుడు దొరికిపోయింది కాబట్టి మానేశాడు. అత్తెలీక ఆ పెద్దమనిషి అనవసరంగా జాలిపడిపోతూ అలా అంటుంటే నవ్వు రాదామరి?

నవ్వుతున్న భాస్కర్రావ్‌కేసి కించిదయోమయంగా చూశాడు వరహాల్రాజు. "నీ మేలుకోరి హితవు చెప్తుంటే నవ్వుతావేం?"

"ఏంలేదు బాబాయ్‌గారూ! ఆలస్యం అమృతం విషం అనే సూత్రాన్ని నమ్మే మీరు, ఇంకెప్పుడూ 'తొందరపడి' ఇలాటి చెత్త ఉద్యోగాల్లో చేరబాకు అంటుంటే నవ్వొచ్చిందంతే!" అంటూ మార్చేశాడు భాస్కర్రావ్. నిజం చెప్పలేదుకదా మరి?

'సంతోషించాంలే' అన్నట్టుగా కళ్ళెగరేసి "సరే వస్తానోయ్ డ్యూటీకి టైమవుతోంది" అనేసి అక్కడ్నించి వెళ్ళిపోయాడు వరహాల్రాజు.

ఆయన వెళ్ళిపోయాక ఓ తెల్లకాగితాన్ని తీసుకుని గోకారికి ఉత్తరం రాయటం ప్రారంభించాడు భాస్కర్రావ్.

అంతకుముందు అతను చెక్క సబ్బులమ్మే దిక్కుమాలిన ఉద్యోగంలో చేరినందుకు గోకారి తిట్టిపోస్తూ అతనికి ఓ ఉత్తరం రాసున్నాడు. 'అంత దూరం వెళ్ళి నువ్ వెలిగిస్తున్న నిర్వాకం ఇదా? దాని కన్నా హాయిగా నాలాగే ఇక్కడే ఉండి ఏ కిళ్ళీకొట్టో పెట్టుకోవడం మేలుకదా? అదీ ఇదీ' అంటూ.





అప్పట్లో దానికి రిప్లయ్ ఇవ్వకుండా ఊరుకున్నాడు భాస్కర్రావ్.

ఇప్పుడా విషయం గుర్తొచ్చి మిత్రుడికలా లేఖ రాయడం ప్రారంభించాడన్నమాట.

లేఖ రాయటం అయిపోయాక దాన్నో కవర్లో పెట్టి అంటించేశాక, చాపమీద బాసిం పట్లు వేసుక్కూర్చుని కళ్లు మూసుకున్నాడు భాస్కర్రావ్.

అతనూహించినట్టే మూసుకున్న అతని కళ్ళముందు సుకేశిని కాదు నవ్య ప్రత్యక్షమై పోయింది.

"థాంక్యూ వెరీమచ్ నవ్యా! థాంక్యూ వెరీ మచ్" అన్నాడు భాస్కర్రావ్ తన్మయంగా.

"దేనికీ? " అంది నవ్య దీర్ఘం తీస్తూ.

"నన్ను డిసప్పాయింట్ చేయకుండా ఇలా కళ్లు మూసుకున్న వెంటనే అలా ప్రత్యక్షమయిపోయినందుకు" పరవశించిపోతూ అన్నాడు.

నవ్య నవ్వింది... పూలజల్లు కురిసినట్టుగా... తేనె వాన కురిసినట్టుగా...

"పిచ్చి బాచీ! ఎందుకు నేనంటే నీకింత ప్రేమ? " అంది నవ్వటం అయ్యాక.

"ఎందుకంటే ఏం చెప్పనూ? అందుకేననీ ఎలా చెప్పనూ? " అంటూ మనసులో కూని రాగం అందుకున్నాడు భాస్కర్రావ్.

"ఛీపాడు" అంది నవ్య సిగ్గుపడిపోతూ.

అడ్రసంటూ తెలిసిపోయాక ఇంక నవ్య వాళ్ళ ఇంటిముందు బీటు వేయడానికి అడ్డేముంది?

మర్నాటినుంచి అదే ప్రారంభించాడు భాస్కర్రావ్.

అతను తన ఇంటిముందు తనకోసం పడిగాపులు కాస్తున్నాడని గుర్తించడానికి ఆమె కెంతో కాలం పట్టలేదు.

అంతకుముందెప్పుడూ ఆ ఏరియాలోనే కనిపించని వ్యక్తి ఇప్పుడు రోజూ తమ ఇంటిముందే తారట్లాడుతుంటే ఆమాత్రం గ్రహించలేకపోవడానికి ఆమె చిన్నపిల్లేమీ కాదుగదా?

అదీగాక ఆమెకు బాగా తెలుసు- తన అందం సూదంటురాయిలాంటిదనీ- ఎంతటి మగాడైనా సరే తన అందానికి చిత్తయిపోవాల్సిందేనని!

ఆమె కాలేజీలో చదువుతున్నప్పుడు వందల సంఖ్యలో ప్రేమలేఖల్ని అందుకున్న మనిషి! కాలేజీ బ్యూటీగా పేరు పొందిన వ్యక్తి.

ప్రస్తుతం ఆమె కూడా భాస్కర్రావ్‌లాగే బియ్యే పూర్తిచేసి ఖాళీగా ఉంటోంది. అంటే ఉద్యోగాన్వేషణలో ఉందని కాదు. ఎందుకోగాని ఆమెకు ఉద్యోగం చెయ్యాలన్న ఆసక్తి లేదు. నిజానికా అవసరమూ లేదు. చదువు కేవలం చదువుకోసమే చదువుకొంది. పద్దెనిమిది నిండి మొన్నమొన్నే పంధొమ్మిదో ఏట కాలుపెట్టిన ఆమెకిప్పుడిప్పుడే సంబంధాలు చూస్తున్నాడామె తండ్రి.

ఆమె తండ్రి సోమసుందరం పశువుల డాక్టరు. ఇంకా సర్వీసులోనే ఉన్నాడాయన. ఒక్కగానొక్క కూతురు కాబట్టి నవ్యకు చాలా గొప్ప సంబంధాన్నే తేగల స్థితిలో ఉన్నాడాయన. అంచేత మన అమర ప్రేమికుడికి నవ్య ఒకరకంగా అందని చందమామే అనుకోవచ్చు. అదీగాక నవ్యకు ప్రేమ వివాహంమీద పెద్దగా సదభిప్రాయం లేదు. అలాంటిదే గనక ఉండుంటే తనకువందల సంఖ్యలో ప్రేమలేఖలు రాసిన అనేకానేక ప్రేమపిపాసుల్లో ఎవరో ఒకర్ని ఆమె ఈపాటికి సెలక్ట్ చేసుకుని ఉండేదే!

తన అందాన్ని చూసి ఇతరులు వెర్రెక్కిపోవడాన్ని ఆమె తన అందానికో కాంప్లిమెంట్‌గా భావిస్తుందే తప్ప సదరు శలభాల మీద ఆమె ఏ కోశాన్నా జాలిపడదు.

అసలే 'ని.ప్ర' సూత్రంగాడు. అలాంటిది నవ్య ప్రేమలో పీకలదాకా కూరుకుపోయిన మన భాస్కర్రావ్ ఆమెను గెల్చుకోగలడా

అన్నది సందేహాస్పదమే.

ఓ వారం పదిరోజులు భాస్కర్రావ్ తన ఇంటి చుట్టూ బొంగరంలా తిరగటం గమనించాక...

ఒకరోజు నవ్యే నిలదీసింది అతగాడ్ని... "ఏం భాస్కర్రావ్‌గారూ డార్విన్ టెంజొప్పా గారిల్లు మీకింకా దొరకలేదా? " అంటూ.

"బెబ్బెబ్బె..." అన్నాడు భాస్కర్రావ్. అంటే కంగారు పడిపోయాడన్నమాట. ఆ కంగార్లో కూడా అతనికి చాలా ఆనందం కలిగింది. నవ్య తన పేర్ని గుర్తుంచుకుని "ఏం భాస్కర్రావ్‌గారూ!" అంటూ పలకరించినందుకు.

"ఆ ఎపిసోడ్ అయిపోయిందండీ! ప్రస్తుతం ఈ ఏరియాలో నేను రోజూ తిరుగుతున్నది వేరొక పనిమీద" అన్నాడు బుర్ర లోకి బోలెడంతతెలివినితెచ్చేసుకున్నాడంటూ

అతను ఈ పదిరోజుల్నుంచి వరసగా గమనిస్తూనే ఉన్నాడు నవ్య ప్రతిరోజు వాళ్ల వీధి మొదట్లో ఉన్న ఓ లెండింగ్ లైబ్రరీకి వెళ్ళి పుస్తకాలు, అంటే వీక్లీలూ నవలలూ గట్రాలన్నమాట, తెచ్చుకుంటూ ఉండటం దాన్నిబట్టి అతనికి అర్థమైపోయింది ఆమె ఒక పుస్తకాల పురుగని.

దాంతో ని.ప్ర. సూత్రాన్ని గాలికొదిలేస్తూ అతనప్పటికప్పుడు ఒక నిర్ణయానికొచ్చేసి అలా అన్నాడు.

"వేరొకపనేంటి? " కొంచెం అనుమానంగానే చూస్తూ అడిగింది నవ్య.

"ఈ ఏరియాలో ఏదన్నా షాపు రెంట్‌కి దొరుకుద్దేమోనని ట్రై చేస్తున్నానండీ..."

"దేనికి? కిరాణాకొట్టు పెట్టుకుంటారా? "

నవ్య మాటల్లో వ్యంగ్యం ధ్వనించినా నొచ్చుకోలేదు భాస్కర్రావ్. పైగా 'భావి సతీమణి మాటలకు నొచ్చుకోవడం ఏంటి అసహ్యంగా? ' అనుకున్నాడు మనసులో. "పెట్టుకుంటే తప్పేముందండీ? " అన్నాడు పైకి నవ్వేస్తూ.

"తప్పని కాదులేగాని... చూడబోతే చదువుకున్నవారిలా ఉన్నారు ఉప్పూ, పప్పూ బెల్లం, చింతపండు అమ్ముకుంటూ కూర్చోలేరుకదా? అందుకని..." అంటూ నవ్వింది నవ్య.

"అబ్బ ఎంత అందంగా నవ్వావు నవ్యా!" అనుకోబోయి, భావి సతీమణికి దిష్టిపెట్టడం ఇష్టంలేక మానేశాడు భాస్కర్రావ్.

"నేను బియ్యే పాసైనమాట నిజమేనండీ! ఉద్యోగం పేరిట ఒకరివద్ద దాస్యం ఎందుకు చెయ్యాలన్న ఉద్దేశంతో నేనిప్పుడొక షాపు పెట్టుకోవాలనుకుంటున్నమాట నిజమే! కానీ మీరనుకుంటున్నట్టు కిరాణాకొట్టు కాదు. లెండింగ్ లైబ్రరీ..."

అలా అంటూనే ఆమె రియాక్షన్‌ని కనిపెట్టడానికి ఆమె కళ్ళలోకి సూటిగా చూడబోయిన భాస్కర్రావ్ నాలుగు కళ్లూ కలుసుకోవడంతో మనసు పులకరించి మెలికలు తిరిగిపోయాడు. చటుక్కున కళ్ళు దించేసుకున్నాడు.

నవ్యకు ఏదో అర్థమైపోయినట్టుగానే అనిపించింది.

"లెండింగ్ లైబ్రరీని ఎందుకు పెట్టాలనుకుంటున్నారు? వేరే ఇంకేదయినా వ్యాపారం చెయ్యొచ్చుగా? " అదోలా తలాడిస్తూ అడిగింది. భాస్కర్రావ్ పదిరోజుల్నుంచి తనని ఫాలో అవుతున్నాడనీ, రోజూ తను లెండింగ్ లైబ్రరీకి వెళ్ళిరావడాన్ని అతను చూస్తూనే ఉన్నాడనీ ఆమెకీ తెలుసుకదా?

"నాకు పుస్తకాలంటే చిన్నప్పట్నుంచీ చాలా ఇష్టమండీ! ఎప్పుడూ ఏదో ఒకటి చదువుతూ ఉండాలనిపిస్తూంటుంది. లెండింగ్ లైబ్రరీ పెట్టుకున్నాననుకోండి... అటు జీవనోపాధి జరుగుతుంది. ఇటు నా కోరికా తీర్తుంది. ఏమంటారు? "

అలా అంటున్నప్పుడు తన తెలివికి తనే మురిసిపోయాడు భాస్కర్రావ్.

"సో మీరూ పుస్తకాల పురుగేనన్నమాట!"





కళ్ళలో అనుమానం రెపరెపలాడుతుండ గానే అంది నవ్య. "మీ అభిమాన రచయి తెవరు? "

"యద్దనపూడి వేణుగోపాలరావ్" అన బోయి, తానెక్కడో పప్పులో కాలు వేయబో తున్నట్టు తనమట్టుకు తనకే అనిపించి, అంతలోనే మాట మార్చేశాడు భాస్కర్రావ్. "పర్టిక్యులర్‌గా ఒకరనేం లేదండీ! బాగా రాసేవాళ్ళంతా నా అభిమాన రచయితలే"

"అలాగా!" అంటూ తలూపి "వస్తానండి" అంటూ అక్కణ్ణించి వెళ్ళిపోయింది నవ్య.

ఈ సంభాషణ వాళ్ళిద్దరి మధ్యా బస్టాప్‌లో జరిగింది.



సంకల్పబలం ఉండాలేగాని మనిషి సాధించలేనిది ఏముంది?

ఓ నెల తిరిగేసరికల్లా భాస్కర్రావ్ గట్టిగా ప్రయత్నించి నవ్య వాళ్ళ ఇంటికి చాలా దగ్గర్లోనే ఒక లెండింగ్ లైబ్రరీ ప్రారంభించాడు.

"ఉద్యోగం అంటూ వచ్చినవాడివి ఈ పుస్తకాలషాపు పెట్టుకోవటం ఏంటయ్యా? నీకేవన్నా మతిగాని పోయిందా? " అని వరహాల్రాజు దంపతులు నిగ్గదీస్తే- నవ్వేసి ఊరుకున్నాడే తప్ప తగిన కారణమేదీ చెప్పలేకపోయాడు భాస్కర్రావ్.

ఎలా చెప్పగలడు? తన నవ్యకోసం తానా షాపు పెట్టాల్సివచ్చిందని!

భాస్కర్రావ్ ఇలా లెండింగ్ లైబ్రరీ పెట్టాడని తెలిసి పెదనుండి గోకారి కూడా తిట్టిపోస్తూ ఉత్తరం రాశాడు! దానికీ సరియైన సమాధానం రాయలేదు భాస్కర్రావ్.

కానీ ఏవరేమనుకుంటేం? మొత్తానికి భాస్కర్రావ్ ఆశయం కొద్దికొద్దిగా ఫలించటం ప్రారంభించింది.

నవ్య ఇప్పుడు రోజూ అతని షాపుకే వచ్చి పుస్తకాలు తీసుకుని వెళ్తోంది. తన్మూలంగా వాళ్ళిద్దరి మధ్యా మాటలూ పెరిగాయి. పరిచయమూ పెరిగింది.

తనని చూసినప్పుడల్లా భాస్కర్రావ్ కళ్లు మెరుస్తూండటం నవ్య గమనిస్తూనే ఉంది.

తనతో మాట్లాడినప్పుడల్లా అతని మనసు పులకరించిపోవటం నవ్య గమనిస్తూనే ఉంది.

అసలతను ఆ లెండింగ్ లైబ్రరీ షాపు 'తనకోసమే' పెట్టేడని కూడా నవ్య గమనించేయగలిగింది.

అంతవరకు తనకు ప్రేమలేఖ అందించిన వాళ్లు ఎంతోమంది ఉన్నారు. తన అందాన్ని కళ్ళతోనే జుర్రేసుకున్నవాళ్ళు ఎంతోమంది ఉన్నారు. తన కటాక్ష వీక్షణాల కోసం పడిగాపులు కాసినవాళ్ల ఉన్నారు- విద్యాధికులూ ఉన్నారు.

కానీ ఇలా ఇతనిలా తన కోసం కేవలం తన కోసమే ఓ ప్రత్యేకమైన జీవనోపాధిని ఏర్పాటు చేసుకుని - కేవలం తనని చూడ్డం కోసమే జీవిస్తున్న వ్యక్తి ఆమెకంతవరకూ ఎవరూ తటస్థపడకపోవటంవల్ల సహజంగానే నవ్యలో భాస్కర్రావ్‌పట్ల ఒకరకమైన ప్రత్యేకమైన అభిమానం లాంటిది ఏర్పడింది!

కానీ ఆ అభిమానం ప్రేమగా మాత్రం పూర్తిగా రూపాంతరం చెందలేదు!

అందుక్కారణం భాస్కర్రావ్ చొరవ తీసుకుని తన మనసులోని మాటను బైటపెట్టలేకపోవటం!

నవ్య తనతో నవ్వుతూ మాట్లాడుతుంది.

ఏదో పుస్తకాల కోసమంటూ వచ్చి వెళ్ళిపోవటమే కాకుండా అవసరానికి మించి కూడా మాట్లాడుతోంది.

భాస్కర్రావ్‌కి అదే పదివేలుగా అనిపిస్తోంటే తన మనసులోని మాటలను చూచాయగానైనా ఆమెముందు ఉంచలేకపోతున్నాడు.

రెండు మూడుసార్లు ఆమె కందించాలని ప్రేమలేఖని కూడా రాశాడు. కాని ధైర్యం చాలకపోవటంవల్ల కొంత, 'ని.ప్ర' సూత్రం అడ్డురావటంవల్ల కొంత... వాటి నామెకు

అందించలేకపోయాడు.

ఊహల్లోనూ, కలల్లోనూ ఆమెతో మాట్లాడుతున్నదాన్లో వెయ్యోవంతు నిజజీవితంలో ఆమెతో మాట్లాడగలిగినా, ఆమెలోని అభిమానం ప్రేమగా మారి ఉండేదేమో!

ఎందుకంటే తన తండ్రి భాస్కర్రావ్ కన్నా ఎంతో ఉన్నతమైన స్థితిలో ఉన్న వ్యక్తిని తనకు భర్తగా తేగలిగినా, భాస్కర్రావ్‌లో తనపట్ల ఉన్న ఆరాధన అతనిలో ఉంటుందన్న నమ్మకం ఏమిటి? అనే ఆలోచన ఆమెలో ఎన్నోసార్లు కలిగింది.

కాని ఏంలాభం?

మగవాడిగా భాస్కర్రావ్ చొరవ చూపనప్పుడు తానేమి చేయగలదు?

తాను గనక గట్టిగా మొండిపట్టు పట్టాలే గాని, భాస్కర్రావ్‌నే కాదు దారినిపోయే దానయ్యని చేసుకుంటానన్నా తండ్రి తన మాట కాదనడు! ఎందుకంటే తనంటే ఆయనకు పంచప్రాణాలు.

కానీ ఈ మొద్దు ఒక్కసారన్నా ఆమాట అంటేకదా?

తనకేసి అంత ఆరాధనగా చూసే వ్యక్తి 'నువ్వంటే నాకిష్టం నవ్యా! నువ్వు లేకుండా నేను బ్రతకను' అని ఒక్కసారైనా అనడేమిటి?

ఆమె ఆలోచనలు ఇలా ఉన్నాయని భాస్కర్రావుకేం తెలుసు?

అందుకే పాపం అతనింకా ని.ప్ర సూత్రాన్నే పట్టుకుని వేళ్ళాడుతున్నాడు.

అందరాని చందమామ తనకి అందుబాటులోనే ఉందని గ్రహించలేక పోతున్నాడు.

★ ★ ★

సడన్‌గా వచ్చిన గోకారిని చూసి ఆశ్చర్యపోయాడు భాస్కర్రావ్.

"ఇదేంట్రా ఉత్తరం పత్తరం లేకుండా ఊడిపడ్డావ్? ఒక కార్డుముక్క రాసుంటే నేను స్టేషన్‌కొచ్చి రిసీవ్ చేసుకునేవాడ్నిగా?" అన్నాడు మిత్రుడ్ని ఆప్యాయంగా కౌగలించుకుంటూ.

వరహాల్రాజు దంపతులకు గోకార్ని పరిచయం చేయడం అయ్యాక "ఊఁ ఇప్పుడు చెప్పు, ఏంటిలా సడన్‌గా ఊడిపడ్డావ్? పెద్దమ్మ, చెల్లాయి బాగున్నారా? నీవ్యాపారం ఎలా సాగుతోంది?" అంటూ కుశల ప్రశ్నలు ప్రారంభించాడు.

"బాచీ ఎప్పుడూ మీ గురించే చెప్తుంటాడు నాయనా! అక్కడంతా బాగున్నారా?" అంటూ వరహాల్రాజు దంపతులు కూడా మాట కలిపారు.

యోగక్షేమాలు చర్చించుకోవడం అయ్యాక తానొచ్చిన అసలు విషయం చెప్పాడు గోకారి.

"అమ్మ నిన్ను అర్జంటుగా తీసుకురమ్మందిరా! అక్కడ నీకో సంబంధం వచ్చింది...'

భాస్కర్రావ్ గతుక్కుమన్నాడు. "నాకా? సబంధమా? ! నాపెళ్ళికిప్పుడేం తొందరొచ్చిందని?"

"దివ్యమైన సంబంధం వెతుక్కుంటూ వచ్చేసరికి కాదనలేకపోయాం. మరేం కంగారుపడకు... అమ్మాయి నువ్వు కోరుకున్నట్టు సుకేశినేలే"

గోకారి ఆమాట పూర్తిచేశాడో లేదో వరహాల్రాజు దంపతులు కొయ్యబారిపోయారు.

"ఏంటీ సుకేశినా? ఏదీ ఆ కూరగాయలమ్ముకునే విధవరాలా? ఆమెకు ఇంచుమించు నా వయసుంటుందన్నాడే... బంగారంలాంటి కుర్రాడ్ని దానికి కట్టబెట్టడం ఏంటయ్యా? ప్రపంచంలో ఎక్కడన్నా ఉందా ఈ అన్యాయం?" అంటూ దవడలు నొక్కుకుంది సౌభాగ్యలక్ష్మి.

"అవునయ్యా ఏంటీ ఘోరం?" అంటూ వరహాల్రాజు కూడా నెత్తి బాదుకున్నాడు.

కొయ్యబారిపోవటం ఈసారి గోకారి వంతయ్యింది. పిచ్చిపట్టిన వాడిలా చూశాడు ఆ భార్యాభర్తల కేసి.




"కూరగాయలమ్ముకునే విధవరాలెవ రండీ? మీరేమంటున్నారో? నాకు బొత్తిగా అర్థంకాలేదు..."

"మీ ఊళ్ళో సుకేశినని ఓ కూరగాయల మ్ముకునే విధవరాలుందని మీ బాచీయే చెప్పేడయ్యా! లేకపోతే మాకెలా తెలు సుద్ది? ఒకసారి జ్వరంలో ఆమె పేరు పధ్నాలుగుసార్లు కలవరించాడు కూడాను..." అంది సౌభాగ్యలక్ష్మి.

గోకారి 'ఏమిట్రా ఇదంతా?' న్నట్టుగా చూశాడు భాస్కర్రావ్ కేసి.

గొంతులో పచ్చివెలక్కాయ అడ్డం పడ్డ ట్టుగా ఉంటే భాస్కర్రావ్ ఏంమాట్లాడగ లడు పాపం?

అంచేత ఏం చెప్పాలో పాలుపోక తేలగుడ్లు వేశాడు.

"మన ఊళ్ళో కూరగాయలమ్మే సుకేశిని ఎవర్రా?" గోకారి మళ్ళీ రెట్టించి అడగ టంతో గొంతులోని పచ్చివెలక్కాయని బల వంతాన్న మింగేశాడు భాస్కర్రావ్.

"అదేరా! సుకేశినమ్మ! గౌరీపతి టెలిఫోన్ బూత్ లేదూ, దానిపక్కన కూరగాల మ్ముద్దే... అదేరా, రమణా వాళ్ళమ్మ... నేను అప్పుడప్పుడూ అరువు కూడా తెస్తుం టానే ఆవిడ..."

మిత్రుడు కన్నుగీటకపోయినా కంఠం లోని తత్తరపాటువల్ల ఏదో ఉంది కథ అని గ్రహించేశాడు గోకారి. దాంతో అప్పుడే గుర్తొచ్చినవాడిలా నవ్వేస్తూ, ఓ ఆవిడా, ఆవి డకీవయసులో మళ్ళీ పె ళ్ళేంట్రా! నేను చెప్తోంది నూజివీడు నుంచి వచ్చిన సంబంధం. వెంకట్రావ్‌గారు వాళ్ళకి ఒక్కర్తే అమ్మాయి. మగపిల్లల్లేరు. అయిదారు లక్షల ఆస్థి ఉంది. అంతా ఆ అమ్మాయికే. నీ సంగతి తెలిసి వెతుక్కుంటూ మనింటికొ చ్చారు. నిజానికి అమ్మాయి పేరు సుకేశినేం కాదు. సుందరి అనుకుంటా. చాలా మంచి సంబంధం, నువ్వొకసారి వచ్చి చూస్తే మంచిది. అందుకే అమ్మ నిన్ను అర్జంటుగా వెంటపెట్టుకు రమ్మంది" అని ఒకపక్క మిత్రుడ్ని ఇరకాటంలోంచి తప్పిస్తూనే అసలు విషయం చెప్పాడు.

"అలాగా నాయనా! అంత మంచి సంబం ధమైతే ఇంక అడ్డేముంది? రేపే ప్రయాణం కట్టించు నీ మిత్రుడ్ని" సంతోషంగా అన్నాడు వరహాల్రాజు.

"నిజంగా మన బాచీ చాలా అదృష్టవం తుడండీ" అంది సౌభాగ్యలక్ష్మి కూడా సంతోషంగా.

ఎటొచ్చీ బాచీ ముఖమే సంతోషంతో వెలి గిపోవటానికి బదులుగా పెంకులా మాడిపో యింది.

"నా పెళ్ళికిప్పుడేం తొందరా?" అనేశాడు ముఖాన్ని పక్కకు తిప్పుకుంటూ.

"అదేం మాటోయ్! నీకింకా పెళ్ళివయసు రాలేదనుకుంటున్నావా ఏంటి? వచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకోకు... చూడబ్బాయ్ గోకారి! బాచీ మాటలకేంలేగాని నువ్ రేపే అతన్ని వెంటబెట్టుకెళ్ళు..." పెద్దరికాన్ని ప్రదర్శిస్తూ అన్నాడు వరహాల్రాజు.

"అలాగే బాబాయ్‌గారు" అంటూ తనలా వరస కలిపాడు గోకారి.

ఇదెక్కడి పీడరా భగవంతుడా! అనుకు న్నాడు భాస్కర్రావ్.

అతని హృదయంలో అగ్ని పర్వతాల లాంటివైతే బద్దలవ్వలేదుగాని... మనసు మాత్రం వికలంగా అయిపోయింది.

"సరేలేరా! తర్వాత మాట్లాడుకుందాం. ముందు నువ్ వెళ్లి స్నానం చేసిరా..." అన్నాడు అప్పటికాగండం తప్పితే చాల న్నట్టు.

"అవును సౌభాగ్య! అబ్బాయికి నీళ్ళు తోడు" అని వరహాల్రాజు కూడా భార్యకు పురమాయించడంతో.

'బ్రతుకుజీవుడా' అనుకున్నాడు భాస్క ర్రావ్.

★ ★ ★

ఆ రాత్రి సినిమా నెపంతో గోకార్ని

బైటకు తీసుకెళ్లి, ఓ పార్కులో అతన్ని కూర్చుండబెట్టి, అతనికి నవ్యతో తన ప్రేమాయణం గురించి వివరంగా చెప్పి -"కాబట్టి నేను ఆమెను తప్ప వేరెవర్నీ పెళ్ళాడలేను. కాబట్టి అమ్మకి ఏదో ఒకటి చెప్పి ఈ సంబంధం తప్పిపోయేలా చూడు" అంటూ ప్రాధేయపడ్డాడు భాస్కర్రావ్.

"కానీ ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తోందో లేదో తెలీదుకదా! అలాంటప్పుడు తొందర పడి అయిదు లక్షల ఆస్థితో కాళ్ళ దగ్గర కొచ్చిన సంబంధాన్ని కాలదన్నుకోవడం విజ్ఞతకాదేమో ఒక్కసారి ఆలోచించు..." సహజంగానే హితబోధ ప్రారంభించాడు గోకారి.

"ఆ అమ్మాయి ఇప్పటికి నన్ను ప్రేమిస్తోందో లేదో తెలీదుగాని, ముందుముందు నన్ను ప్రేమించేలా చేసుకోగలనన్న నమ్మకం నాకుంది"

"ఎలా?"

"ఎలా ఏముంది? నిదానమే ప్రధానం అన్నసూత్రం ఉండనే ఉందికదా? సహనంతో, ఓర్పుతో, నేర్పుతో ఆమెను నా దారిలోకి తెచ్చుకుంటానంతే?"

"ఒకవేళ ఆమె నీ దారిలోకి రాకపోతే?"

"ఏముందీ... జీవితాంతం ఇలా బ్రహ్మచారిగా ఉండిపోతానే తప్ప, వేరొక స్త్రీకి నా మనసులో చోటివ్వలేను"

భాస్కర్రావ్ అలా అంటుంటే నవ్వాలో ఏడ్వాలో అర్థంకాలేదు గోకారికి.

"ప్రేమపిచ్చి బాగానే ముదిరిందన్నమాట! ఆమె తప్ప ఈ ప్రపంచంలో వేరే స్త్రీలే లేనట్టు ఏంమాటల్రా అవి? ఏం ఆమె అంతందంగా ఉంటుందా?"

"ఉహుఁ... ఆమె అందంగా ఉండదు. అందం ఆమెలా ఉంటుందంతే" ఏదో యూనివర్సల్ ట్రూత్ చెబుతున్నంత స్థిరంగా మిత్రుడిలా అంటుంటే-





ఆ నవ్య ఎవరోగాని మిత్రుని హృదయాన్ని పూర్తిగా కొల్లగొట్టేసిందనీ, డొల్లచేసేసిందనీ అర్థమైపోయింది గోకారికి.

"అయితే నీ నిర్ణయం మారదంటావ్? ఆమెని తప్ప వేరెవర్నీ చేస్కోనంటావ్" మిత్రుడి గుండె డొల్లై పోయినందుకు మనసులో బాధపడ్తూ అన్నాడు గోకారి.

"అటు సూర్యుడిటుదయించినా నా నిర్ణయం మారదంతే..."

"సరే... నిన్నింతగా పిచ్చివాడ్ని చేసేసిందంటే ఆమెలో ఏదో గొప్ప విశేషమే ఉండి వుండాలి. రేపు తనని నాకోసారి చూపించు' ' కుతూహలం కొద్దీ అడిగాడు గోకారి.

"వైనాట్? ష్యూర్" అన్నాడు భాస్కర్రావ్ సంతోషంగా.

★ ★ ★

మర్నాడు భాస్కర్రావ్‌తోపాటు లెండింగ్ లైబ్రరీకి వెళ్లిన గోకారి అక్కడ నవ్యను చూశాక మిత్రుడు ఆమెకోసం అలా వెంపర్లాడిపోవటం సబబేననిపించింది.

అంత అందమయిన అమ్మాయిని చూసి ఏమగవాడు మాత్రం మతిపోగొట్టుకోకుండా ఉంటాడు? అనిపించింది అతనిక్కూడా.

"నీ సెలక్షన్ బ్రహ్మాండంగా ఉందిరా! మరి నీ అదృష్టం ఎలా ఉంటుందో? " అన్నాడు నవ్య వచ్చి పుస్తకాలు తీస్కుని వెళ్లిపోయాక.

"అదే అర్థం కావట్లేదురా! నువ్వే చూశావుగా ఆమె నాతో ఎంత చనువుగా మాట్లాడిందో. నేనంటే ఆమెక్కూడా ఇష్టమన్నట్టుగానే అనిపిస్తోంది మరి! కానీ ఆ విషయం నేరుగా అడిగేస్తే ఏమనుకుంటుందోనని భయంగా ఉంది. ఒకవేళ వ్యవహారం మొదటికే బెడిసికొడుతుందేమోనని ఆందోళనగా ఉంది. నన్నేం చేయమంటావో ఓ సలహా చెప్పి పుణ్యం కట్టుకోరా"

బీదముఖం పెట్టి దీనంగా చూశాడు

భాస్కర్రావ్.

"నన్నడిగితే నేనేం చెప్తాను? ఆలస్యం అమృతం విషమే అంటాను. ఆమె కోసం, కేవలం ఆమె కోసమే నువ్ లెండింగ్ లైబ్రరీ పెట్టి అప్పుడే కొన్ని నెలలయిపోయింది. ఇన్నాళ్ళూ నువ్వేం చేసినట్టు? కనీసం ఇన్ డైరెక్ట్‌గానన్నా నీ మనసులోనిమాట ఆమెతో ఏనాడైనా చెప్పావా? "

"లేదురా! నిదానమే ప్రధానమని నిదానంగా ఆలోచిస్తున్నాను. అదును కనిపెట్టి చెప్పొచ్చులే అని చూస్తున్నాను. ఒక రెండుసార్లు లవ్‌లెటర్లు రాయడమైతే రాశానుగాని ఇవ్వటానికి ధైర్యం చాల్లేదు" మిత్రుడి వద్ద దాపరికం దేనికని ఉన్న విషయం ఉన్నట్టుగానే చెప్పాడు భాస్కర్రావ్.

"నీ వెనక దిక్కుమాలిన 'ని.ప్ర' సూత్రం ఒకటేడ్చిందని ఆమెకెలా తెలుసుద్దిరా? నువ్ సాహసించి నీ ప్రేమని వ్యక్తం చేయకపోతే ఆమె నిన్నొక పిరికివాడిగా భావించవచ్చు. సాధారణంగా పిరికివాడ్ని ఏ ఆడదీ ప్రేమించదంటారు..." మిత్రుడిలో ధైర్యాన్ని రగిలించడానికి గాను పిరికిమందు నూరిపోశాడు గోకారి.

"అంతేనంటావా? " దీనంగా చూశాడు భాస్కర్రావ్.

"ముమ్మాటికీ అంతే"

"అయితే రేపే నన్నామెతో మాట్లాడేయమంటావా? "

"అవును... అదేమంచిది" నొక్కిపలుకుతూ అన్నాడు గోకారి.

దాంతో భాస్కర్రావ్ మనసులో ఒక నిర్ణయంలాంటిది ఏర్పడింది.

గోకారి ఆ సాయంత్రమే ప్రయాణమవుతుంటే..."అదేంటయ్యా! నీ మిత్రుని పెళ్లి చూపులకు తీస్కెళ్తానని అంత స్పీడ్‌గా వచ్చినవాడివి ఇంతలోనే ఒంటరిగా తిరుగు ప్రయాణమవుతున్నావేంటి? కాళ్ళూ చేతులూ కట్టేసి ఈడ్చుకెళ్ళు. మళ్ళీ అంత మంచి సంబంధం రమ్మంటే రావద్దూ? " అన్నాడు వరహాల్రాజు చనువుగా.

"కానీ వీడిప్పుడప్పుడే పెళ్లొద్దంటున్నాడే" నన్నేం చేయమంటారు అన్నట్టుగా చూశాడు గోకారి.

"చెప్పేనుగా కాళ్ళూ చేతులు కట్టేసి ఈడ్చుకెళ్ళమని"

అయిదారు లక్షల ఆస్తంటే మజాకా కాదు. ఒక శ్రేయోభిలాషిగా ఒక పెద్దమనిషిగా ఆయనలా అనటం ఒక రకంగా సబబే అయినా నవ్య ప్రేమ కోసం నకనకలాడిపోతున్న భాస్కర్రావ్‌కి సహజంగానే ఆ మాటలు ఒళ్ళు మండించినై.

కాని ఎంతయినా బాబాయి కాని బాబాయ్‌గారాయె? ఆయన మీద డైరెక్ట్‌గా ఆగ్రహాన్ని ప్రదర్శించలేడుకదా?

అంచేత మస్తిష్కంలో ఓ మెరుపు మెరిపించుకుని, ఓ బాణంలాంటిది వేశాడు.

"మీరు అమ్మాయి వెనక ఉన్న ఆస్తినే చూస్తున్నారుగాని అవిటితనాన్ని చూడ్డం లేదు బాబాయ్‌గారూ"

"అవిటితనమా? అవిటితనమేంటి? " ఆశ్చర్యంగా చూశాడు వరహాల్రాజు.

"అవును బాబాయ్‌గారూ! ఈ వెధవ ఆ అమ్మాయికున్న ఆస్తిని గురించి చెప్పాడే తప్ప మీతో అసలు విషయం చెప్పలేదు. నిన్న నన్ను సినిమాకంటూ తీసుకుపోయి అక్కడ చెప్పాడు. ఆ అమ్మాయికి పోలియో అంటూ! ఒక కాలు సరిగ్గా పన్జేయదట. ఎంత ఆస్థి ఉంటే మాత్రం చూస్తూ చూస్తూ అలాంటి అమ్మాయిని చేస్కోమంటారా? " ముఖంనిండా ధైర్యాన్ని పులుముకుంటూ, దాదాపు కన్నీళ్ళొక్కటే తక్కువన్నట్టుగా ముఖం పెట్టి అన్నాడు భాస్కర్రావ్.

మిత్రుడంత ఘోరమైన అబద్ధమాడేసరికి "ఓరి దౌర్భాగ్యుడా" అనుకున్నాడు గోకారి మనసులో బాధగా.

వరహాల్రాజు దంపతులముందు మిత్రుడు తననలా దోషిగా నిలబెడతాడని అతను కల్లోకూడా ఊహించలేకపోయాడు.

"ఏమయ్యా నిజమేనా? "

వరహాల్రాజు తనవైపు క్రోధంగా చూస్తూ అలా అడుగుతుంటే నిజంగానే దోషిలా తల దించుకున్నాడు గోకారి. ఎందుకంటే భాస్కర్రావ్ మీద అతనికున్న స్నేహాభిమానం అలాంటిది.

ఈ సంగతి విన్నాక సౌభాగ్యలక్ష్మి కూడా ఊరుకోలేకపోయింది. "మంచి స్నేహితుడివే దొరికావయ్యా మొత్తానికి. దివ్యమైన సంబంధమంటూ బంగారంలాంటి పిల్లాడికి అవిటి సంబంధం తీస్కొస్తావా? ఇదేనా స్నేహమంటే? " అంటూ దులపరించి పారేసింది.

గోకారి మరోసారి తల దించుకున్నాడు.

భాస్కరావ్‌కి చాలా బాధగా అనిపించి, తానలా అబద్ధం ఆడకుండా ఉండాల్సిందేమోనని కూడా అనిపించింది. "నన్ను క్షమించరా గోకారీ" అనుకున్నాడు మనసులో ఆవేదనగా.

ఏదిఏమైనా మాట జారిపోయింది.

దాన్ని వెనక్కి తీసుకోవడం ఎవరితరం?

గోకారికి సెండాఫ్ ఇవ్వటానికి స్టేషన్‌కి వెళ్లినపుడు జరిగిన దానికి తన పశ్చాత్తాపాన్ని వ్యక్తంచేసి తనని మన్నించమని మరీ మరీ వేడుకున్నాడు భాస్కర్రావ్.

"మన మధ్య మన్నింపులేంట్రా? అసలు నీమీద నాకు కోపమొస్తేగా? ఏదో వాళ్లని తప్పించుకోవడానికి చిన్న అబద్ధం ఆడేవ్ అంతేగా? " అంటూ తేలిగ్గా నవ్వేశాడు గోకారి.

మిత్రుడి మంచితనానికి భాస్కర్రావ్ మనసు మురిసిపోయింది.

★ ★ ★

ఆ రాత్రి భాస్కర్రావ్ పరిపరి విధాల ఆలోచించాడు...నవ్యకు తన ప్రేమ గురించి ఎలా చెప్పడమా? అని.

"నోరుందిగదరా సన్నాసీ" అని అంతరాత్మ నోరు విప్పబోయిందిగాని దాన్నతను నోరు విప్పనివ్వలేదు.

"నా ఏడుపేదో నేనే ఏడుస్తాను. మధ్యలో నీబోడి సలహాలనవసరం..." అంటూ ఆదిలోనే కేకలేసి దాని నోరు నొక్కేశాడు.

దరిమిలా రకరకాల ఆలోచనలు చేశాడు.

సినిమాల్లో సింబాలికల్ షాట్స్ చూపించినట్టు, చెప్పీ చెప్పకనే ఆమెకు తన ప్రేమను తెలియజేయటానికి ఏదన్నా మార్గముందా? అని ఆలోచించాడు ముందు.

సినిమాల్లో అయితే హీరోయిన్ నిండు నీళ్ళబిందెతో వస్తూంటుంది చెరువుగట్టమ్మట. సైకిల్ మీద వస్తున్న హీరో అనుకోకుండా ఆమెకు డాష్ ఇస్తాడు. దాంతో బిందె చెరువులోకి జారిపోవటం, హీరోయిన్ నేలమీద పడిపోవటం... దాంతో సడన్‌గా ఒకరిమీద ఒకరికి ప్రేమ అంకురించిపోయి... ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటూ పులకరించి ఉలకరించి కులకరించి చిలకరించి పోవటం... ఆ వెంటనే కోటి బిందెల మధ్య డ్యూయెట్ పాడేసుకోవటం లాంటివి ఆటోమాటిగ్గా జరిగిపోతుంటాయి. 'నేన్నిన్ను ప్రేమిస్తున్నాను' అని ఆమె అతన్తోగాని, 'ఐలవ్‌యూ' అని అతను ఆమెతో గాని చెప్పాల్సిన అవసరమే ఏర్పడదు.

అలాంటివే ఇంకా అనేకానేక అకస్మాత్ ప్రేమలు అంకురించి పోతుంటాయ్ సినిమాల్లో.

కానీ నిజజీవితంలో అలా సాధ్యంకాదు గదా?

అలా అనిపించగానే సినిమాటిక్‌గా ఆలోచించటం మానేసి రియలిస్టిక్‌గా ఆలోచించటం ప్రారంభించాడు భాస్కర్రావ్.

దాంతో అతనికి జ్ఞానోదయమై అంతరాత్మ చెప్పిందే కరక్టనిపించింది.



భగవంతుడు మనిషికి నోరిచ్చింది ఎందుకూ? ప్రేయసికి మనసులోని మాట చెప్పటానికీ, మరియు కవర్లమీద స్టాంపులం చించుకోవటానికి- అంతేకదా? అని కూడా అనిపించింది.

కాని అంతకుముందే అంతరాత్మని కేకలేసి ఉన్నాడేమో, నోటితో చెప్పటం కాకుండా మరో ప్రత్యామ్నాయం ఏమిటా అని ఆలోచించాడు.

నిజానికి దానికి ఆలోచన అనవసరం.

నోటితో చెప్పలేకపోతే లౌలెటర్ రాయాలి. అదొక్కటే కదా ఆల్టర్‌నేటు?

అయినా ప్రేమోన్మాదంలో ఉన్నాడు కాబట్టి ఆమాత్రం ఇంగితం అతనికి లేకపో యింది. పైగా ఫ్లూటు వాయిస్తూ చెప్ప వచ్చా? హార్మోనియం వాయిస్తూ చెప్పవ చ్చాలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు కూడా వచ్చినై!

ఆ తర్వాత మైండ్ సెట్‌రైటై ఇంగితం మేల్కొంది.

ఫ్లూటు హార్మోనియాలు వాయిస్తూ చెప్పటం అసాధ్యం. అంతేకాకుండా అవి వాయించడం తనకు రాదు కూడాను. సో... లౌలెటర్ ఒక్కటే మార్గం!

కాబట్టి వెంటనే రాసిపారేయాలి! కాదు రాసి రేపే 'ని.ప్ర.' సూత్రంతో మీనమేషాలు లెక్కపెట్టకుండా నవ్యకిచ్చేసెయ్యాలి!

నిదానమే ప్రధానమని ఆ ముసలాయ నేదో చెప్పినంత మాత్రాన దాన్ని పాటించ టమేంటి అసహ్యంగా.

ఆలస్యం అమృతం విషం అని కూడా పెద్దలేకదా అన్నారు?

అలా అనుకోగానే భాస్కర్రావ్‌లో ఎక్కడ లేని హుషారూ వచ్చేసింది. ఆ క్షణంలో అతనికి తాతగారు మనసులో మెదల్లేదు.

వెంటనే ఓ పెన్నూ, కాగితం అందుకుని మొదలెట్టేశాడు ప్రేమలేఖ ప్రేయసికి.

ఓ రెండు మూడుగంటలు కలంతోనూ, కాగితాల్తోనూ కుస్తీపట్టి, ఓ ఆరేడు కాగి తాల్ని చింపి పోగులు పెట్టాక... ఎట్టకేలకు ఓ ముచ్చటైన మూడు పేజీల ప్రేమలేఖ తయారయ్యింది.

పూర్తయిన ప్రేమలేఖని ఓమారు చదివి చూసుకున్నాక తన ప్రేమలేఖా రచనా సామర్థ్యానికి తనమీద తనకే ముచ్చటేసింది భాస్కర్రావ్‌కి.

అబ్బ! ఎంత అద్భుతంగా కుదిరిందీ లేఖ!

ఇంతకుముందు రాసి చింపేసిన వాటిని దీన్తో పోలిస్తే అవి ఏమీ బావుండలేదు. ఇది సూర్యుడైతే అవి దివిటీలు.

ఈ సూర్యతుల్యమైన ప్రేమలేఖని చూసి నవ్య ఐసైపోవడం ఖాయం 'ఐటూ లవ్ యూ బాచీ' అంటూ తనని వాటేసుకోవ డమూ ఖాయం.!

ఇంకా నయం. అప్పట్లో తొందరపడి ఆ లేఖల్ని గనక (అందులో ఏ ఒక్క లేఖనైనా సరే) ఇచ్చేసుంటే కొంప మునిగిపోయి ఉండేది!

ఏమాత్రం ఇంప్రెసివ్‌గా లేని ఆ బోడిలే ఖలు తన నవ్య హృదయాన్ని కదలించగ లిగి ఉండేవికావు. తత్ఫలితంగా తన ప్రేమ ఈపాటికి మటాషైపోయి ఉండేది!

నిజంగా 'ని.ప్ర.' సూత్రం ఎంత గొప్పది?

ఆవేశంలో అలా అనేసుకున్నాక చటు క్కున నాలుక్కరుచుకున్నాడు భాస్కర్రావ్. కాదు కాదు 'ఆ.అ.వి' సూత్రమే గొప్పది అనుకుంటూ చెంపలు వేసుకున్నాడు.

రేపే ఈ సూర్యతుల్యమైన ప్రేమలేఖని తన ప్రియప్రేయసికి అందజేసితీరాలి అను కున్నాడు గట్టిగా.

ఎంత గట్టిగా అంటే అదేదో సిమెంట్‌తో కట్టిన గోడంత గట్టిగా.

★ ★ ★

మర్నాడు ఉదయం పదకొండున్నరగం టల వేళప్పుడు...

భాస్కర్రావ్ హృదయం యధావిధిగా





పులకరించిపోయింది.

నవ్య లెండింగ్ లైబ్రరీలో కాలుపెట్టింది.

అసలే జేబులో సూర్యతుల్యమైన ప్రేమలేఖను కలిగి ఉన్నాడేమో ఆమెను చూడగానే భాస్కర్రావ్ ముఖం పొద్దుతిరుగుడు పువ్వులా వికసించింది.

"రండ్రండ్రండి... మీ కోసమే చూస్తున్నాను" అన్నాడు కుర్చీలోంచి లేచి నిలబడ్తూ.

"ఏమిటి విశేషం? ఇవ్వాళ శుక్రవారం కాదుగా? 'మైత్రి' వచ్చేది శుక్రవారంకదా? " అంది నవ్య నవ్వుతూ.

'మైత్రి' అనేది నవ్య బాగా అభిమానించే పత్రిక. అది ప్రతి శుక్రవారం వస్తూంటుంది. వేరే కస్టమర్స్ వచ్చి అడిగినా ఇవ్వకుండా ప్రతివారం నవ్యకోసం ఓ కాపీని అట్టే పెడ్తుంటాడు భాస్కర్రావ్.

జేబులో సూర్యతుల్యమైన ప్రేమలేఖను కలిగియున్న భాస్కర్రావ్‌కి ఒళ్లు మండిపోయింది. నవ్య అలా అనగానే.

'మైత్రేంటి మైత్రి? నా జేబులో సూర్యతుల్యమైన ప్రేమ లేఖుంటేనూ' అనుకున్నాడావేశంగా.

అనుకుని ఆమె ముఖంలోకి కోపంగా కూడా చూడబోయాడు. కాని అంతలోనే అతన్లోని ఆవేశం చప్పున చల్లారిపోయింది.

అందుక్కారణం- "నీ నవ్య నిర్దోషిరా! నీ జేబులో ప్రేమలేఖుందని ఆమెకేం తెల్సు?" అంటూ అంతరాత్మ హెచ్చరించటం.

దాంతో 'అవున్నిజమేకదా? ' అనుకుని... ప్రసన్నంగా ఓ నవ్వు నవ్వి... "అబ్బే మైత్రి రాలేదండీ" అన్నాడు జేబులోని ప్రేమలేఖను ఓమారు తడిమి చూసుకుంటూ.

"మరి? " అన్నట్టుగా కళ్లెగరేసింది నవ్య.

'అబ్బ! ఎంతందంగా కళ్ళెగరేశావు నవ్యా? ' అనుకోబోయి మానేశాడు భాస్కర్రావ్.

"ఊర్కేనండీ... ఊర్కే. మీరొస్తే బావుంటుందనిపించింది. అంతే" అన్నాడు చిత్రవిచిత్రంగా చేతుల్తిప్పుతూ.

"అనిపించదామరి? నా అందం అలాంటిది" అనుకుంది నవ్య మనస్సులో గర్వంగా.

పైకి మాత్రం ఏమీ అనకుండా 'అలాగా? ' అన్నట్టు తలపంకించి ఊరుకుంది.

అలా తల పంకించి ఊరుకునే బదులు ఏం బావీ నాతో ఏదన్నా చెప్పాలనుకుంటున్నావా? అని అడగొచ్చుగా? అనుకున్నాడు భాస్కర్రావ్ ఉక్రోషంగా.

'ధైర్యమే సాహసం! చెప్పేసెయ్ చెప్పేసెయ్' అని మనసు హెచ్చరించటంతో... "నా దగ్గర సూర్యతుల్యమైనది ఒకటుందండీ! దాన్ని మీకు ఇవ్వాలనుకుంటున్నాను" అన్నాడుత్సాహంగా.

ఆ మాటలు నవ్యకు అర్థరహితంగా అనిపిస్తాయేమోనని అతనికి తోచలేదు.

"సూర్యతుల్యమైనదా? అంటే? " ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది నవ్య.

"అంటే దివిటీలాంటిది కాకుండా సూర్యుడితో సమానమైనదని అర్థం అన్నమాటండీ" అన్నాడు భాస్కర్రావ్.

అందమైన ఆడపిల్లకి ప్రేమలేఖ అందించటం అనుకున్నంత సులభమేం కాదు. అంచేత అసలు విషయం చెప్పటానికి అతనికి ధైర్యం సరిపోలేదు.

భాస్కర్రావ్ మాటల సారాంశం బొత్తిగా అర్థంకాని నవ్య అతనికేసి అదోలా చూసింది. 'పిచ్చిపిచ్చిగా వాగుతున్నావ్ ఏంటి కథ? ' అన్నట్టుగా.

"కొంపదీసి మీకేదన్నా వజ్రంలాంటిది గాని దొరికిందా? దాన్నిగాని నాకివ్వాలనుకుంటున్నారా? " అనడిగింది మనసులోకి విచిత్రమైన అనుమానం రాగా.

"ఈరోజుల్లో వజ్రాల్ని ఎవరు పారేస్కుంటారండీ దొరకటానికి? " గమ్మత్తయిన ఎదురు ప్రశ్నవేశాడు భాస్కర్రావ్. అసలు

సంగతి చెప్పటానికి ధైర్యం సరిపోవట్లేదు కాబట్టి ఏదో ఒకటి అనాలిగా మరి?

"పోనీ కొన్నారా? "

"లేదండీ... రాశాను" నవ్య సడన్‌గా అలా అడిగేసరికి నోరుజారి 'అర్ధనిజం' కక్కేశాడు భాస్కర్రావ్.

నవ్య భృకుటి ముడివడింది. "రాశారా? ఏంటి మీరు రాసింది? " అంది అనుమానంగా చూస్తూ.

భాస్కర్రావ్ మనసులో హఠాత్తుగా తాతగారి రూపం ప్రత్యక్షమైంది. "తొందరపడకు నిదానమే ప్రధానం... తొందర పడకు నిదానమే..."

"వద్దు తాతయ్యా నన్నలా వారించబాకు... సూర్యతుల్యమైన నా ప్రేమలేఖని నా దేవికి నన్ను అందించనీ..." అని వేడుకున్నాడు భాస్కర్రావ్ మనసులో తన తాతయ్యగార్ని

"నా మాట వినరా అబ్బీ! సడన్‌గా ప్రేమలేఖందిస్తే ఆమె పాజిటివ్‌గా రియాక్టవుద్దని గ్యారంటీ ఏముంది? స్టుపిడ్ అంటూ దాన్ని నీ మొహాన్న విసిరిగొట్టదని గ్యారంటీ ఏముంది? ఇలాంటి వ్యవహారాల్లో చాలా సున్నితంగా వ్యవహరించాలి. అదీగాక ఇవ్వాళ తిథి కూడా అంత మంచిది కాదు..."

తాతగారు అంత నమ్మకంగా చెప్తుంటే తలదిమ్ము తగ్గినట్టుగా అనిపించింది భాస్కర్రావ్‌కి.

నిజమే! మొహాన్న విసిరికొట్టదని గ్యారంటీ ఏముంది? అనుకున్నాడు జ్ఞానిలా.

అంతలో నవ్యే మళ్ళీ నోరు విప్పింది. "మాట్లాడరేమండీ? ఏంటి మీరు రాసింది? "

"మరేం లేదండీ! నిన్న రాత్రి నేనో కథ రాశాను. 'ఇది దివిటీ కాదు సూర్యుడు' అని దానికి పేరు పెట్టాను. దాన్ని మీకిస్తే చదివి మీ అభిప్రాయం చెప్తారుకదా"

నవ్య చాలా చాలా ఆశ్చర్యంగా చూసింది భాస్కర్రావ్‌కేసి, "ఏంటీ మీరు కథలు రాస్తారా? "

"అవునండీ తొలి ప్రయత్నంగా రాత్రే రాశాను. మీకు సాహిత్యమంటే ఇష్టంకదండీ, అందుకని నేను కూడా ఓ రచయితనైతే ఎలా ఉంటుంది అనిపించి..." అర్థవంతంగా ఆ వాక్యాన్ని పూర్తి చేయటం చేతకాక మధ్యలోనే ఆగిపోయాడు భాస్కర్రావ్.

"నాకు సాహిత్యమంటే ఇష్టమైనంత మాత్రాన మీరు కథలు రాయటం దేనికి? " అలా అడుగుతున్నప్పుడు నవ్య మనసు మధురంగా స్పందించింది. తనకోసం, కేవలం తన కోసం లెండింగ్ లైబ్రరీ పెట్టిందేకాక, రచనా వ్యాసంగానికృూడా పూనుకుంటున్నాడంటే నిజంగా ఇతనికి తనంటే ఎంత ప్రేమ?

కానీ ఆ ముక్క చెప్పి చావడేం? అనుకుంది మనసులో.

నవ్య ఆలోచనలలా సాగుతున్నాయని భాస్కర్రావ్‌కేం తెలుసు?

అంచేత సహజంగానే ఆమె ప్రశ్నకు తడబడిపోయాడు. "అబ్బే ఏం లేదండీ... ఊర్కే ఊర్కే" అన్నాడు గుటకలు మింగుతూ.

నవ్య నవ్వబోయి మానేసింది.

"సరే... తప్పకుండా చదివి నా అభిప్రాయం చెప్తాను. దాన్నిలా ఇవ్వండి..." అంటూ చెయ్యి చాచింది.

గతుక్కుమన్నాడు భాస్కర్రావ్.

నరంలేని నాలుకే కదాని చటుక్కున అబద్ధమాడేశాడు తను? ఇప్పుడెలా?

అతనలా మధనపడిపోతుంటే "నరంలేని నాలుకే కదోయ్! ఇంకో అబద్ధం ఆడు ఫర్వాలేదు" అంటూ సలహా ఇచ్చింది అతగాడి అంతరాత్మ.

దాంతో గంభీరంగా నవ్వు నవ్వి- "సారీ అండీ! మీరడిగేదాకా నాకు గుర్తేలేదు.





కంగార్లో స్క్రిప్ట్ ఇంటి దగ్గర మర్చిపోయాను... రేపు తెస్తా తప్పకుండా" అంటూ మరో బొంకు బొంకేశాడు భాస్కరావ్.

"సరిపోయింది, ఈపాటి దానికేనా ఇంత హంగామా చేశారు? " అంటూ విరగబడి నవ్వింది నవ్య.

'అబ్బ! ఎంత అందంగా విరగబడి నవ్వుతున్నావు నవ్యా? ' అనుకున్నాడు భాస్కర్రావ్ తన్మయంగా.

అతనా తన్మయంలోంచి ఇంకా పూర్తిగా తేరుకోకముందే రెండు నవలలు సెలక్ట్ చేసుకుని "వస్తానండీ భాస్కర్రావ్‌గారూ ఇదుగో ఈ రెండు నవలలూ తీస్కెళ్తున్నాను రాస్కోండి" అని చెప్పి నవ్య వెళ్ళిపోయింది అక్కడ్నించి.

"నేనే నీ వాడినైనప్పుడు, ఈ షాపే నీదైనప్పుడు, నువ్వు తీస్కెళ్లిన పుస్తకాలు రాస్కోవటం ఏంటి నా బొంద? " అనుకున్నాడు భాస్కర్రావ్ పరవశంగా.

★ ★ ★

సూర్యతుల్యమైన ప్రేమలేఖని జేబులోనే ఉంచుకుని ఆరోజు సాయంత్రం షాపుకట్టేసి ఇంటికొచ్చిన భాస్కర్రావ్‌ని విధి ఓ టెలిగ్రాం రూపంలో కాటేసింది.

"మదర్ సీరియస్. స్టార్ట్ ఇమ్మీడియెట్లీ -గోకారి"

కాళ్లు చేతులు ఆడలేదు భాస్కర్రావ్‌కి దాన్ని చూడగానే. అరెc... నిన్న సాయంత్రమేగా వాడు ప్రయాణమైవెళ్లాడు? ఇంతలోనే ఈ టెలిగ్రాం అంటే... వాడు వెళ్ళేసరికే అక్కడ పెద్దమ్మకి సీరియస్‌గా ఉందన్న మాట.

ఏమయ్యుంటుందావిడకి? తనకి తెలిసినంతలో ఆవిడ చాలా ఆరోగ్యవంతురాలే! ఏనాడూ ముక్కయినా చీది ఎరగని మనిషి! వయసుకూడా ఏమంత ఎక్కువకాదు. యాభైలోపే!"

కొంపదీసి ఏదన్నా ఏక్సిడెంట్‌గానా?

ఆ టెలిగ్రాం చేతబట్టుకుని అతను జలజలా కన్నీరు కారుస్తుంటే వరహాల్రాజు దంపతులు అతడికి ధైర్యం చెప్పారు. "ఏమీ అయ్యుండదులే, ఏదో కాస్త నలతగా ఉంటే అతను కంగారుపడి టెలిగ్రామిచ్చుంటాడు... ధైర్యంగా వెళ్ళిరా" అంటూ అప్పటికప్పుడే అతన్తో ప్రయాణం కట్టించారు.

హుటాహుటిన బయల్దేరిన భాస్కర్రావ్ ప్రయాణం చేస్తున్నంతసేపూ మనసులో దేవుడికి మొక్కుకుంటూనే ఉన్నాడు- రామేశ్వరికి ఏమీ కాకూడదనీ, తను వెళ్ళేసరికి ఆమె క్షేమంగా ఉండాలనీ.

కానీ భగవంతుడు అతని ప్రార్థనను ఆలకించలేదు.

మర్నాడు ఉదయం తొమ్మిదిన్నర గంటలకి అతను పెడన చేరుకునేసరికి అక్కడ రామేశ్వరి పరిస్థితి ఇంకో ఘడియే అన్నట్టుగా ఉంది.

అతని ఊహే నిజమైంది. ఆమె నిజంగానే ఏక్సిడెంట్‌కి గురైంది! గాలికొట్టే కిరోసిన్ స్టవ్ పేలి, నలభై శాతానికి పైగా ఒళ్లు కాలిపోయి మృత్యువుతో పోరాడుతూఉంది.

భాస్కర్రావ్ పెడన చేరుకునేటప్పటికి ఆమెకింకా అక్కడే ట్రీట్‌మెంట్ చేయిస్తూ ఉన్నాడు గోకారి.

రామేశ్వరిని ఆ స్థితిలో చూసేసరికి దుఃఖం ఆగలేదు భాస్కరావ్‌కి.

"ఇదేంట్రా ఇంత ఘోరం జరిగిపోయిందంటూ" గోకార్ని పట్టుకుని వలవలా ఏడ్చేశాడు.

"అది సరే. ఇంత సీరియస్‌గా ఉంటే విజయవాడో, బందరో తీసుకెళ్ళకుండా ఇక్కడే ట్రీట్‌మెంటేంటి? " అంటూ మిత్రుడ్ని మందలించాడు ఒకింత తేరుకున్నాక.

"తీస్కెళ్ళొచ్చురా! కానీ అగ్నిప్రమాదం కాబట్టి, మెడికో లీగల్‌కేస్ కాబట్టి హాస్పటల్లో చేర్పించాలి. ఒకవేళ జరక్కూడనిది ఏమైనా జరిగితే పోస్ట్‌మార్టం అదీ ఇదీ

అంటారు! అందుకని మన నరహరిగారు తెలిసిన డాక్టరే కాబట్టి కాళ్ళా వేళ్ళాపడి ఈయన దగ్గర చేర్పించాను..." రోదిస్తూనే విషయం చెప్పాడు గోకారి.

"అయితే మాత్రం? అంత సీరియస్‌గా ఉన్నప్పుడు పెడనలో ఉంచడమేంటి? ఏం జరిగితే అదే జరుగుద్ది... అమ్మని విజయ వాడ తీస్కెళ్దాం పట్టు" అంటూ తొందర పెట్టి వెంటనే అక్కడ్నించి ఆమెను విజయ వాడ తరలించాడు భాస్కర్రావ్.

"ఫార్టీ పర్సెంట్ బర్న్స్' అంటే పేషంటు బ్రతకటానికి అవకాశం ఉన్న పరిస్థితే! విజ యవాడ జనరల్ హాస్పటల్లో డాక్టర్లు కూడా అదే చెప్పారు. 'పూర్తిగా గ్యారంటీ అయితే ఇవ్వలేంగాని ఛాన్సెస్ ఆర్ ఫిఫ్టీ పెర్సెంట్' అంటూ ఒకింత హోప్‌ఫుల్‌గానే మాట్లా డారు.

గోకారన్నట్టు మెడికో లీగల్ కేసు కాబట్టి, ప్రైవేటు హాస్పిటల్స్‌వాళ్ళెవ్వరూ చేర్చుకోక పోవటంవల్ల, రామేశ్వరిని కంపల్సరీగా జన రల్ హాస్పటల్లోనే చేర్పించాల్సి వచ్చింది.

ఎలాగైనా పెద్దమ్మని బ్రతికించుకోవాలన్న ఆశతో డబ్బుని మంచినీళ్ళలా ఖర్చుచేయసా గాడు భాస్కర్రావ్.

కానీ ప్రయోజనం లేకపోయింది.

పారంరోజులు మృత్యువుతో హోరాహోరి పోరాడి ఎనిమిదోనాడు కన్నుమూసింది రామేశ్వరి.

గోకారీ వెంకటలక్ష్మిలు బావురుమని ఏడుస్తుంటే దుఃఖంతో తన హృదయం కూడా కంపించిపోతున్నప్పటికీ, ఒక్కగా నొక్క ఆప్తుడిగా భాస్కర్రావే వాళ్ళని ఓదా ర్చాల్సివచ్చింది.

రామేశ్వరి అంత్యక్రియలు, కర్మకాండలు అన్నీ ముగిసేవరకూ అతనికి హైదరాబాద్ గానీ, నవ్యగాని గుర్తుకురాలేదు.

రామేశ్వరి మరణం భాస్కర్రావ్‌ని ఎంత గానో కృంగదీసింది.





గోకారిని, వెంకటలక్ష్మిని పెడనలోనే వది లేసి పోవటానికి మనస్కరించలేదు.

ఇక్కడ ఉంటే వాళ్లింకా కృంగిపోతారని, వాళ్లు రామంటున్నాసరే బలవంతంగా వాళ్లని కూడా తనతోపాటు హైదరాబాద్ ప్రయాణం కట్టించాడు... 'కొన్నాళ్ళుండి మళ్ళీ వచ్చేద్దురుగానీ' అంటూ.

"అక్కడ నీకు ఇబ్బందికదా! వరహాల్రాజు గారు నీ ఒక్కడికంటే చోటిచ్చారు... అద నంగా మేమిద్దరం కూడా వస్తే వారికి ఇబ్బందికదా?" అంటూ గోకారి అభ్యం తరం చెప్పబోతే...

"వాళ్లు ఎలాంటివాళ్లో నాకు బాగా తెలుసు! ఇటువంటి ఆపద సమయంలో వాళ్ళెలా ప్రవర్తిస్తారో నాకు తెలీదా? అంతగా వాళ్లు కాదంటే మనం సెపరేట్‌గా ఏదన్నా ఇల్లు అద్దెకు తీసుకుందాం కానీ వాళ్లలా అంటారని మాత్రం నేననుకోను" అంటూ నచ్చజెప్పాడు భాస్కర్రావ్.

అలా... రమారమి నెలాపదిహేనురో జుల తర్వాత తిరిగి హైదరాబాద్‌లో కాలు పెట్టాడు భాస్కర్రావ్.



భాస్కర్రావ్ అన్నట్టుగానే వరహాల్రాజు దంపతులు చాలా ఆదరంగా ప్రవర్తించారు గోకారీ వెంకటలక్ష్మిలపట్ల.

మనసున్న మనుషులు సాటి మనుషుల బాధల్ని చూసి స్పందించకుండా ఎలా ఉండగలుగుతారు?

"నీతోపాటు వీళ్ళనిక్కడికి తీస్కొచ్చి చాలా మంచిపని చేశావయ్యా" అని వాళ్ళి ద్దరూ మనస్ఫూర్తిగా అంటుంటే ఆ దంపతు లపట్ల పూజ్యభావం మరింతగా పెరిగిపో యింది భాస్కర్రావ్‌లో.

హైదరాబాద్ వచ్చాక్కూడా ఓ నాలుగైదు రోజులదాకా నవ్య గురించిగానీ, లెండింగ్ లైబ్రరీ గురించిగాని ఆలోచించలేదు భాస్క ర్రావ్.

ముందు గోకారినీ, వెంకటలక్ష్మినీ, తల్లిని కోల్పోయిన దుఃఖంలోంచి తేరుకునేలా చెయ్యాలి. ఆ తర్వాతే తన ప్రేమయినా, దోమైనా... ఆ ఉద్దేశంతో వాళ్ళిద్దరికీ సిటిలో చూడాల్సిన ప్రదేశాలన్నిట్నీ చూపుతూ ఓ వారంరోజులు దొర్లించేశాడు.

ఆ తర్వాత... గోకారి... గుర్తుచేసిన మీదట, బలవంతం చేసిన మీదట, సిటీలో తిరిగి కాలుపెట్టిన తొమ్మిదోనాడు తిరిగి తన లెండింగ్ లైబ్రరీని తెరిచాడు భాస్క ర్రావ్.

అతన్తోపాటు గోకారి కూడా వెళ్ళాడు షాపుకి.

నవ్య వస్తుందేమోనని రోజంతా ఎదురు చూశారు మిత్రద్వయం. కానీ ఆమె రాలేదు.

వేరే కష్టమర్లు మాత్రం అనేకమంది వచ్చి 'ఇన్నిరోజులు షాపు తియ్యలేదేం? అదీ ఇదీ' అంటూ భాస్కర్రావ్‌ని రకరకాల ప్రశ్నలు వేశారు.

ఆ సాయంత్రం షాప్ క్లోజ్ చేశాక ఒక వేళ నవ్య కనిపిస్తుందేమోనని వాళ్ల ఇంటి మీదుగా వచ్చారు మిత్రులిద్దరూ.

కానీ అక్కడా వాళ్ళకి నిరాశే ఎదుర య్యింది.

అలా జరిగినందుకు భాస్కర్రావ్‌కి చాలా దిగులుగా అనిపించినా మిత్రుడిముందు బయటపడటం ఇష్టంలేక "ఏం కొంప ముని గిపోయిందిలేరా! ఇవ్వాళ కాకపోతే రేపు కనిపిస్తుందిలే" అనేశాడు తేలిగ్గా.

సూర్యతుల్యమైన ప్రేమలేఖ ఆ క్షణాన్న అతని జేబులోనే ఉంది.

★ ★ ★

మర్నాడు కూడా మధ్యాహ్నం పన్నెండిం టివరకూ నవ్య లెండింగ్ లైబ్రరీలో కాలు పెట్టలేదు.

దాంతో భాస్కర్రావ్ ముఖం కొద్దిగా వాడింది.

అది గమనించి అన్నాడు గోకారి. "నువ్వొచ్చి మళ్ళీ షాప్ తెరిచిన సంగతి తెలీక ఆమె రావటం లేదేమోరా! షాపుని నేను చూస్కుంటూ ఉంటాలే... నువ్వొక సారి వాళ్ళ ఇంటికేసి అలా వెళ్ళిరా!"

గోకారి అలా మాట పూర్తిచేశాడో లేదో "థాంక్స్‌రా" అంటూ ఎక్కుపెట్టి వదిలిన బాణంలా బైటికి పరుగుతీశాడు భాస్క ర్రావ్.

ఓ పదినిముషాల తర్వాత నవ్య వాళ్ళ ఇల్లు చేరుకున్న భాస్కర్రావ్‌ని నిరాశ కబ ళించలేదు. పైగా ఆనందం నిలువెల్లా ఆవ హించేసింది.

నవ్య వరండామీద వాలుకుర్చీలో కూర్చుని ఏదో నవల చదువుకుంటూ ఉంది.

'అబ్బ! ఎన్నాళ్లకు నిన్ను మళ్ళీ చూశాను నవ్యా?' అనుకున్నాడు భాస్కర్రావ్ ఆనం దంగా.

'అబ్బ! ఎంతందంగా నవల చదువుకుం టున్నావు నవ్యా?' అని కూడా అనుకోబో యాడుగానీ, పద్ధాక అలా అనుకోవడం తన మట్టుకు తనకే విసుగ్గా అనిపించి మానే శాడు.

నవ్య పుస్తకంలోంచి తల పైకెత్తకుండా చదువుకుంటూ ఉంది.

తన ఉనికిని ఆమె గుర్తించేలా చేయడ మెలా.

పొడిగా ఓ దగ్గు దగ్గాడు. అతని పిచ్చి గాని ఆ దగ్గు ఆమెకు వినిపిస్తుందా?

దాంతో ఇలా లాభంలేదని క్షయరోగి దగ్గి నట్టు గట్టిగా ఖళ్లు ఖళ్లున దగ్గాడు.

అదృష్టం! ఈసారి తన ప్రయత్నం ఫలించి నవ్య పుస్తకంలోంచి తలపైకెత్తి గేటువైపు చూసింది. దాంతో ఆటోమాటిగ్గా గేటు కావల నిలబడి ఉన్న భాస్కర్రావ్ ఆమె కళ్లబడ్డాడు.

నవ్య కుర్చీలోంచి లేచి మెట్లుదిగి గేటు దాకా నడుచుకుంటూ వచ్చింది.

"మీరా భాస్కర్రావ్‌గారూ! ఏమైపోయారి న్నాళ్లూ? షాపు తియ్యటం లేదేం? " అడి గింది గేటు కావల్నుంచే.

నిన్నట్నుంచే షాపు తీస్తున్నాను. నిన్నంతా మీ కోసం ఎదురు చూశాను. ఒక సారి షాపుకు రండి. అక్కడ వివరాలన్ని మాట్లాడుకుందాం" చకచకా పాఠం వల్లిస్తు న్నట్టుగా అనేసి, "వస్తారుగా? " అంటూ అక్కడ్నించి కదలి వెళ్ళిపోయాడు భాస్క ర్రావ్.

ఆమెతో చెప్పాల్సింది చాలా ఉంది. అక్కడ నిలబడి ఎక్కువసేపు మాట్లాడితే బావుండదుగా? అందుకని అలా చేశాడన్న మాట!

వికసిత ముఖంతో తిరిగొచ్చిన భాస్కర్రా వ్‌ని చూసి "కనిపించిందా? " అన్నాడు గోకారి ఆనందంగా.

మిత్రుడి బాధ తీర్తే తన బాధ తీరిన ట్టేగా, అందుకని అన్నమాట ఆ ఆనందం.

"ఆ కన్పించింది షాపుకి రమ్మని చెప్పి వచ్చేశాను" క్లుప్తంగా జవాబిచ్చాడు భాస్క ర్రావ్.

"గోకారిక్కడుంటే నవ్యతో అన్నీ వివ రంగా మాట్లాడ్డం కుదర్దు. వాడ్ని ఇక్క డ్నుంచి బైటికి పంపించేయాలి. ఎలా? " అనుకున్నాడు మనసులో.

"ఆమె రావటానికి ఎంతసేపు పట్టొచ్చు? '

"రావచ్చు ఓ పది పదిహేను నిము షాల్లో..."

"నేనిక్కడుంటే నీకు ఇబ్బందిగా ఉంటుం దేమో! నన్నిలా ఎటైనా పోయిరమ్మం టావా? "

గోకారి అలా అడగ్గానే స్నేహమేరా జీవితం! స్నేహమేరా శాశ్వితం అని గొంతెత్తి పాడాలనిపించింది భాస్కర్రావ్‌కి.

"నీ దయ..." అన్నాడు నిండుగా నవ్వుతూ.

దాంతో మిత్రుడి ఆంతర్యాన్ని గ్రహించి... "సరే వస్తాన్రా. ఏదన్నా సినిమాకీ గట్రా పోయి సాయంత్రం నువ్ షాప్ క్లోజ్‌చేసే టైంకి తిరిగొస్తా మళ్ళీ" అంటూ బైటకి దారి తీశాడు గోకారి.

"ఎంత మంచివాడవురా! ఎన్నినోళ్ళ పొగ డుదురా" అని కూడా గొంతెత్తి పాడాలనిపిం చింది భాస్కర్రావ్‌కి. కానీ పాడలేదు.

ఎందుకు పాడుతాడు? ఎలా పాడు తాడు? తన గాత్రమాధుర్యం గురించి అత నికి మాత్రం తెలీదా ఏంటి?

గోకారి వెళ్ళిపోయాక నవ్య రాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్న భాస్కర్రావ్‌కి ఆమె ఎంతసేపటికీ రాకపోయేసరికి చిరాకే సింది.

"ఎందుకోయ్ అంత చిరాకు? నువ్ షాపుకి రా అనగానే ఆమె వెంటనే వచ్చితీ రెయ్యాలని రూలుందా ఏంటి? ఆమేవన్నా నువ్ కట్టుకున్న భార్యా? అసలామాటకొస్తే కట్టుకున్న భార్యలే మొగుళ్ల మాటలు విన టంలేదీ రోజుల్లో" అంటూ దెప్పిపొడిచింది అతని అంతరాత్మ అతని చిరాకున్చూసి.

"నా బాధ నాది. నీ గోల నీది. ఆపు నీ సొద" అంటూ అంతరాత్మని కసురుకు న్నాడు భాస్కర్రావ్.

ప్రస్తుతానికి కట్టుకున్న భార్య కాకపో వచ్చు కానీ రేపు కట్టుకోబోయే భార్యేకదా? 'భావి భర్త' మాటను ఆపాటి గౌరవించదా ఏంటి? అనుకున్నాడు మనసులో ధీమాగా.

"నువ్వామె 'భావి భర్త'వన్న గ్యారంటీ ఏంటి? " అంటూ అంతరాత్మ మళ్ళీ నోరు





విప్పబోతుంటే ఆగ్రహాన్ని అణచుకోలేక 'చంపుతా నోర్ముయ్" అంటూ గట్టిగా అరిచే శాడు భాస్కర్రావ్.

సరిగ్గా అదేక్షణంలో ఆ లెండింగ్ లైబ్ర రీలో కాలుపెట్టిన నవ్య, ఆ అరుపుకి బిత్తర పోయింది.

"ఎవర్నండీ మీరు చంపుతానంటోంది? "

కొంపదీసి నన్నుగాని కాదుకదా? అన్న ట్టుగా అడిగింది నవ్య.

భాస్కర్రావ్ బిత్తరపోయాడా ప్రశ్నకి? ఎందుకంటే అతగాడామె రాకని గమనించ లేదుకదా? "మి... మి... మీరా? " అన్నాడు ఆనందపడిపోతూ. అంటే ఒక పక్క బిత్తరపోతూనే మరోపక్క ఆనందపడి పోయాడు.

"ఆc నేనే! అప్పుడే ఎవర్ని మీరు చంపు తానంటోంది? నన్నేనా? " అంది నవ్య నవ్వుతూ.

బల్లెంతో గుండెల్లో పొడిచినట్టుగా అని పించింది భాస్కర్రావ్‌కి. "హుc ఎంత మాటన్నావు దేవీ? నా ప్రియాతి ప్రియ మైన నిన్ను నేనెందుకు చంపుతాను" అను కున్నాడావేదనగా.

కొంచెం మార్పుతో అదేమాట పైక్కూడా అన్నాడు.

"ఛఛ... మిమ్మల్నెందుకు చంపుతా నండీ? మీరు నాకెంతో ఇష్టమైన వ్యక్తి. ఇష్టమైన వ్యక్తుల్ని చంపుకుంటారా ఎవ రైనా? "

"నేనంటే నీకిష్టమని ఇన్నాళ్ళకు చెప్పాలని పించిందా నాయనా!" అనుకుంది నవ్య మనసులో జాలిగా.

"నన్ను కాకపోతే మరెవర్ని? "

"నా అంతరాత్మని..." సంకోచించకుండా రకీమని నిజం చెప్పేశాడు భాస్కర్రావ్.

"ఏం చేసింది మీ అంతరాత్మ? "

నవ్య అలా అడిగేసరికి ఇంక సమయాన్ని వృధా చేస్కోవాలనిపించలేదు భాస్కర్రా వ్‌కి. ఫలితం ఏమైనా కానీ, తన దేవికి నిజం చెప్పేసేయాలి అనుకున్నాడు.

అంతే! ఆ మరుక్షణం అతను జేబులోంచి సూర్యతుల్యమైన ప్రేమలేఖని బైటికి తీశాడు.

దాన్ని ఆమె చేతిలో పెడుతూ అన్నాడు.

"దీన్ని చదవండి... మీకంతా తెలు స్తుంది? "

"ఏమిటిది? " అంది నవ్య మురిగ్గా ఉన్న ఆ కాగితంకేసి- అంటే 'సూ.తు. ప్రేమలేఖ' కేసి అసహ్యంగా చూస్తూ.

"అది నా హృదయం... విప్పి చదవండి మీకే తెలుస్తుంది"

నవ్యకి చూచాయగా విషయం అర్థ మైంది. ఎట్ ది సేమ్‌టైమ్ అతనిమీద జాలి ముంచుకొచ్చింది.

"మీ హృదయమా? మీ హృదయం ఇంత మురిగ్గా, నలిగిపోయి, చిరిగిపోవడా నికి సిద్ధంగా ఉందేంటి? " భాస్కర్రావ్ 'హృదయం'కేసి కంపరంగా చూస్తూ అడి గింది.

నిజమే! ముట్టుకోవడానికే డోకొచ్చేంత అసహ్యంగా మాసిపోయి ఉంది. అతనం దించిన ఆ సూర్యతుల్యమైన ప్రేమలేఖ.

మాసిపోదూ మరి? ఇంచుమించు రెండు నెలల్నుండి అది అతని జేబులో నలుగుతూ ఉందాయె!

భాస్కర్రావ్ సిగ్గుపడిపోయాడామె ప్రశ్నకి.

"సారీ అండీ! దీన్ని రెండు నెలల క్రితం రాశాను. అప్పట్నుంచి నా జేబులో నలు గుతూ ఉందిగదా. అందుకే అలా అయిపో యింది"

"ఏమిటిది? ప్రేమలేఖా? " నవ్య జాలిగా చూస్తూ అడిగింది.

"చదవండి మీకే తెలుస్తుంది? " అన్నాడు భాస్కర్రావ్ ధైర్యంగా. అతన్లో ఆ క్షణాన మొండితెగింపు ఏర్పడిపోయింది.

నవ్య మాట్లాడకుండా ఆ కాగితాన్ని మడ



తలు విప్పింది.

ఆమె కళ్లు సూర్యతుల్యమైన ఆ ప్రేమలే ఖలోని అక్షరాల వెంబడి పరుగులు తీశాయి.

చదవటం ముగించాక దాన్ని తిరిగి మడతలు పెడ్తూ గుప్పిట బిగించి పట్టుకుంటూ జాలిగా అడిగింది నవ్య- "నామీద ఇంత ప్రేమున్నవారు ఇన్నాళ్లు ఎందుకు వ్యక్తం చేయలేదు? "

"మొదట్లో ధైర్యం చాల్లేదండీ! చెప్దామనే రోజూ అనుకునేవాడ్ని. కాని తీరా మిమ్మల్ని చూసేసరికల్లా నోరు పెగిలేది కాదు. అందుకని.. ఇక నా నోటితో చెప్పటం నావల్ల కాదని... ఇలా లేఖ రాశానన్నమాట..." అంటూ సిన్సియర్‌గా నిజాన్ని ఒప్పుకున్నాడు భాస్కర్రావ్.

"రాశారు సరే. రాసినరోజే దాన్ని నాకెందుకివ్వలేదు? "

"దీన్ని మీకివ్వటానిక్కూడా ఆరోజు నాకు ధైర్యం చాల్లేదండీ!" మళ్లీ సిన్సియర్‌గా నిజమే చెప్పాడు భాస్కర్రావ్.

"ధైర్యం చాలకనే ఆరోజు మీతో ఏదో కథ రాశాననీ, అదనీ, ఇదనీ అబద్ధం చెప్పాను"

భాస్కర్రావ్ అలా అంటుంటే నవ్య కళ్లలోని జాలి ద్విగుణీకృతమైంది.

"పోనీ ఆ మర్నాడైనా సాహసించి ఇవ్వలేకపోయారా? "

"ఇద్దామనే అనుకున్నానండీ! కానీ ఆరోజు ఇంటికి వెళ్ళేసరికి మా గోకారి వాళ్ళ మదర్‌కి సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వచ్చింది..." అంటూ ప్రారంభించి విషయం యావత్తూ చెప్పుకొచ్చాడు భాస్కర్రావ్. పన్లోపనిగా తన పుట్టుపూర్వోత్తరాలతో సహా, తన జీవిత గాథనంతట్నీ వివరించేశాడు.

అంతా విని జాలిగా నిట్టూర్పు విడిచింది నవ్య.

గుప్పెట ఉన్న మురిక్కాగితాన్ని అతని చేతికి తిరిగిచ్చేస్తూ అంది... "అయామ్ సారీ భాస్కర్రావ్‌గారూ!"

బాచీ అనబడే భాస్కర్రావ్ గుండెల్లో గునపం దిగబడిన లేడిలా గిలగిల్లాడిపోయాడు.

"నా హృదయాన్ని నాకు తిరిగిచ్చేస్తున్నారేంటీ? అంటే మీరు నా ప్రేమని ఏక్సెప్ట్ చేయటం లేదా? " నూతిలోంచి మాట్లాడుతున్నట్టుగా అడిగాడు.

అతని కళ్లు వర్షించటానికి సిద్ధంగా ఉన్న మేఘాల్లా అయిపోయినై.

నవ్య అతనికేసి ద్విగుణీకృతమైన జాలితో చూస్తూ అంది. "యూ ఆర్‌టూ లేట్ మిస్టర్ భాస్కర్రావ్! మీరీ లేఖని నాకారోజే అందించి ఉంటే మీ ప్రేమని ఏక్సెప్ట్ చేసుండేదాన్నేమో! కానీ ఇప్పుడు సమయం మించిపోయింది. ఇరవైరోజుల క్రితం నాకు పెళ్లి చూపులు జరిగాయి. ఆ అబ్బాయి బాగానే ఉన్నాడు కాబట్టి, నేను ప్రత్యేకంగా ఎవర్నీ ప్రేమించటం లేదుకాబట్టి, అతన్ని చేసుకోవటానికి నా అంగీకారాన్ని తెలిపేశాను. నా పెళ్లి అతన్తో నిశ్చయమైపోయింది. ఇంక ముహుర్తాలు పెట్టుకోవటమే తరువాయి..''

గుండెకాయమీద రోడ్డురోలరు నడిపినట్టుగా అనిపించింది భాస్కర్రావ్‌కి.

"నో... అలా జరగటానికి వీల్లేదు" అంటూ అరిచాడావేశంగా.

"వీల్లేదంటే ఇప్పుడెలా? " జాలిగా అంది నవ్య. "మీ బోడిసూత్రమే మీ కొంప ముంచింది. నాతో కొంచెం ముందుగా మీ మనసులోని మాట చెప్పుంటే ఇలా జరిగేది కాదు. నేనంటే మీకిష్టమని నేనేనాడో గ్రహించాను. ఈ లెండింగ్ లైబ్రరీ నా కోసమే పెట్టారని కూడా గ్రహించాను. నాపట్ల మీగ్గల ఆరాధనను చూసి, నాలోనూ మీపట్ల ఏదో ఇష్టంలాంటిది ఏర్పడింది! కానీ ఏం లాభం...? ఇన్నాళ్లు మౌనంగా ఉండి చేతులు కాలాక ఆకులు పట్టుకుంటున్నారు





మీరు"

హృదయంలో డైనమైట్లు పేల్చడం అంటే ఏంటో తొలిసారిగా అర్థమైంది భాస్కర్రావ్‌కి.

"నో నవ్యా! అలా జరగటానికి వీల్లేదు. మీరు నా భార్యకానినాడు నేను ఈలోకంలో జీవించి ఉండలేను" అన్నాడు తన ఎదురుగా ఉన్న ఏదో పుస్తకాన్ని చించిపోగులు పెడ్తూ.

అతను చేస్తున్న ఆ ఉన్మాదపు చేష్టను బట్టి అతని మానసిక స్థితిని అంచనా వేయ గలిగింది నవ్య.

ఆమెకు అతనిమీద అంతులేని జాలివేసింది.

కానీ ఏం లాభం? అప్పటికే పరిస్థితి చేజారిపోయింది.

ఒకసారి ఒక సంబంధాన్ని అంగీకరించాక ఇప్పుడితని మీద ఎంత జాలి పుడ్తే మాత్రం తను చేయగలిగిందేముంది?

ఆ సంబంధం కేన్సిల్ చేసేయండి నాన్నా, నేనీ భాస్కర్రావ్ అనే కుర్రాడ్ని చేసుకుంటాను అని తానిప్పుడు తండ్రితో చెప్పగలదా?

చెప్పినా ఆయన అంగీకరిస్తాడా?

ఇంపాసిబుల్!

"సారీ భాస్కర్రావ్‌గారూ! ఇప్పుడింక నా చేతుల్లో ఏమీలేదు. నన్ను మర్చిపోండి..." అంది అతనికేసి సానుభూతిగా చూస్తూ.

"నో... నవ్యా! అలా అనకండి! మీరు లేని నా జీవితాన్ని నేనూహించలేకపోతున్నాను... మీరు లేకుండా నేను బ్రతకలేను' ' పిచ్చిగా జుత్తు పీక్కుంటూ అన్నాడు భాస్కర్రావ్. అతనామెకేసి సూటిగా చూడలేకపోతున్నాడు. అతని శరీరంలోని ప్రతి అణువు కంపించిపోతోంది.

"కానీ బ్రతకాలి తప్పదు... ఏదో మాటవరసకలా ఇప్పుడంటున్నారే తప్ప, నా కోసం నిజంగా ప్రాణాలొదులుకోలేరుకదా? " కవ్వింపు కాదది. ఏదో నోటికలా తోచి అనేసింది నవ్య.

భాస్కర్రావ్ చివ్వున తలపైకెత్తాడు.

"అంటే మీరు నా ప్రేమని శంకిస్తున్నారన్న మాట! నేనేం మాటవరసకనటం లేదు నవ్యా! మీరు నాకు దక్కనినాడు నిజంగానే నేను ఆత్మహత్య చేసుకుని చచ్చిపోతాను" ఆఖరి నాలుగక్షరాల్నీ ఒత్తిపలుకుతూ అన్నాడు భాస్కర్రావ్.

"బెదిరిస్తున్నారా? "

"మిమ్మల్ని బెదిరించేటంతటివాడ్నా నవ్యగారూ? జరగబోయే సంగతి చెప్తున్నానంతే"

విరాగిలా నవ్వబోయాడుగాని నవ్వలేకపోయాడు. కన్నీటి పొరలగుండా నవ్యరూపం ఇప్పుడతనికి మసకమసగ్గా కన్పిస్తోంది.

నవ్యకు అతన్ని గుండెలకు హత్తుకుని ఓదార్చాలన్నంత జాలేసింది గాని- మనసు నదుపులో పెట్టుకుంది.

పూర్ ఫెలో! అనుకుంది బాధగా.

ఏదన్నా జోక్‌లాంటిది వేస్తే వాతావరణం తేలికపడ్తుందనిపించి... "మీరాత్మహత్య చేసుకునేది ఇప్పుడప్పుడే కాదుకదా! కాబట్టి మీకేం ఫర్వాలేదులెండి" అంది ఒకింత చిలిపిగా చూస్తూ.

'వాడ్డూయూ మీన్? ' అన్నట్టుగా చూశాడు భాస్కర్రావ్.

"మీరు నిదానమే ప్రధానమన్న సూత్రాన్ని పాటించే వ్యక్తికదా! అంచేత మీరిప్పుడప్పుడే ఆ పని చేయరని అనిపిస్తోంది. నిదానంగా ఆలోచించీ ఆలోచించీ, అనేక సంవత్సరాల తర్వాత, బాగా వృద్ధులైపోయాక, సహజమరణానికి కొద్దిగా ముందుగా ఆ పని చేస్తారేమో! అవునా? "

అలా అనటంలో ఆమె అంతర్యాన్ని అర్థం చేసుకోలేకపోయిన భాస్కర్రావ్ బాగా గాయపడ్డాడు ఆ మాటలకి.

"అంటే మీరు నా ప్రేమని అంత ఆషామాషీ వ్యవహారంగా తీసుకుంటున్నారన్న మాట? " కంఠం కంపిస్తుంటే బాధగా అడి

గాడు.

అతను హర్టయ్యాడని గ్రహించి నొచ్చుకుంది నవ్య.

"సారీ భాస్కర్రావ్‌గారూ! ఏదో తమాషాకి జోక్ చేశానంతే! అంటే మిమ్మల్ని కాస్త నవ్విస్తే మీ బాధ కాస్త తగ్గుతుందిక దాని అలా అన్నానంతే!"

"మీరే ఉద్దేశంతో అన్నా మీరు నాకు దక్కనినాడు నేను జీవించనన్నది నిజం నవ్యగారూ! చెప్పండి... ఈ క్షణంలోనే మీ నిర్ణయం చెప్పండి! మీ పేరెంట్స్‌ని ఎలాగోలా కన్విన్స్‌చేసి మీరు నా భార్య అవుతారా లేక నన్ను ఈరోజే చచ్చిపోమంటారా?"

అతను కాలర్ని నలిపేసుకుంటూ అలా అడుగుతుంటే అది కాస్త శృతిమించిన బెదిరింపులాగే అనిపించింది నవ్యకి.

"మీ ప్రాణం మీ ఇష్టం! మీరలా బెదిరిస్తే నేనేం చేయగలను? అవకాశం ఉన్నప్పుడు మీరు మీ ప్రేమని వ్యక్తం చెయ్యలేదు. దటీజ్ యువర్ బాడ్‌లక్ దట్సాల్! సారీ... వెరీ వెరీ సారీ" అనేసి మరి అక్కడ నిలబడలేక మరోమాటకు ఆస్కారం ఇవ్వకుండా అక్కడ్నించి వెళ్ళిపోయింది నవ్య.

హృదయం ముక్కలు చెక్కలుగా పగిలిపోతున్నట్టు, భూమి రెండుగా విచ్చిపోయి తానందులో కూరుకుపోతున్నట్టు అనిపించింది భాస్కర్రావ్‌కి.

రెండు చేతులమధ్యా తలనిరికించుకుని జీవమున్న శవంలా కౌంటర్ మీదవాలిపోయాడు.

అతని హృదయంలో సుళ్లు తిరుగుతోన్న ఆవేదనకి అంతెక్కడ?

★ ★ ★

అర్ధరాత్రిపూట ఎవరో తలుపు తడ్తుంటే ఉలిక్కిపడి లేచి కూర్చుంది కౌసల్య.

"ఇంత రాత్రిపూట ఎవరొచ్చుంటారబ్బా?'

అనుకుంటూ భర్తని తట్టి లేపింది...

"ఏమండీ ఎవరో తలుపు తడ్తున్నా"రంటూ.

"అబ్బ ఏమిటీ?" అంటూ లేచి కూర్చున్నాడు సోమసుందరం.

కౌసల్య అంటే నిజానికి కొత్త పాత్రేమీ కాదు. అవసరం రాలేదు కాబట్టి ఇంతకుముందు పేరు ప్రస్థావించబడలేదంతే- ఆమె నవ్య తల్లి. అది నవ్య వాళ్ళ ఇల్లు.

"ఎవరో తలుపు తడుతున్నారండీ" అంది కౌసల్య.

"అవును వినిపిస్తోందిలేగాని... ఇంత రాత్రిపూట ఎవరొచ్చుంటారు?" అన్నాడు సోమసుందరం ఆవులిస్తూ.

"అది అర్థంకాకే భయంవేసి మిమ్మల్ని లేపాను"

"భయందేనికి? వెళ్ళి చూద్దాంపద" అంటూ తలుపుకేసి సాగిపోయాడు సోమసుందరం. "జాగ్రత్తండీ" అంది కౌసల్య వెనకనుండి.

తలుపు దగ్గరికి వెళ్ళిన సోమసుందరం తలుపు తియ్యకుండానే ప్రక్కనే ఉన్న కిటికీలోంచి బైటికి చూస్తూ అడిగాడు...

"ఎవరదీ?"

"ఒక్కసారి తలుపు తీస్తారా?" అన్నాడు బయటున్న వ్యక్తి.

"మీరెవరు?"

"నా పేరు గోకారండీ! అర్జంటుగా మీతో ఓ విషయం మాట్లాడాలి. ప్లీజ్... తలుపు తియ్యండి"

"గోకారో పీకారో. నువ్వెవరివో మాకు తెలియదు. అలాంటప్పుడు ఈ రాత్రిపూట తలుపెలా తీస్తాను?" అన్నాడు సోమసుందరం.

"ప్లీజ్ అండీ నన్ను లోనికి రానిస్తే మీకంతా వివరంగా చెప్తాను" బ్రతిమాలాడు అవతల్నుంచి గోకారి.

"నో... నువ్వెవరివో తెలియకుండా ఈ రాత్రిపూట తలుపు తియ్యటానికి నేనేం పూల్ని కాను. విషయమేంటో చెప్పు..."

"మా భాస్కర్రావు చావుబతుకుల్లో హాస్పటల్లో ఉన్నాడండీ! మీ నవ్యని కడసారిగా





చూడాలని తపించిపోతున్నాడు... ప్లీజ్ ఒక్కసారి తలుపు తియ్యండి" దాదాపు ఏడుపు స్వరంతో అవతల్నుంచి విషయం చెప్పాడు గోకారి.

"భాస్కర్రావా వాడెవడూ? వాడికీ మా నవ్యకి సంబంధం ఏంటి? "

"అవన్నీ నేను చెప్తాను... తలుపు తియ్యండి నాన్నా!" అంది నవ్య వెనక నుండి.

ముందర గదిలో అలికిడికి మెలుకువ వచ్చి ఆమె అప్పుడే అక్కడికొచ్చింది.

సోమసుందరం వెనక్కి తిరిగి విస్మయంగా చూశాడు కూతురుకేసి.

"ఏంటమ్మా ఇదంతా? భాస్కర్రావ్ ఎవడు? వాడు చావుబ్రతుకుల్లో ఉండి నిన్ను చూడాలనుకోవటం ఏంటి? "

కౌసల్య కూడా ఆశ్చర్యంగా చూసింది కూతురికేసి.

"వివరాలు తర్వాత... ముందు తలుపు తియ్యండి నాన్నా!"

"ఆ బయటున్న గోకారో సీకారో, వాడు నీకు తెలుసా? "

"తెలుసు. మరేం ఫర్వాలేదు. తలుపు తియ్యండి. నాన్నా!"

కూతురు అభయమిస్తున్న ధోరణిలో అలా అనేసరికి తలుపు తీశాడు సోమసుందరం.

"నమస్కారం నవ్యగారూ! నేను భాస్కర్రావ్ ఫ్రెండ్... గోకారి..." లోపలికొస్తూనే అందరికీ చేతులు జోడిస్తూ నవ్యతో అన్నాడు గోకారి "భాస్కర్రావ్ విషంతాగి చావు బ్రతుకుల్లో ఉన్నాడండీ! మిమ్మల్నే కలవరిస్తున్నాడు... ప్లీజ్... దయతో ఒక్కసారి రాగలరా..." దుఃఖంతో కంఠం పూడుకుపోవటంవల్ల మాటలు స్పష్టంగా రావటం లేదు.

"ఏంటి గోకారిగారూ! ఏంటి మీరంటోంది? భాస్కర్రావ్‌గారు నిజంగా అంత పని చేశారా? " అంది నవ్య కంగారుపడిపోతూ.

"ఏంటయ్యా ఈ గోల? కామన్‌సెన్స్ లేకుండా అర్ధరాత్రిపూట మా అమ్మాయిని నీతో రమ్మంటున్నావ్? నీకసలు బుద్ధి, జ్ఞానం ఉన్నాయా? " అంటూ నవ్యవైపు తిరిగి, "ఏంటమ్మా ఇదంతా? " అన్నాడు సోమసుందరం.

ఆయనకంతా అయోమయంగా ఉంది. కౌసల్య పరిస్థితి అలాగే ఉంది.

"గోకారిగారూ! మీరు కొద్దినిముషాలు అలా కూర్చోండి. అమ్మ, నాన్నా మీరిద్దరూ లోపలికి రండి" అంటూ తల్లిదండ్రులను లోనికి పిల్చుకెళ్ళి వాళ్ళకి టూకీగా భాస్కర్రావ్ విషయం వివరించింది నవ్య.

"పూర్ ఫెలో... నిజంగానే అన్నంతపనీ చేశాడన్నమాట! ప్లీజ్ నాన్నా మనం వెళ్ళి అతన్ని చూద్దాం... మీరూ రండి" అంది ఆఖర్లో అర్థింపుగా.

"ఏంటమ్మా ఈ న్యూసెన్స్! వాడెవడో వాడి ఖర్మకొద్దీ విషం తాగితే మనం వెళ్ళి చూడ్డం ఏంటి? అర్థం లేకుండా. అంతగా అయితే రేపు వెళ్ళొచ్చులే" అన్నాడు సోమసుందరం విసుగ్గా.

కౌసల్య ఏమీ అనలేదు. మతిపోయిన దాన్లా చూస్తూ నిలబడింది.

నవ్య తండ్రి చేతులురెండూ పట్టుకుని దీనంగా వేడుకుంది. "ప్లీజ్ నాన్నా అలా అనకండి! అతను ఖర్మకొద్దీ కాదు విషం తాగింది. నామీద ప్రేమకొద్దీ తాగాడు. అతని కండీషన్ ఎంత సీరియస్‌గా ఉండకపోతే అతని ఫ్రెండ్ ఇంత అర్ధరాత్రిపూట వస్తారో ఆలోచించండి. నేనాతన్ని ఇప్పుడే చూడాలి... ఈ క్షణంలోనే చూడాలి"

"ఏంటమ్మా అర్థం లేకుండా మాట్లాడ్తావ్? ఇంతకీ నువ్వతనిమీద జాలిపడ్తున్నావా, ఇష్టపడ్తున్నావా? " కూతురికేసి అనుమానంగా చూశాడు. సోమసుందరం "నీ పెళ్ళి ఇంచుమించు నిశ్చయమైపోయిన

ఈ స్థితిలో..." అంటూ ఆయనింకా ఏదో అనబోతుంటే "ఆపండి నాన్నా!" అంటూ విసుగ్గా అరిచింది నవ్య.

"అవతల ఒక మనిషి చావుబ్రతుకుల్లో ఊగిసలాడ్తుంటే ఇప్పుడేంటి ఈ చర్చ? మిగతా విషయాలన్నీ రేపు మాట్లాడుకుందాం... పదండి" అంటూ ఇంక ఆయన అనుమతికోసం నిరీక్షించ కుండా చకచకా మళ్ళీ ముందరగదిలోకి వెళ్ళి... "పదండి గోకారిగారూ!" అంది నవ్య.

దాంతో ఇంక కూతుర్ని వారించే సాహసం చేయలేక "నడవండి నేనూ వస్తు న్నా"నంటూ తనూ బయల్దేరాడు సోమసుం దరం.

గోకారి బయట ఓ ఆటోని వెయిటింగ్‌లో పెట్టి వచ్చినందువల్ల ఓ పది పదిహేను నిముషాల్లో హాస్పటల్‌కి చేరుకోగలిగారు. వాళ్ళు వెళ్ళేసరికి ఇంటెన్సివ్ కేర్ యూనిట్ ముందున్న బెంచీపై విషణ్ణవదనాలతో కూర్చునిఉన్నారు వరహార్రాజు దంపతులూ, వెంకటలక్ష్మీ.

"ఎలా ఉందండీ!" ఆత్రంగా అడిగాడు గోకారి వరహార్రాజుని.

"మళ్ళీ స్పృహ కోల్పోయాడు... ఇప్పుడ ప్పుడే ఏమీ చెప్పలేమంటున్నారు డాక్టర్లు...' ' దిగులుగా చెప్పాడు వరహార్రాజు.

వెంకటలక్ష్మి చెంపల వెంబడి కన్నీళ్ళు ధారలుగా కార్తున్నాయి.

"ఈమె నవ్య... ఈయన వాళ్ళ ఫాదరు" తను వెంటబెట్టుకు వచ్చిన వ్యక్తుల్ని వరహా ర్రాజుకి పరిచయం చేశాడు గోకారి.

ఆ తండ్రీకూతుళ్ళు వరహార్రాజుగార్కి ముభావంగా నమస్కరించి ఊరుకున్నారు.

సౌభాగ్యలక్ష్మి నవ్యకేసి క్రోధంగా చూసింది... "నువ్వేనా తల్లీ మా బాబీకీ





దుర్గతి పట్టించిన మహాతల్లివి?" అన్నట్టుగా.

ఆ అమ్మాయివల్ల బాచీ అలా అయిపోయాడన్న ఆక్రోశం తప్పితే, నిజానికి జరిగిన దాన్లో నవ్య తప్పేమీలేదన్న సంగతి ఆవిడకీ తెలుసు?

సౌభాగ్యలక్ష్మి చూపుల్లోని ఏహ్యతని నవ్య గమనించిందిగాని, పెద్దగా పట్టించుకోలేదు.

పట్టించుకోవడానికి ఆమె మనసు మనసులో ఉంటేగా?

ఎప్పుడెప్పుడు వెళ్ళి అతన్ని తన హృదయానికి హత్తుకుని ఓదార్చుదామా అన్న ఆరాటం ఆమె మనసుని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

భాస్కర్రావ్‌కేమీ కాకూడదు...

భాస్కర్రావ్ బ్రతకాలి...

అతను బ్రతకాలేగాని... ఇప్పుడతని కోసం ప్రపంచాన్నైనాసరే ఎదిరించి తానతని భార్య కావడానికి సిద్ధంగా ఉంది.

భాస్కర్రావ్‌కీ విషయం చెప్తే ఎంత ఆనందపడిపోతాడు?

స్పృహలో లేని భాస్కర్రావ్‌కీ విషయం చెప్పటం ఎలా?

"గోకారిగారూ!.... నేను వెళ్ళి ఓసారి భాస్కర్రావ్‌గార్ని చూడొచ్చా..." కళ్ళ చెమ్మగిల్లుతుంటే కంపిత స్వరంతో నెమ్మదిగా అడిగింది.

అది విని వరహాల్రాజన్నాడు. "లేదమ్మా! డాక్టర్లు లోపలికెవ్వర్నీ అలౌ చేయటం లేదు..."

"కానీ... కానీ... నేనొక్కసారి ఆయన్ని చూడాలి" చెమ్మగిల్లిన కళ్ళు చెరువులే అయ్యాయి నవ్య అలా అడుగుతున్నప్పుడు.

సోమసుందరానికి ఈ సిట్యువేషన్ అంతా చాలా అయోమయంగా అనిపిస్తోంది.



అతనికోసం నవ్య ఏడ్వటం ఏంటి? రేపో మాపో పెళ్లికాబోతున్న ఆడపిల్ల ఇలా ఓ పరాయి మగాడికోసం కంటతడి పెట్టుకో వటం ఏంబాగు?

కూతుర్ని మందలించి అక్కడ్నించి బల వంతంగా ఈడ్చుకుపోతే బావుండుననిపిం చిందాయనకి.

కానీ అక్కడి పరిస్థితి దృష్ట్యా తననితాను కంట్రోల్ చేసుకున్నాడు.

గోకారి లోపల్నుంచి ఓ సిస్టర్ బయటికొ స్తుంటే ఆమెను సమీపించి రిక్వెస్ట్ చేశాడు.

"మాలో ఒకరు ఒక్కసారి పేషంట్‌ని చూడొచ్చా సిస్టర్? ప్లీజ్" అంటూ.

"కుదరదండీ! డాక్టర్‌గారు లోపలికెవ్వర్నీ అలౌ చేయొద్దన్నారు" అంటూ ఆమె ముందుకు సాగిపోతుంటే మళ్ళీ అర్థించాడు గోకారి. "ప్లీజ్ సిస్టర్! ఇంతసేపూ పేషంటు కలవరించిన నవ్య అనే అమ్మాయి అతని కోసం వచ్చింది... ఆమె నొక్కర్నీ ఒక్క నిముషం అలౌ చేయండి... చూసి మళ్ళీ వెంటనే బైటికొచ్చేస్తుందంతే..."

"నో సారీ..." అని మళ్ళీ ముందుకు సాగిపోయిందా సిస్టరు.

"సిస్టర్ ప్లీజ్ ప్లీజ్ ప్లీజ్" అంటూ గోకారి అడ్డం పడటంతో, ఏమనుకుందో ఏమోగాని, "సరే అలా చూసి ఇలా వచ్చేయాలి..." అంటూ అనుమతి నివ్వటమే కాకుండా, "ఎవరామె? నాతో రమ్మనండి" అంటూ వెనుదిరిగింది.

ఆమెతోపాటు ఇంటెన్సివ్ కేర్ యూనిట్ లోకి వెళ్లిన నవ్య, ముఖానికి ఆక్సిజన్ మాస్క్‌తో బెడ్‌పై అచేతనంగా పడివున్న భాస్కర్రావ్‌ని చూడగానే దుఃఖాన్ని ఆపుకో లేకపోయింది.

తనకోసం ప్రాణత్యాగానికి సిద్ధపడిన ఆ అమాయక జీవిపైపడి గుండెలు పగిలేలా రోదించాలనిపించిందామెకి.

ఆమె వెక్కిళ్లు పెడ్తూ సన్నగా రోదించటం ప్రారంభించగానే "అందుకే లోపలికెవ్వర్నీ అలౌ చేయన్ది. చూశారుగా, ఇంక బైటికి నడవండి" అంది సిస్టర్ కటువుగా.

నవ్య పమిట చెంగుతో కళ్ళొత్తుకుంటూ మౌనంగా బైటికొచ్చేసింది.

"అతనికెప్పుడు స్పృహ వస్తుందో ఏమో... కావాలంటే రేపు వచ్చి మళ్ళీ చూద్దాం.. ఇంక ఇంటికి వెళ్దాం పద" అన్నాడు సోమసుందరం ఆమె బైటకి రాగానే.

"సారీ నాన్నా! అతనికి స్పృహ వచ్చేవ రకూ నేనిక్కడే ఉంటాను. కావాలంటే మీరింటికెళ్ళి రేప్పొద్దున్నే మళ్ళీ రండి" స్థిరంగా అంది నవ్య.

అంతమంది ముందు ఆమెమీద కేకలు వెయ్యలేక "ప్లీజ్... నామాట వినమ్మా! రేపు మళ్ళీ వద్దాం అంటున్నానుగా" అంటూ బ్రతిమాలాడు సోమసుందరం.

"ప్లీజ్ సార్! ఆమెని ఉండనివ్వండి! వాడికి స్పృహ రాగానే ఆమెనే కలవరి స్తాడు..." ఆయన చేతుల్ని పుచ్చుకుంటూ ప్రాధేయపడ్డాడు గోకారి.

"అది కాదయ్యా..." అంటూ ఆయనింకా ఏదో అనబోతుంటే మధ్యలో అడ్డుపడింది నవ్య. "నేను ఉంటున్నాను గోకారిగారూ? మీరు ఆయన్ని బ్రతిమాలాల్సిన పనిలేదు"

కూతురి మొండితనానికి పట్టరాని ఆగ్రహ మొచ్చినా అతిబలవంతాన్న నిగ్రహించుకు న్నాడు సోమసుందరం.

ఓ ఆడపిల్ల తండ్రిగా ఆయన హృదయం కాఠిన్యతను సంతరించుకోబోయినా, ఆయన లోని మానవత్వం దాన్ని మెత్తగా మార్చే సింది. "సరేనమ్మా నీ ఇష్టం. నేనూ ఇక్కడే ఉంటాన్లే అయితే" అన్నాడు.

క్షణమొక యుగంగా ఓ నాలుగుగంటలు గడిచాక...

తెల్లవారుఝాము నాలుగున్నర గంటల ప్పుడు...




సిస్టర్ లోపల్నుంచి బైటికొచ్చి చెప్పింది.

"పేషంట్‌కి స్పృహ వచ్చింది. అందరూ ఒక్కసారే కాకుండా ఇద్దరేసి చొప్పున వెళ్ళి చూసిరండి. అతన్ని ఎక్కువగా డిస్టర్బ్ చేయొద్దు"

దాంతో అందరి ముఖాల్లోనూ చిరుసంతోషం చోటు చేసుకుంది.

"థాంక్యూ సిస్టర్! ప్రమాదం తప్పిపోయినట్టేనా? " ఆత్రంగా అడిగాడు గోకారి.

అవును కాదులకు మధ్యస్థంగా తలూపి ప్రక్కకు తప్పుకుంది.

"నవ్యగారూ! ముందు మనిద్దరం వెళ్దాం పదండి" అన్నాడు గోకారి.

"సడన్‌గా నన్ను చూస్తూ ఎక్సైట్ అవుతారేమో... ముందు మీరు వెళ్ళి, నేను వచ్చానని చెప్పండి..." అంది నవ్య.

అదీ నిజమేనని పించి తానొక్కడే లోనికి నడిచాడు గోకారి.

బెడ్‌మీద నిస్త్రాణగా పడుకుని ఉన్న భాస్కర్రావ్ నిర్జీవంగా చూశాడు గోకారికేసి.

అతని ముఖానికిప్పుడు ఆక్సిజన్ మాస్క్ లేదు. దాంతో మిత్రుడికి ప్రాణగండం తప్పిపోయినట్టేనని ఎవరూ చెప్పకుండానే తెలిసిపోయింది గోకారికి.

"ఎలా ఉందిరా? " అడిగాడు భాస్కర్రావ్‌ని సమీపించి.

బాగానే ఉందన్నట్టు తలాడించిన భాస్కర్రావ్, "నవ్య... నవ్య రాలేదా? నవ్యకు కబురు చేయలేదా? " అన్నాడు నీరసంగా నాలుకతో పెదవులు తుడుచుకుంటూ.

మిత్రుడి తలమీద చెయ్యేసి నిమురుతూ నిదానంగా చెప్పాడు గోకారి... "డోంట్ గెట్ ఎక్సైటెడ్! వచ్చింది... నీ నవ్య నీ కోసం బయట ఎదురుచూస్తూ ఉంది... పిల్చుకురానా? "

"నవ్య వచ్చిందా? " భాస్కర్రావ్ ముఖంలో కోటి సూర్యుళ్ళు ఒకేసారి ప్రకాశించారు. "నిజంగానా? ... నిజంగా నా నవ్య నా కోసం వచ్చిందా? "

వెయ్యేనుగుల బలాన్ని పుంజుకున్నవాడిలా భాస్కర్రావ్ ఒక్కుదుటున లేచి కూర్చోబోతుంటే, అతన్ని వారిస్తూ అన్నాడు గోకారి.

"అలా ఎక్సైట్ కావద్దు. ప్రశాంతంగా ఉండు. మరి కొద్దిక్షణాల్లో నీ నవ్య నీ కళ్ళ ముందుంటుంది. నేను వెళ్ళి తనని పంపిస్తాను... సరేనా? "

"అవతల నా ప్రియాతి ప్రియమైన నవ్య నా కోసం నిరీక్షిస్తుంటే మధ్యలో నీ సుత్తేంట్రా అప్రాచ్యపు వెధవా! వెళ్ళి తొందరగా పంపించు? " అని గట్టిగా అరవాలన్నంత ఆనందం వచ్చింది భాస్కర్రావ్‌కి.

అయినా మిత్రుడు తనకి ఎక్సైట్ కావద్దని సలహా ఇచ్చాడు కాబట్టి తగ్గిపోతూ, "ఊc" అన్నాడు.

"ఆమెను చూశాక కూడా నువ్వేం ఎక్సైట్ కాకూడదు సుమా!" అని మరో వార్నింగ్ లాంటిది ఇచ్చి, నెమ్మదిగా బైటికి వెళ్ళిపోయాడు గోకారి.

పులకిత హృదయంతో గుమ్మంకేసి చూస్తుండిపోయాడు భాస్కర్రావ్.

మరికొద్ది క్షణాల్లో తన నవ్య తన కళ్ల ముందుంటుందన్న ఊహ అతని హృదయాన్ని పులకింపచేయటం సహజమేగా మరి?

ఇప్పుడు క్షణమొక యుగంలా గడవటం భాస్కర్రావ్ వంతైంది.

కొన్ని యుగాలు గడిచిపోయాక అంటే కొన్ని క్షణాలు గడిచిపోయాక...

నవ్య నెమ్మదిగా లోనికి ప్రవేశించింది.

ప్రవేశిస్తూనే భాస్కర్రావ్ మంచంవైపు ఆత్రంగా చూసింది.

'అబ్బ! ఎంతందంగా ఎంతాత్రంగా చూస్తున్నావు నవ్యా!' అనుకోబోయాడు భాస్కర్రావ్ అంత నీరసంలో కూడా. కానీ అనుకోలేదు.

అందుక్కారణం... వొద్దు... ఎక్సైట్

కావద్దు అంటూ అంతరాత్మ అతన్ని వారించటం.

ఆమె నెమ్మది నెమ్మదిగా తనని సమీపిస్తుంటే ఆమెవేపు నీరసంగా, దీనంగా చూశాడు భాస్కర్రావ్.

ఆ చూపుకి ఆమె హృదయం నీరై పోయి... ఆ నీరు కళ్లవెంబడి ధారాపాతంగా బయటికొచ్చేయసాగింది.

"భాస్కర్రావ్‌గారూ!" అంది ఆర్ద్రంగా మంచాన్ని సమీపించి.

"ఊఁ" అన్నాడు... కాదు మూలిగాడు భాస్కర్రావ్.

"ఎంత పస్తేశారు భాస్కర్రావ్‌గారూ! మీరు నిజంగా ఇంత ఘోరానికి పాల్పడతారని నేననుకోలేదు" అంది అతని నుదుర్ని సున్నితంగా స్పృశిస్తూ.

ఆ స్పర్శకు సహజంగానే పులకరించిపోబోయాడు భాస్కర్రావ్. కానీ అంతరాత్మ "డోంట్ గెట్ ఎక్సైటెడ్" అని వారించటంతో కంట్రోల్ చేస్కుని ఆమె వేపు మరోమారు నీరసంగా, దీనంగా చూశాడు.

"ఎందుకనుకుంటారు మీరు నా ప్రేమని విశ్వసిస్తేగా? "

ఆ స్థితిలో కూడా అతనలా నిష్ఠూరంగా మాట్లాడ్తున్నందుకు నవ్యకు కోపం రాకపోగా తొలిసారిగా అతని మీద గుండెల నిండుగా ప్రేమ పొంగిపొర్లుకొచ్చింది.

"అప్పుడు నమ్మని మాట నిజమే... కానీ ఇప్పుడు నమ్ముతున్నానో లేదో మీకు మళ్లీ ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. నా కన్నీళ్లే అందుకు సాక్ష్యం" అంటూ హఠాత్తుగా ముందుకొంగి అతని నుదుటిమీద సున్నితంగా చుంబించింది నవ్య.

'డోంట్ గెట్ ఎక్సైటెడ్' అని అంతరాత్మ అరుస్తున్నా ఈసారి దాని మాటల్ని కేర్ చెయ్యకుండా భాస్కర్రావ్ పరవశించిపోయాడు.

నుదుట మీదే అయితేనేంగాక... ప్రియురాలి తొలి ముద్దా, మజాకా!

అతను పరవశించిపోవటం అయ్యాక అతని అంతరాత్మ అతని చెవిలో నోరు విప్పింది... "నీ బోడి పరవశం బాగానే ఉందిలేగాని... నీ ప్రేమని గుర్తించానంటోంది సరే, కానీ నిన్న ఏవేవో సుద్దులు చెప్పిందిగా? నిన్ను పెళ్లాడ్డానికి సిద్ధంగా ఉందో లేదో అది అడిగి తెలుసుకోముందు" అంటూ.

"ఎలా అడగమంటావ్? ఈ స్థితిలో అలా అడిగితే ఏం బావుంటుందంటావ్? " అన్నాడు భాస్కర్రావ్ అయోమయంగా.

"ఒరే పిచ్చి సన్నాసీ! ప్రతిదానికీ ఏదో ఒక మార్గముంటుందిరా! ఈ స్థితిలో అలా డైరెక్ట్‌గా అడగటం నువ్వన్నట్టు బావుండదు లేగాని, ఎలా అడగాలో చెప్తానుపట్టు" అంటూ అతని చెవిలో ఏదో ఊదింది అంతరాత్మ.

"అబ్బ! ఎంతమంచి అంతరాత్మవి నువ్వు? నీ తెలివికి నా జోహార్లు" అన్నాడు భాస్కర్రావ్ సంతోషంగా. అతని జీవితంలో అదే తొలిసారి అతను అలా తన అంతరాత్మని ప్రశంశించటం.

అంతరాత్మ ఊదుడు బాగా తలకెక్కిపోవటంవల్ల ముఖంలో పరవశపు ఛాయల్ని కూడా మిగుల్చుకోకుండా తుడిచేసుకుని, నవ్యవేపు నీరసంగా ఓ చూపు చూసి విరాగిలా నవ్వాడు భాస్కర్రావ్.

"ఎందుకు నవ్యగారూ ఇంకో గంటలో ఘడియలో చావబోతున్న నాలో మళ్లీ ఆశలు రేపుతారు? "

అతనలా అంటుంటే చటుక్కున అతని నోటికి చెయ్యడ్డం పెట్టింది నవ్య.

"నో.. అలా అనకండి భాస్కర్రావ్ గారూ? మీకేం కాదు... మీరు బతుకుతారు.. మీకు ప్రాణగండం తప్పిపోయింది"

తన నోటిమీంచి ఆమె చేతిని తప్పిస్తూ మరోమారు విరాగిలా నవ్వాడు భాస్కర్రావ్.





"ఎందుకు నవ్యగారూ? నేనిలా ఎవరి కోసం బతకాలి"

"అదేం ప్రశ్న భాస్కర్రావ్‌గారూ? నా కోసం... ఈ నవ్యకోసం... మీ నవ్య కోసం... మీరు బతకాలి... బతుకుతారు. బతకుతున్నారు! అంతే!" అంది నవ్య అతని చేతిని తన తల కానించుకుంటూ.

'తలకానించుకోకపోతే ఏం ఎదకానించుకో కూడదు!' అనుకోబోయాడుగాని, అప్పుడే అంత అత్యాశ కూడదని తన మట్టుకు తనకే అనిపించడంతో అలా అనుకోవడం మానేసి, "కానీ మీకు పెళ్లి నిశ్చయమైపో యిందన్నారుగా? " అన్నాడు దీనంగా చూస్తూ.

"అఫ్‌కోర్స్! కానీ ఈ నవ్య తల్చుకుంటే అది కాన్సిల్ అవ్వడం ఎంతసేపు? " అంటూ బిడియం లాంటిదేదో ముంచుకు రాగా చటుక్కున కళ్లు వాల్చుకుంది నవ్య.

భాస్కర్రావ్ హృదయంలో పూలజల్లు కురిసింది. తేనెవాగు పారింది. పూలతేరు సాగింది. ఇంకా ఏమేమో అయ్యింది.

ఆ ఏమేమో అవ్వడంలో అతన్లోని నీరస మంతా గాలికెగిరిపోయింది.

"థాంక్యూ నవ్యా! థాంక్యూ" అంటూ దిగ్గున లేచి నిలబడి నవ్యను గాఢంగా కౌగ లించేసుకున్నాడు.

అతనిపుడు ని.ప్ర. సూత్రాన్ని పాటించే నిద్రమొహంగాడు కాదుకదా?

ఆ దుందుడుకు చర్యకు నవ్య చలించిపో యింది.

భావిభర్త తొలిసారిగా కౌగలించుకున్న పుడు ఏ ఆడపిల్ల మాత్రం పరవశించ కుండా ఉండగలుగుతుంది?

★ ★ ★

భాస్కర్రావ్ 'ని.ప్ర' సూత్రానికి పూర్తిగా తిలోదకాలిచ్చేశాక ఇంక కథ నిదానంగా ఎందుకు సాగుతుంది?

ఆ తర్వాత జరగాల్సినవన్నీ ఎవరో తరు ముకొస్తున్నట్టు చకచకా జరిగిపోయినై!

నవ్య మొండి పట్టుపట్టి తల్లిదండ్రులను సమ్మతింపజేసింది, తను భాస్కర్రావ్‌ని చేస్కోవడానికి.

భాస్కర్రావ్ తరపున పెళ్లి పెద్దలుగా వర హాల్రాజు దంపతులే వ్యవహరించారు. భాస్కర్రావ్ వరహాల్రాజుద్వారా స్పెషల్‌గా ఉత్తరం రాయించడంతో విజయవాడనుండి రైల్వేపోలీసుగారు కూడా ప్రత్యేకంగా ఆ వివాహానికి హాజరై నూతన దంపతుల్ని ఆశీర్వదించాడు... "మొత్తానికి ఉద్యోగం కోసమంటూ బయల్దేరి ఓ ఇంటివాడివయ్యా వన్నమాట. శీఘ్రమేవ సుపుత్ర ప్రాప్తి రస్తు... శుభం!" అంటూ.

ఆయనలా ఆశీర్వదిస్తుంటే "వద్దు... అలా అనకండి!" అన్నాడు భాస్కర్రావ్ అడ్డంగా తలాడించడమే కాకుండా చేతులు కూడా ఆడిస్తూ.

తానన్నదాంట్లో తప్పేముందో అర్థంగాక బిత్తరపోతూ చూశాడు రైల్వేపోలీసు.

"అదేమిటోయ్ అలా అంటున్నావ్? ఓ... అర్థమైంది! నువ్ నిదానమే ప్రధానమనే సూక్తిని పాటించే వాడివికదా? అందుకని 'శీఘ్రమేవ' అనటం నీకు నచ్చలేదన్న మాట! సర్లేసర్లే నిదానమేవ సుపుత్ర ప్రాప్తిరస్తు"

దాంతో అక్కడున్న వారందరూ ఫక్కున నవ్వగా, భాస్కర్రావ్ ముఖంలో మాత్రం విషాదం తాండవించింది.

"అదికాదుసార్! సారీ అది కాదు చినబా బాయ్‌గారూ" అంటూ అడ్డంగా తలాడిం చాడు.

"మరి? " అన్నట్టు చూశాడు రైల్వేపోలీసు.

"నేనింక ని.ప్ర. సూత్రాన్ని పాటించటం మానేసినట్టే లెక్క! కాబట్టి మీరు శీఘ్రమేవ అన్నా ఫర్వాలేదు. కాని సుపుత్ర ప్రాప్తిర స్తుకు బదులుగా సుపుత్రికా ప్రాప్తిరస్తు అని దీవించండి" అన్నాడు భాస్కర్రావ్.

'ఎందుకలా? ' అన్నట్టు చూశాడు రైల్వేపో లీసు.

"నాకు చిన్నప్పట్నుంచీ మాతృప్రేమ నందించిన మా పెద్దమ్మ రామేశ్వరిగారు ఈ శుభసమయంలో మనమధ్య లేనందుకు నాకు చాలా బాధగా ఉంది. నాకు ముందుగా కూతురు పుడ్తే మా పెద్దమ్మ గారే తిరిగి జన్మించారనుకుని రామేశ్వరని పేరు పెట్టుకుంటాను"

అలా అంటుంటే భాస్కర్రావ్ కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

అది చూసి గోకారి, వెంకటలక్ష్మి కూడా కంటతడిపెట్టుకున్నారు.

గోకారికయితే మిత్రుడ్ని వాటేసుకుని బావురుమని ఏడ్వాలనిపించింది, అతను తన తల్లిపట్ల ప్రదర్శించిన ప్రేమాభిమానా లకు. కానీ నిగ్రహించుకున్నాడు. ఆ శుభ సమయంలో నిజానికసలు కంటతడిపెట్ట డమే తప్పు. అలాంటిది అలా ఏడ్వటం ఏం బావుంటుంది?

"విన్నారుగా చినబాబాయ్‌గారూ! మా వాడి కోరికేంటో? వెంటనే మీ ఆశీర్వాదాన్ని మార్చండి మరి..." అంటూ పెద్ద పెట్టున నవ్వేశాడు, వాతావరణాన్ని తేలిక పరచడా నికి. అక్కడి కదేదో పెద్ద జోకయినట్టు.

"అలాగే నాయనా! శీఘ్రమేవ సుపుత్రికా ప్రాప్తిరస్తు" అంటూ ఆశీర్వదించారు రైల్వే పోలీసుగారు.

అందరూ ఒక్కసారిగా ఘొల్లున నవ్వారు.

వాళ్లంతా ఎందుకలా నవ్వుతున్నారో అర్థంకాక రైల్వేపోలీసు తెల్లబోయి చూస్తుంటే...

గోకారి నెత్తిబాదుకున్నాడు.

"ఎందుకు నాయనా అలా నెత్తి బాదుకుం టున్నావు? " అన్నాడు రైల్వేపోలీసు.

"నెత్తిబాదుకోక ఏం చెయ్యమంటారు చెప్పండి! నాకింకా పెళ్లయినా కానిదే శీఘ్ర మేవ సుపుత్రికా ప్రాప్తిరస్తు అని మీరు నన్ను ఆశీర్వదిస్తుంటే" అంటూ వాపో యాడు గోకారి.

దాంతో ఆ ప్రదేశమంతా మరోసారి నవ్వు లతో మారుమ్రోగిపోయింది.

★ ★ ★

చేతిలో పాలగ్లాసుతో, తెల్లటి చీరలో, తల నిండా పూలతో అపర రతీదేవిలా శోభనం గదిలోకి కాలుపెట్టిన నవ్యకేసి అర్థ నిమీలిత నేత్రాలతో పరవశంగా చూస్తూ...

"సారీ తాతయ్యా! నేనీరోజు నీ ని.ప్ర. సూత్రాన్ని పాటించలేను" అని మనసులో తాతగార్కి క్షమాపణ చెప్పుకున్నాడు భాస్క ర్రావ్. అంతలోనే ఏదో గుర్తుకొచ్చిన వాడిలా "ఈ ఒక్క రోజనేకాదు అసలె ప్పుడూ పాటించనంతే" అన్నాడు.

"తప్పు... అలా అని తాతగార్ని బాధిం చటం మంచిదికాదు..." మధ్యలో నేనొక దాన్ని లేనూ అన్నట్టుగా నోరువిప్పింది అంతరాత్మ. "సమయం, సందర్భాలనుబట్టి అప్పుడప్పుడూ పాటిస్తూ ఉండు. లేకపోతే పెద్దాయన బాధపడ్తాడు"

భాస్కర్రావ్‌కి ఒళ్లు మండిపోయింది, శోభనం గదిలో కూడా తనని విడిచిపెట్ట కుండా అంతరాత్మ అలా నసపెడుతున్నం దుకు.

దాంతో "చంపుతా నోర్ముయ్" అన్నాడు కోపంగా.

"ఎవర్ని? నన్నా? " అంటూ అతన్ని సమీ పించింది అపర రతీదేవి.

"హుఁ... ఎంతమాటన్నావు నవ్యా? నా ప్రియాతిప్రియమైన నిన్ను నేనెందుకు చంపు తాను? " అన్నాడు భాస్కర్రావ్ ఆవేదనగా.

"నన్ను కాకపోతే మరెవర్ని? "

"నా అంతరాత్మని"

"ఏం చేసింది మీ అంతరాత్మ"

"నీ అందాన్ని కొరుక్కు తినమని బోడి సలహా ఇస్తోంది"

"అలాగా? " అంటూ చిలిపిగా ఓ నవ్వు నవ్వి... "అబ్బ మీ అంతరాత్మ ఎంత మంచిదండీ? " అంటూ నవ్వింది నవ్య.

అంతే! భాస్కర్రావ్ పరవశంతో వెనక్కి విరుచుకుపడిపోయాడు.






# 'తీగలు తెగిన సితార' పై సమీక్షలు

ఆగస్ట్ 'చతుర'లో ప్రచురితమైన కాశీ విశ్వనాథ్ రచన 'తీగలు తెగిన సితార'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## 'ట్రాజెడీ ఆఫ్ ఆర్ట్'

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

కళ కోసమే జీవితం కాని, జీవితంకోసం కళ కాదన్నంతగా కళాభారతిని నమ్ముకున్న కళాకారుల్ని కనక మహాలక్ష్మి కరుణించదన్న జీవిత సత్యాన్ని కాశీవిశ్వనాథ్‌గారు తమ 'తీగలు తెగిన సితార'లో చక్కగా చిత్రీకరించారు. రచయితకు సినిమారంగంతో ఉన్న సాన్నిహిత్యం కథా కథనానికి జీవంపోయడంలో మరింతగా దోహదం చేసింది.

జూనియర్ ఆర్టిస్ట్ సప్లయర్ సరస్వతి సినిమారంగాన్నంతటినీ ఒకే ఒక్క మాటలో వైకుంఠపాళీగా తేల్చి చెప్పిందిగానీ అసలు పార్వతి (కిరణ్మయి) జీవితమే ఒక వైకుంఠపాళీగా ఆద్యంతమూ సాగింది. జగన్నాధరావు, సుధీర్, గోపీచంద్‌లు ఆమె జీవితంలో నిచ్చెనలైతే, వరదరాజులు, మనోహర్, అగ్నివేష్‌లు ఆమె జీవిత పరమ పదసోపానానికి పాములు. చివరికి అందరికన్నా పెద్ద పాములాంటి దయానంద్ చేతిలో పడ్డ కిరణ్మయి హతాశురాలై మళ్లీ తొలిమెట్టుకి చేరుకోవడమే ట్రాజెడీ ఆఫ్‌లైఫ్. అయితే నవల చదువుతున్నపుడు ఇంత విధివంచితురాలైన కిరణ్మయి కూడా కొన్ని సందర్భాల్లో పాఠకుల ఆగ్రహాన్ని చవిచూస్తుంది. సృష్టిలో నోరులేని జంతువులు కూడా పరిస్థితులననుసరించి తమకంటూ ఒక రక్షణ కవచాన్ని, అలవాట్లను ఏర్పరచుకొని తమ ఉనికి కోసం చివరికంటూ పోరాడతాయి. అటువంటిది, పరాన్నభుక్కులాంటి వరదరాజులు కుత్సితాల్ని ఎదుర్కొని తన సౌశీల్యాన్ని కాపాడకొన్న కిరణ్మయి అగ్నివేష్‌లాంటి ఆషాఢభూతిని నమ్ముకొని 'మృగతృష్ణలో నీరు త్రాగబోయిన' చందంగా ఒకవంక తన బాగుకోరిన సుధీర్‌ను మభ్యపెట్టడం, మరొక వంక విశాల హృదయంతో అంతస్తుల్ని కూడా చూడకుండా తనతో పాణిగ్రహణానికి సిద్ధపడ్డ గోపీచంద్‌ను తాత్సారం చేసి చేజార్చుకోవడంతో పాఠకులసానుభూతికి దూరమయిపోతుంది.

మొత్తానికి ఈ నెల చతుర నవల 'తీగలు తెగిన సితార' ద్వారా కళకోసమే జీవించే కళాకారుల దైన్య జీవితాల్ని కళ్లకు కట్టినట్లుగ చిత్రీకరించిన కాశీ విశ్వనాధ్‌గార్కి అభినందనలు.

-కె.వి.రమాకాంత్
విజయనగరం-2

## 'తెగిన సితారకాదు'

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'ఏం నాటకాలాడుతున్నావా?' అనే నిందా వాచకం తెలుగులో వుంది. అయితే నిజంగానే నాటకాలాడుతూ, నిజజీవితాన్ని నాటకాలకి దూరంగా ఉంచుతూ, వాస్తవ జగత్తులో మాత్రం ఆమె నాటకాల మనిషిగానే గుర్తింపబడటం వ్యవస్థ లోపంగా చూపుతూ పార్వతి ఎలియాస్ కిరణ్మయి పాత్రని ఆగస్టు నెల చతుర నవల 'తీగలు తెగిన సితార'లో స్వచ్ఛంగా చిత్రీకరించారు రచయిత కాశీవిశ్వనాథ్.

రంగస్థల కళారంగంలో తారాపథంలోకి దూసుకుపోయిన కిరణ్మయి చలన చిత్ర

కళారంగంలో కనీసం జూనియర్ తారగానైనా నిలవకపోవటం కథాపరంగా విడ్డూరమే మీకాదు.

శీలాన్ని పణంగా పెట్టి సినిమా హీరోయిన్ కావటాన్ని తీవ్రంగా నిరసించి ఆ క్రమంలో తన తల్లిని పోగొట్టుకొని, అపనిందలు, అవస్థలు భరించి, కన్నతల్లివలె కడుపులో దాచుకునే రంగస్థల కళారంగంవైపు తిరిగి దృఢ నిశ్చయంతో అడుగులు వేయడంతో కిరణ్మయిలాంటి వాళ్లు నాటకాల్లో జీవిస్తారు, కాని నిజజీవితంలో నాటకాలు వేయరు అనే సందేశాన్ని అంతర్వాహినిగా చూపించి అర్ధవంతంగా నవలను ముగించిన రచయిత అభినందనీయుడు.

అయితే ఈ నవలకు 'తీగలు తెగిన సితార' అనే పేరు నప్పలేదు. కిరణ్మయి అసలు సితారేకాని 'తీగలు తెగిన సితార ఎలా అవుతుందనేది మిలియన్ డాలర్ల ప్రశ్న!

-ఎనగందుల వెంకటేశ్వర్లు
చెల్పూరు -505 122

## 'సినీ సంస్కృతీ దర్పణం'

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**అ**డ్డదారుల్లో అంచెలంచెలుగా ఎదిగి అత్యున్నత స్థాయికి చేరిన కొందరు సినీనటుల దురహంకారానికి ప్రతీకగా హీరో మనోహర్ పాత్రని చక్కగా చిత్రించారు. మరొక అగ్రశ్రేణి సినీనటుడు అగ్నివేష్ బాధ్యతారహిత ప్రవర్తన, మితిమీరిన ఆడంబరం, ఆచరణలో పెట్టాలన్న నియమంగాని నిజాయితీ గాని లేని వాగ్దానాలు కూడా వారి డాంబిక పటాటోపాన్నే తెలియజేస్తాయి.

కాశీ విశ్వనాథ్‌గారు నేటి చలనచిత్ర నట జీవితాన్నే కథాంశంగా తీసుకుని కథానాయకి కిరణ్మయి పాత్రని మహోన్నతంగా చిత్రీకరించారు.

జీవితంలో ఎన్నికష్టాలెదురైనా కిరణ్మయి అన్నిటినీ భరించి తన శీలాన్నికాపాడుకోగలిగింది. ప్రాణంకన్న శీలం మిన్న అనే మహిళా సంస్కృతికి ప్రతిబింబంగా కిరణ్మయి పాత్రని చిత్రీకరించారు.

"నేను నటిగా ఓడిపోయి పారిపోవటంలేదు. నా వ్యక్తిత్వాన్ని ఓడించాలని ప్రయత్నించే మనుషుల్ని ద్వేషిస్తూ వెళ్లిపోతున్నాను''

అని కథానాయకితో అనిపించి కథ ముగించటం సముచితంగా వుంది.

వ్యాపార దృష్టితో పత్రికలు అశ్లీల సాహిత్యాన్ని గుప్పిస్తూ సాహితీ ప్రపంచాన్ని కలుషితం చేస్తున్న ఈ కాలంలో తీగెలు తెగిన సితార వంటి ఉత్తమ నవలల్ని నెలనెలా ఆంధ్ర పాఠకలోకానికి అందిస్తున్న చతుర మాసపత్రికకి మా హృదయపూర్వక అభినందనలు.

-సూర్యదేవర శారద
హైద్రాబాద్- 500 062

## 'పరాజిత'

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**'తీ**గలు తెగిన సితార నవల నాటక, సినీరంగాలలోని కళాకారుల స్థితిగతుల గురించి సమీక్షించడంలో సఫలమైనా అసమగ్రంగా ఉందనిపించింది.

నాయిక పాత్రను ఉదాత్తంగా తీర్చిదిద్దాలనే తపనతో మానవ సహజమైన లక్షణాలకు విరుద్ధంగా ఆమెను తయారుచేశారు. అగ్నివేష్ కావలసిన డబ్బు ఇస్తానన్నప్పుడు తీసుకోకపోవడం,అంతగా ఆదరిస్తున్న సుధీర్‌తో కూడా తనకొచ్చిన ఆఫర్ల గురించి సంప్రదించకపోవడం, గోపీచంద్‌ను మర్యాదపూర్వకంగానో, మనసు తెలుసుకొందామనో





కలిసే ప్రయత్నం చేయకపోవడం ఇవన్నీ సహజత్వానికి దూరంగా ఉన్నాయి.

నాటకరంగంలో ఉన్న వారి కుటుంబ పరిస్థితులూ, వారి చుట్టూ ఉన్న వాతావరణం ఎంతో సహజంగా చిత్రీకరించిన రచయితకు సినిమారంగంలో సుధీర్ తప్ప మంచివారెవరూ కనబడకపోవడం ఆయన పాక్షికతను చూపిస్తోంది.

కిరణ్మయి సినీ జీవితాన్ని దుఃఖాంతం చేద్దామని కంకణం కట్టుకొని బ్రోతల్ కేసు గొడవ చొప్పించినట్లయింది. అంతకాలంగా సిటీల్లో ఉంటూన్న కిరణ్మయి సుధీర్ ఉంటున్న హోటల్‌కి ఫోన్ చేసి ఉండాలి. చేతిలో నాలుగు రూపాయలే ఉన్నప్పుడు రూపాయి పెట్టి ఫోన్ చేస్తారుగానీ మూడు ముప్పావలా పెట్టి బస్సెక్కరు. పైగా సినీరంగంలో డిస్కెషన్స్ గురించీ, క్షణక్షణానికీ మారే ప్రోగ్రాముల సంగతీ జూనియర్ ఆర్టిస్టుగా ఆమెకు పరిచితమే. కాబట్టి రిసెప్షన్‌లో అడక్కపోవడం అసంగతంగా ఉంది.

పరాజితురాలిగా కిరణ్మయిని మరలా విశాఖ నాటకరంగానికి పంపే బదులు తమిళ నాటక రంగానికో, టీవీ రంగానికో ఆమె పాత్రను మళ్లించి అక్కడ విజయాన్ని సాధించినట్లు చూపించి ఉంటే పాఠకుని మనస్సు రంజింపచేసివుండేవారు రచయిత. ఎందుకంటే ఏకబిగిన చదివించే భాషా, శైలీ ఉన్న ఈ రచయిత పాఠకుడిని పనిగట్టుకొని నిరాశపరచడం భావ్యంకాదు.

-మంజీర

హైదరాబాదు- 500 073

## 'సినీ పరిశ్రమ డొల్లతనం'

*(అయిదవ బహుమతి (రూ. 50/- పొందిన సమీక్ష)*

**వెం**డితెరపై ప్రదర్శితమయ్యే నటీనటుల అద్భుతమైన నటనను తిలకించి ఆనందించే ప్రేక్షకులకు తెరవెనుక జరిగే భాగోతాలను, చేదు సంఘటనలను కూడా 'తీగలు తెగిన సితార' చక్కగా వ్యక్తీకరించింది. సినీ రంగంలో ప్రతిభకు పట్టంకట్టడం రానురాను గగనకుసుమమవుతుందన్న రచయిత ఆవేదన ద్యోతకమైంది.

తన అవసరాలకోసం మరొకరిచెంత చేరి వారి మెప్పుపొంది పనులు పూర్తి చేసుకునే వరదరాజులు లాంటివాళ్లు ఈ సమాజంలో అడుగడుగున దర్శనం ఇస్తూనే వుంటారు. ఇటువంటి మేకవన్నె పులులను గుర్తించి, జాగ్రత్త పడవలసిన ఆవశ్యకతను రచయిత అంతర్లీనంగా సూచించడం బాగుంది. అయితే మన వ్యక్తిత్వం చెక్కుచెదరనిదయితే ఈ వరదరాజులులాంటివాళ్లు మనలనేమీ చేయకపోగా వారే పతనం అవుతారు అని చెప్పిన తీరు ఇంకా బాగుంది.

ఈ నవలలోని పాత్రలలో కిరణ్మయి పాత్ర కలికితురాయి లాంటిది. తండ్రి బాధ్యతారాహిత్యం, తమ్ముడి జులాయితనం లాంటి నిత్య సమస్యలతో విసిగివేసారిన కిరణ్మయి వరదరాజులు కల్పించిన ఆశలతో చిత్రరంగంలో అడుగిడి భంగపడడంద్వారా రచయిత సినీపరిశ్రమలోని డొల్లతనాన్ని పాఠకులకు తెలియచెప్పారు. అయితే సినీపరిశ్రమలో కూడా ప్రతిభకు పట్టం కట్టేవాళ్లు లేకపోలేదు. అసోసియేట్ డైరెక్టర్ సుధీర్‌కుమార్, కిరణ్మయికి అవకాశమివ్వడానికి ముందుకొచ్చిన టి.వి. సీరియల్ నిర్మాతలు, దర్శకులు ఇందుకు ఉదాహరణలు.

చక్కని కథనం; వరదరాజులు పాత్ర పలికిన శక్తిమంతమైన సంభాషణలను నవలకు ఆయువుపట్టుగా మార్చి ఆద్యంతం ఆసక్తికరంగా చదివేలా చేసిన రచయితకు అభినందనలు!

-బి.రమేష్

మర్రిపల్లిగూడెం



# చతుర కతలు




## అమ్మ శ్రీమతీ

శ్రీమతి ఈసారయినా నా ఎంపిక అమోఘమని మెచ్చుకుంటుందని ఊహిస్తూ ఇల్లు చేరాను.

రిక్షాలోంచి సాయం పట్టి దించాను.

"బాగుందా?"

"చాలా బాగుందండీ... కానీ'' నొసలు చిట్లించింది. కానీ అని మాటలకి 'కామా' పెట్టిందంటే ఏ బాంబో పేలుస్తుందని అర్థం.

ఏమిటన్నాను.

"అదేంటండీ! మళ్లా!!" అర్థోక్తి కూడా!

"ఏం! క్రితంసారి గులాబీపూల డిజైన్‌ది తెస్తే పల్లెటూరి గబ్బిలాయిలు సారెకు పంచిన డిజైన్ అన్నావు. ఇపుడేమో 'గ్రే కలర్ అఫీషియల్ అని తెస్తే యింకా వంకలు పెడ్తున్నావు," నన్ను సమర్థించుకోవద్దూ!

"అదికాదండీ! మా నాన్న యిచ్చింది చాలకనా! మరల మిమ్మల్ని డబుల్‌కాట్ ఎందుకు మోసుకు రమ్మంటాను'' అంది గడుగ్గాయి.

అర్థమైపోయింది.

డబుల్ కాట్‌ల నిరాకరణోద్యమం యిటీవలే చేపట్టింది. అందుకనే ఏదో విధంగా అలిగి సాధిస్తోంది. ఇప్పటికి రెండు డబుల్ కాట్‌లు తనే స్వయంగా అమ్మేసింది. తీరా ఇప్పుడు కూడా అదే వుద్యమం కొనసాగింపు''

"అలాగే కానీండి!"

"ఇదివరలో సింగిల్ కాట్‌లు రెండు కొనమన్నావు నిజమే. కానీ బుల్‌బుల్ వుండద్దూ'' అన్నాను.

బుల్‌బుల్ అంటే డబ్బన్న అర్థం ఆమెకూ తెలుసు. "బుల్‌బుల్ మీకు లేకపోతే నాల్రోజులాగి కొనండి.. అంతే తప్ప ఈ




డబుల్‌కాట్‌లు నాకొద్దు..." తెగేసి చెప్పింది.

అంతే తిరుగుబాణంలా మరో రిక్షాలో మోసుకెళ్లి షాపు వాడికిచ్చేశాను.

తిరిగిచ్చినందుకు చిన్న సైజు పోట్లాట కూడా షాపువాడితో. ఇది జరిగిన నెలలో ఏవో రావలసిన బకాయిలు అందటంతో మా ఆవిడలో పేచీ అంకురించింది. అది మానని పుండులా ఎదిగి పిచ్చి రూపం దాల్చింది. దాన్ని భరించలేకనే ఓ కార్పెంటర్‌ని బెత్తాయించి మరీ ఆవిడగారికిష్టమైన రీతిలో రెండు సింగిల్ కాట్‌లు తయారుచేయించాను. బుల్‌బుల్ ఇవ్వడమే నావంతు.

"ఇప్పుడు నీకు హాయిగా వుందా? సింగిల్ కాట్లంటూ తెగతినేసావు. ఏం విశాలంగా ఓ పెద్ద డబుల్ కాట్ చేయించుకుంటే మనకి సరిపోదూ. పిల్లాపీచా!" ఉక్రోషంగా అన్నాను. కారణం నా ఎరియర్స్ బుల్‌బుల్ హుష్‌కాకి కదా!

"అయినా సింగిల్ కాట్లంటూ అంత పట్టుదలేంటి?" నిలదీశాను.

"ఎందుకేంటి? మనిద్దరి మధ్య అప్పుడప్పుడు వాదన పెరిగి, చిలికిచిలికి గాలివానగా మారి ఎడమొగం, పెడమొగం అవుతుంటాంగదా! ఆ సమయంలో ఒకే మంచంమీద పడుకోవటానికి అటు మీకూ ఇటు నాకూ అహం అడ్డొస్తుంది. అలాంటప్పుడు సింగిల్ కాట్స్ లేకపోతే ఎలా?" అందావిడకోపంగా!

"అమ్మ శ్రీమతీ ఇదా నీ ప్లాన్' అనేశాన్నేను.

-కె.కె.రఘునందన

---

## కిటుకు

**ప**ట్టాభికి పట్టుమని పాతికేళ్ళు లేవు.

ఇంకా పెళ్లవలేదు.

మనిషి అందగాడే.

కానీ పాపం!

ఆ ఒక్క లోపం అతడికో పెద్ద శాపమై, సంతోషాన్ని దూరం చేస్తోంది.

అప్పటికీ పట్టాభి ఎంతోపట్టుదలగా కృషిచేశాడు. ఆ అవరోధాన్ని అధిగమించడానికి. తనకున్న ఒక్కగానొక్క మైనస్ పాయింట్‌ని తుడిచేసుకోడానికి శాయశక్తులా పాటుపడ్డాడు. ఫలితం దక్కలేదు. వృధాప్రయాసే మిగిలింది.

మిత్రులంతా తనని పొట్టాభి అని పిల్చినా, ఓ బొజ్జ గణపయ్య అని సరదాగా పాటలు పాడినా, పట్టలేని ఉక్రోషానికి గురవుతాడతను.

భారీగా పెరిగిన తన ఉదరం, బోర్లించిన కుండలా కన్పిస్తుంటే భోరుమని ఏడవాలని పిస్తుంది పట్టాభికి.

"నువ్వెక్కడ దాపురించావే నా ప్రాణానికి? నిన్నెలా వదిలించుకోవాలో తెలీక ఛస్తున్నాను. పోనీ, వస్తే వచ్చావు, పెళ్లయింతర్వాత రావొచ్చుగా! ఇప్పుడు చూడు ఈ పొట్టతో పెళ్లిచూపులకి వెళ్తేఏ అమ్మాయి ఇష్టపట్టం లేదు'' అనీ...

"ఏం చేస్తాం? ఈ జన్మకింతే. పెళ్లీ, పెటాకుల్లేకుండా, ఈ పొట్టని మోస్తూ తిరగడమే నాకు రాసిపెట్టాడు దేవుడు..." అనీ ఓ నిర్ణయాని కొచ్చాడు, పట్టాభి.

అయితే కొన్ని నెలల తర్వాత...

ఒకరోజు నిలువుటద్దంలో తన ప్రతిబింబాన్ని పరీక్షగా చూసుకున్న పట్టాభి పట్టపగ్గాల్లేని ఆనందానికి లోనయ్యాడు.

కారణం తన పొట్ట పూర్వంలాలేదు. గుట్టుచప్పుడు కాకుండా ఎప్పుడు ఎలా నిష్క్రమించిందో?

ఎలా సాధ్యపడింది? ఇది కలకాదు. కోరుకున్న నిజం. ప్రియమైన యదార్థం.

"గురూ! నీ బొర్రని బొర్రాగుహలకి



పంపించావా?"

"ఏం చిట్కా ప్రయోగించావోగానీ, మొత్తానికి భలే స్లిమ్‌గా తయారయ్యావు''

"ఆ కిటుకు మాకూ చెప్పవా?" అని కొలీగ్స్ బ్రతిమాలుతూంటే...

పట్టాభి గర్వంగా చూడసాగాడు. "చెప్పనంటే చెప్పను. ఇన్నాళ్లూ 'బోండాం, బోండాం' అని నన్నేడిపిస్తార్రా? ఇప్పుడు ఆ రహస్యం కోసం మీ రేడవండి. మీరెంత గింజుకు చచ్చినా నా పొట్ట తాలూకు గుట్టు విప్పనుగాక విప్పను'' అంటూ అతిశయంతో ఫోజిచ్చి, మీసం దువ్వేడు.

ఇప్పుడు పట్టాభి షర్టు ఇన్‌షర్ట్ చేసి యమస్టైలుగా వస్తున్నాడాఫీసుకి.

ఊబకాయం తగ్గి, ఉత్సాహంతో ఉరకలేస్తున్నాడు.

ఐరన్‌లెగ్ శాస్త్రిలాంటి ఆకారం హఠాత్తుగా ప్రభుదేవాలాంటి క్రేజీ పర్సనాల్టీలోకి ఎలా మారిందనేది పట్టాభికేతెలుసు. అయితే అది చాలా ఆలస్యంగా తెలిసొచ్చింది.

"పట్టాభీ! ఓ సారొస్తావా?" 'ఇంటర్‌కాం'లో ఆఫీసర్‌గారి ఆదేశం!

"అలాగే సార్' అనిఫోన్ పెట్టేశాడు పట్టాభి.

"రాక ఛస్తానా? ఇప్పటికి 8 సార్లు పిల్చావు. మళ్లీ ఈ సాయంత్రంలోగా ఇంకో 8 సార్లు పిలుస్తావు. నా దుంప తెంచుతున్నావు కదయ్యా మగడా! నువ్వుండేది నాలుగో అంతస్తులో, నా సీటు సెకండ్ ఫ్లోర్‌లో చీటికిమాటికి పైకి కిందకూ తిరగడం, మెట్లు ఎక్కడం, దిగడం... నాకిదే ఉద్యోగమైపోయిందే'' అని బాధపడేవాడు పట్టాభి.

"నువ్వెక్కడి ఆఫీసర్‌వయ్యా బాబూ? పాత ఆఫీసర్ వారానికి ఒకటి రెండుసార్లు మాత్రమే పిల్చేవాడు. పైగా ఆయన మా ఫ్లోర్‌లోనే ఉండేవాడు. నువ్వు నన్ను స్థిమితంగా పదినిమిషాల పాటన్నా కూర్చోనివ్వడంలేదు'' అని వాపోయేవాడు, పట్టాభి.

కానీ 'కష్టేఫలి...' త్వరలో పెళ్లికొడుకు కూడా కాబోతున్నాడు పట్టాభి!

అదీ అసలు సంగతి!

-అవధానుల సుధాకరరావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942.

CHATURA Telugu Monthly Hyderabad–500 482 Regd. No. H/HD/402

# ఇలా చదవండిది, అలా తెలుసుకుంటారిక ఇకనుంచీ నీలిమందుని ఎందుకసలు వాడనేవాడరో అనే సంగతినిక !



సాధారణ 'బ్లూ' నీటిలో గడ్డలు కట్టడంతో మీ బట్టల పైన మడ్డి నీలి మరకలు పడుతాయి.

వైజ్ఞానికంగా రూపొందించిన, శక్తివంతమైన మైక్రోడిస్పర్సన్ ఫార్ములేషన్ కల్గిన 'ఉజాలా' నీటిలో అంతటా సమంగా కరిగిపోయి, మీ బట్టలకు ఇస్తుంది మిరుమిట్లు గొలిపే తెల్లదనం.

## కొత్త ఉజాలా ఫేబ్రిక్ వైట్‌నర్.
## మీ బట్టలకి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నితెచ్చే మచ్చలేని మంచి ఉపాయం.

నీలిమందు మీ బట్టలపైన చారల మరకల మచ్చల అవశేషాల్ని వదిలిపెడుతుంది, అయినా అతి పురాతనమైన ఆ నీలిమందును కలకాలంగా వాడుతూనేవున్నారు జనం – కారణం, దానికి బదులుగా మరొకటి లేకపోవడం. అది పాతమాట, వచ్చేసింది యిప్పుడిక ఉజాలా – బట్టలకు తెల్లని తెలుపునిచ్చే శాస్త్రీయమైన ఫేబ్రిక్ వైట్‌నర్. నాణ్యగల పదార్థాలతో, శాస్త్రీయమైన ప్రక్రియతో అబ్బింది దానికి ఆ లక్షణం.

<u>వి+ గల వైట్‌నర్ ఉజాలా</u>

అసలు వి+ ఎందుకని? ఏంచేస్తుంది మీ బట్టలకి యిది? మరి గమనించారా యిది – బట్టలని డిటర్జంట్‌తో ఉతికిన ప్రతిసారీ వాటి కళని పోగొట్టుకుంటాయి. నిజానికి డిటర్జంట్లు, మాసిన బట్టలలోని మురికిని మాత్రమే తీసివెయ్యగలవు కానీ ఆ ప్రక్రియతో బట్టలు పాతపోయినట్లు కనిపిస్తాయిక. మరి నీలిమందు, నీటిలో మడ్డి పదార్థాలను వదలటంతో అవి మీ బట్టలపైన చారల మరకల్ని వేస్తాయి. ఇక ఉజాలాలోగల 'మైక్రో డిస్పర్సన్ కేటలిస్ట్ వి+' నీటిలో సరిసమానంగా కరిగిపోయే, బట్టల పోగుపోగులోకి తక్షణమే చొచ్చుకు పోయే, వాటికి మిరుమిట్లుగొలిపే తెల్లదనాన్నిచ్చే ఒకేఒక వైట్‌నర్. అదే వి+ ప్రత్యేకత.

<u>మిరుమిట్లుగొలిపే తెల్లదనం – చూడండి ప్రత్యక్షంగా మీకు మీరే</u>

మరొక పనికొచ్చే కిటుకు – ఉజాలా, కేంద్రీకృతమైన గాఢతగల ద్రవం కావడంవలన, కొద్దిచుక్కలు వేస్తే చాలు యిది. పొదుపే పొదుపు. ఆ మిరుమిట్లుగొలిపే తెల్లదనపు అత్యుత్తమ ఫలితాలకోసం, పక్కన సూచించిన పద్ధతుల్ని అనుసరించండి. అనుభవంలోకి వస్తుంది మీకే.

ఇక చారల మచ్చలుపడే నీలిమందును ఎందుకు వాడాలి, పట్టుక్కూర్చో వాలిగనక? ఉందిగదా తెల్లదనాన్నిచ్చే కిటుకు ఉజాలా, వుందిగదా అందుబాటులో?

### నీలిమందుకన్న ఎంతో మరెంతో మెరుగు

**ఉజాలాని సరిగ్గా వాడటానికి అంచెలు అంచెలుగాగల పద్ధతి**

1. ఉజాలా బాటిల్ లోపలి మూతకి సన్నని చిల్లు పొడవండి.
2. మీకు కావలసిందల్లా ఒక లీటరు నీటికి 4–5 చుక్కలు.
3. ఉతికిన బట్టల్ని నీటిలో ముంచి వుంచండి.
4. బట్టల్ని మెల్లిగా జాడించండి కొద్ది క్షణాల సేపు. వాటిని ఆరనివ్వండి.

కేవలం 4 చుక్కలు చాలిక !




UJALA

జ్యోతీ లేబరేటరీస్, బొంబాయి వారి నుంచి.

Situations/JL/22